# వ్యత్యాసాలు

=== కథా సంపుటి ===

అందే నారాయణ స్వామి

నవ్య సాహిత్య పరిషత్తు

గుంటూరు

# పీఠిక

అందే నారాయణస్వామి గారు రచించిన కథా
త్రియము చదివినాను. అవి చక్కగా ఉన్నవి. కథా
విషయములు మామూలువి గాక ఇప్పుడు మానవకోటి
హృదయాలను కలవరపరుస్తున్న తీవ్రసమస్యలు. ప
ఫలం, పుత్రసంతానం, పరివర్తనం అనే మూడుకథలూ
భాషలోను భావములలోను కొత్త మార్గము నేతొక్కినవి.
కవికి ఆంగ్లభాష వచ్చునేమో గాని వాక్యరచనలలో
ఆంగ్లసాంకర్యము లేదు. సంస్కృత పరిచయము కల
దేమో కాని అంతటనూ తెలుగుతనమే ఉట్టిపడు
తున్నది. చిన్నవాక్యములు, ముద్దు లొలికే తెలుగు
పదములు తేనెల తియ్యదనమును చవి చూపే జాతీయ
ములు కథలు మూడింటికి గల సామాన్య లక్షణాలు.
భాష ఎక్కడా పేలవముగా లేదు. తెలుగురచన ఇ
ట్లుండవలె.

"ప్రతిఫలం" కథలో ధనికులకు ఋణగ్రస్తులకు
గల సంబంధము చక్కగా వర్ణింపబడినది. పెట్టుబడిదా
ర్లందరు అట్టివాండ్లు కాకపోయినా ఊళ్ళలో మేలయిన
పొలాలూ, కలిసివచ్చే స్థలాలనూ ఏవో దోట్లు పెట్టి
లాగుకొనడము పలువురు బాకీదార్లు చేసేపనే అయినా

రయితుల దుర్గతికి కేవలము సాహుకారుల దుర్మార్గమే కారణము గాదు. అత నిచ్చే పన్నుకు ప్రతిఫలము చూపి అతన్ని బాగుచేయ ప్రయత్నించని పాలన పద్ధతే అతని దుర్గతికి ముఖ్యకారణము. అదే రైతును రుణ దాతలచేతుల్లో చిక్కించింది.

"పుత్రసంతానం" కథ మూటిలోనే లయినది. మూడవదానివలె అతి దీర్ఘము గాక ఏరాశిగా ఉన్నది. భాగ్యవంతుల యిండ్లలో పిల్లలు గారాబముగా పెరిగి యెట్లా చెడిపోతారో వర్ణింపబడ్డది. అయినా కవి ఈ కథలో చెప్పదలంచింది హిందూ కుటుంబాలలో వార సత్వ విషయమున స్త్రీ పురుష సంతానానికి గల తేడాను గూర్చి. ఇదే యీ కథలో విషయానికి ఆధునికత ఒడ గూర్చింది. గారాబమున పెరిగినపిల్లలు ఆడువారయినా మగవారయినా ఆస్తి చే జిక్కితే అబ్బర్లపాలు చేయడం సామాన్యమే. అయినా బాగుపడే హక్కు పాడు కావ టానికికూడా వర్తిస్తుంది. స్త్రీ పురుషులకు సమాన వారసత్వపు హక్కులు ఉండే విషయములో అభిప్రాయా లలో తీవ్ర భేదాలున్నా స్త్రీలకూ కొంత వారసత్వ హక్కులు ఉండడం న్యాయమని బహుజనాభిప్రాయము.

"పరివర్తనం"లో హరిజనసమస్య ఆమూలాగ్రముగా చర్చించబడ్డది. ఈ కథాఖ్యానములో భాషారచనలో కంటే భావవైరళ్యములో ఎక్కువశ్రద్ధ చూపినాడు కథ కుడు. అందుచేత కథ పొడుగై కవిత్వపటిమ తగ్గింది.

రెండవ కథ మాత్రము కుదిమట్టముగా సర్వాంగసుంద రముగా ఉన్నది. ఇందులో ఎక్కువకళ ఉన్నది. పాత్ర పోషణ బాగున్నది.

మూడవకథ ఎక్కువపాడవుగా ఉన్నా చదివేటప్పుడు విసువుమాత్రము పుట్ట లేదు. సూరదాసుపాత్ర పోయిన కొద్దీ చేవదేలింది. భగవద్గీతభాషలో స్థితప్రజ్ఞశబ్దమూ, గాంధిభాషలో సత్యాగ్రహ శబ్దమూ ఏకార్థములు. సూరదాసు నిజమయిన సత్యాగ్రహి. అతని ఆత్మబల మంతా చెడును నిరోధించకుండా ఉండడానికే విని యోగింపబడ్డది. అతని నేర్పరితన మంతా అపకారికి ఉపకారము చేయడమందే ఉపయోగింపబడ్డది. కవికి గాంధితత్వము బాగా అర్థమయినది.

హరిజనసమస్యా పరిష్కారము పలువురు పలువిధా లుగా సూచిస్తున్నారు. మనను అంటుకుంటే వాండ్ల కేమి పోరుగుతుంది? వాండ్లకు కూడు దొరికేమార్గము చూపండి, అంతే చాలునని కొందరంటారు. ఈ తరగతివారిలో చాలామంది అస్పృశ్యతానివారణ పనికి రాదనేవారే. దీనికైనా వారు ప్రయత్నించరు. ఇది చెయ్యండని ఇతరులకు సూచిస్తారు. హరిజనుల బీదరిక మును తొలగించడం ముఖ్యమే. అయినా బీదతనము ఒక్క హరిజనులదే కాదు. ఎగువ దిగువ జాతుల కందరికీ వర్తించేదే. విద్యావ్యాపకమూ అట్టిదే. విద్య ధనము మధుపాననిషేధము అస్పృశ్యతా నివారణకు తోడ్పడు

తవి గాని అస్పృశ్యతా నివారణము మాత్రము కాదు. వారు హిందువు లయినందుకు హిందూత్వమూ, మానవత్వమూ వారి జన్మహక్కులు. అవి ఇతర యోగ్యతల పైన ఆధారపడవు. నీవు వారిని నీ యింటికి విందుకు పిలవకపోవచ్చు. నీవు వారితో వియ్య మందకపోవచ్చు. అది వారి జన్మహక్కులను భిన్నము చేయడం గాదు. వీధుల్లో నడవనీయక పోవడం, బడులలోకి రానియ్యకుండడం, చెరువులు బావులు అంటనీయకుండడం, దేవాలయాలకు పూజకు రానీయకుండడం వారి జన్మహక్కులు నిరోధించినట్లు అవుతుంది. ఈ జన్మహక్కులు చట్టము చేసికూడా కాపాడతగినవి. ఈ హక్కులు నిరోధించే వారు నేరస్థులు. ఈ నేరస్థులవి హక్కులు కావు. వీటిని కాపాడవలసిన ధర్మము రాజుకు లేదు. హరిజనులు దేవాలయములో ప్రవేశిస్తే తాము రామని కొందరు మానుకోవచ్చును. కాని తమకోసం హరిజనులను రాకుండా చెయ్యమని కోరడంలో న్యాయము లేదు. బహుకాలమునుంచీ ఈ ఆచార మున్నదని కొందరు అంటారు కానీ కాలము దురాచారాన్ని సదాచారము చెయ్యదు. దీర్ఘకాలమునుంచీ వస్తున్నది గనుకనే వెంటనే నిలిపివేయడానికి కారణముకూడా అదే అని చెప్పవచ్చును.

ఈ విషయమునే కవి ప్రతిపాదించి దేవాలయప్రవేశము ప్రధాన విషయముగా దీసికొని తక్కినవాటిని

ఉపాంగములుగా చేసినాడు. ఒక్కటేమాట. దేవాలయములో ప్రవేశించకపోవడమే సిద్ధాంత మయితే వాండ్లందరూ హిందూమతము వెంటనే విడువవచ్చు కాని అది సిద్ధాంతము కాదు. అది ఒక కళంకము. దానిని బాపడానికి హిందూమతాభిమాను లంతా పాటుపడవలెను.

కథలలో వాడుకభాషను గురించి ఒక్కమాట చెప్పి ముగిస్తాను. వాడుక భాషలో వ్రాయనియెడల ఈ కథలు ఇంత రసవత్తరముగా ఉండేవికావు. కవి అచ్చమయిన తెలుగు మాట్లాడేవారితో కలిసిమెలిసి జీవితం గడపడంచేత అచ్చమయిన తెనుగు అబ్బింది. ఇతరులకు ఇట్టిభాష వ్రాయడం సాధ్యమయిన పనిగాదు. ఇట్టి జీవద్భాషలో పెక్కుగ్రంథాలు వీరు వ్రాయుదురుగాక.

శారదా నికేతనము,
గుంటూరు.
ది ౫-౭-౧౯౪౦.

వున్నవ లక్ష్మినారాయణ.

## పరిచయ వాక్యాలు

ఈ కథాసంపుటికి "వ్యత్యాసాలు" అనే నామము సార్థకంగా ఉన్నది. భాగ్యవంతులకూ బీదలకూ, సుఖవంతులకూ దుఃఖభాజనులకూ, గొప్పవారికీ, తక్కువవారికీ, మంచివారికీ, చెడ్డవారికీ, పూర్వాచార పరాయణులకూ సంఘసంస్కర్తలకూ, కొడుకులకూ, కూతుళ్ళకూ ఉండే వ్యత్యాసము కథలలో కనుపిస్తుంది.

మొదటికథ 'ప్రీతిఫలం'. దీనిలో శ్రీమంతుడు వృద్ధుడు, కురూపి అయిన భర్త కిచ్చిన సుందరయువతి అనుభవించే అవస్థలూ, దారిద్ర్యంతో తారుమారవుతూ కష్టాలకు కాలొడ్డుతూ, సంసారసాగరం సంతరిస్తూ, పరస్పరప్రేమతో ప్రవర్తించే సమవయస్కుల దాంపత్య సుఖమూ కథకుడు వర్ణించినాడు. కథ అంతా కరుణ రసభరితం. గమనం హెచ్చినకొద్దీ కరుణ గాఢమై కరగించి వేస్తుంది. ఆగర్భశ్రీమంతులూ, భోగలాలసులూ దీనిలోని విషాదఘట్టాలు చదివితే ఇటువంటి కష్టాలు లోకంలో ఉన్నవని గ్రహిస్తారు.

'పుత్రసంతానం' రెండవది. ఇందులో ఆడపిల్లలమీదకంటే మగపిల్లలమీద తల్లిదండ్రుల కుండే విపరీతానురాగము వివిధ విధాల విశదీకృతం అయింది. మమకారంతో పెరిగే మగపిల్లలు చేసే ఆగడాలు అమర్ష కలిగిస్తవి. కోడుకోడళ్ళకూ, అత్తాకోడళ్ళకూ, తండ్రీ

కొడుకులకూ, భార్యా భర్తలకూ సంభవించే అంతః కలహాలు, సంభాషణలు స్వాభావికంగా, చమత్కారంగా చిత్రించినాడు కథకుడు.

చివరకథలో కథకుని ముఖ్యోద్దేశము సంఘసంస్కారము. పంచముడైన సూరదాసు సాధువర్తనము, దైవభక్తి, శాంతము, భూతదయ; ఆచార్యులవారి మూఢభక్తి, పూర్వాచార పరాయణత్వము, పారుష్యము; కాంగ్రెసువాది ఐన కృష్ణశాస్త్రి సంఘసేవ, అస్పృశ్యతా నివారణము, హరిజనోద్ధరణము విపులంగా వర్ణించినాడు. ఆచార్యులవారిలో కలిగిన హృదయ పరివర్తనం సక్రమంగా స్పష్టీకృతం అయింది. ఈ కథను " మాధవాచార్యుల మార్పు " అంటే బాగుండేది. దీనిని నవలగా నడిపితే హృద్యతరం అయ్యేది.

ప్రతి కథకూ వస్తువు సామాన్య జీవితంలో నుంచి సంగ్రహించిందే. మనం ఆచరించే దైనందినచర్యలన్నీ దర్పణంలో వలె ప్రతిఫలిస్తున్నవి. అందుచేత ఝటితి స్ఫూర్తి కలుగుతుంది. సంఘంలో జరిగే దురాచారాలకూ, అన్యాయాలకూ ఈ కథకుని సుకుమార హృదయం క్షుభితమైనట్టు తోస్తుంది. కాబట్టే ఏదో క్లిష్ట సమస్య ప్రతి కథలోనూ పరిష్కృతం అవుతూ వచ్చింది.

రచనలో రమ్యమైన జాతీయాలూ, పాత్రోచితమైన భాషా ప్రయుక్తమైనవి. సూర్యోదయ అస్తమయాది ప్రకృతివర్ణనలూ, పాత్రల భావాంతర

శోభలూ, సంభాషణలూ, గ్రామీణజీవనమూ స్వభావ సిద్ధంగా, సరసంగా కథకుడు నిర్వహించాడు.

మన కలవాళ్లైన భౌగోళిక విషయవర్ణనము కాకుండా భారతజాతిని బాధిస్తున్న బహువిధవ్యధలను కథానిబద్ధం చేయడంవల్ల కథకుని ఔదార్యము అవగత మవుతుంది. ఈయనది ఆర్ద్రహృదయం అనీ ఈయనకు బీద లంటే కనికర మనీ కనపడుతుంది.

ఇ వన్నీ కథానిక లనడానికి వీలులేదు. అన్నింటి లోనూ ఆఖ్యానచ్ఛాయలు ఆక్రమించినవి. కథా గర్భంలో లక్ష్యం కమ్ముకొనిపోవడం కాంతాసమ్మితం. కాదు, పరిస్ఫుటంగా ఉండా లని ప్రయోజనాపేక్షా వాదులు వక్కాణిస్తారు. ఏది ఎలా గైనా కథనం మధు రంగా ఉన్నది.

రచయిత తన ప్రథమ గ్రంథాన్ని గురుతుల్యులకు దక్షిణగా సమర్పించడమే సమంజసము. నాకు గూడా గురుతుల్యు లైన శ్రీ శివశంకర శాస్త్రి గారికి అంకితం చేసిన పుస్తకానికి పరిచయ వాక్యాలు వ్రాసే అవకా శము కలగడం ప్రమదావహము.

శ్రీ కృష్ణ దివ్యజ్ఞాన మందిరము.
గుంటూరు. జూలై ౨, ౧౯౪౦.

పట్టికొండ రంగయ్య.

# విన్నపం

కొద్దివయస్సులోనే నాకు ఇటీవల దైవికంగా దృష్టి మాంద్యం కలిగింది. ఎన్ని చికిత్సలు చేయించినా చదవటానికీ వ్రాయటానికీ కుదరలేదు. జీవితంలో అశాంతి ఏర్పడ్డది. మహాత్ములను కొందరిని సందర్శించాను. వారి వచనామృతంవల్ల, నా మనస్సుకు కొంతశాంతి కలిగింది. చేతులకు పని తప్పిపోయి విశ్రాంతి చిక్కింది.

మనను ఎదుర్కొంటున్న క్లిష్టసమస్యలను తలచుకుని విచారపడ్డాను. అదివరకు కథలు వ్రాసే అలవాటు కొంత ఉండడంచేత నా బుద్ధిని రచనమీాదికి తిప్పి ఇట్లా కథలు చెప్పి వ్రాయించటానికి పూనుకున్నాను. ప్రస్తుతం మూడుకథలు ఇందులో ప్రకటిస్తున్నాను. స్త్రీ పురుష సంతానాలకూ, దరిద్రధనవంతులకూ, తక్కువ ఎక్కువ కులాలవారి కీ ప్రవర్తనలలో కొన్ని వ్యత్యాసాలు చూపుతూ మూడూ మూడు కథలుగా వ్రాయించాను.

ఈ కథల్లో పాత్రలూ, నడకలూ కేవలం కల్పితాలు. ప్రత్యేక వ్యక్తుల ప్రసక్తి ఏమీా లేదు. ఎవరి కన్నా తగులుతవేమో అని పాత్రలకు ఇంటిపేర్లూ ఊరిపేర్లూ సయితం పెట్టలేదు.

ఈ సంపుటికి పీఠిక, పరిచయ వాక్యాలు వ్రాసిన శ్రీ పుస్నవ లక్ష్మీనారాయణగారికీ, శ్రీ వట్టికొండ రంగయ్యగారికీ వందనములు.

ప్రసిద్ధ పండితులు, ఉత్తమకవులు నాకు పరమాప్తులు గురుతుల్యులూ, అయిన శ్రీ శ్రీ శివశంకరశాస్త్రిగారు ప్రారంభదశలో నాకథలు కొన్ని సరిచూచి పత్రికల్లో వేయించి నన్ను ప్రోత్సహించారు. కొద్దిలో ఉన్న వాళ్ళకు చేయూత ఇచ్చి పైకి తీసుకుని రావడమే వారి ఆశయం. నామీది అనురాగంచేత ఈ పుస్తకాన్ని సంస్కరించారు. వారిమేలు ఎన్నటికీ మరిచిపోలేను. కృతజ్ఞతతో ఈ గ్రంథాన్ని వారికే అంకితం చేశాను.

మంగళగిరి,
౬-౮-౧౯౪౦.

అందే నారాయణ స్వామి.

# అంకితము

- శ్రీ తల్లావఝ్ఝల -

శివ శంకర శాస్త్రి గారికి

# అనుక్రమణిక

# ప్రతిఫలం

## ౧

అవి చైత్రమాసపు రోజులు. పగలు పదకొండు గంటలయింది. ఎండ బహు తీవ్రంగా వున్నది. సర్వప్రాణులకూ జఠరాగ్ని ప్రజ్వలిస్తూ వున్నది. ప్రతి ప్రాణికీ మనస్సు ఆహారంమీదికి పోతూ వున్నది. తిరగ గల జంతువులూ, ఎగరగల పక్షులూ, డబ్బుగల మనుష్యులూ తమ ఆహారాలను సేకరించుకుని తిని త్రేపులు కొట్టుతూ ఉన్నారు. కదలలేని జంతువులూ, ఎగరలేని పక్షులూ, డబ్బులేని బీదవాళ్ళూ ఇంకా పచ్చిగంగైనా తాగలేదు. పాపం కదలలేని స్థితిలో వున్న ఆ అవిటి జీవరాసులు ఆకలికి తాళలేక కనపడ్డ వస్తువుసల్లా మింగాలని నోళ్లు తెరుస్తూ వున్నవి. బీదా బిక్కా కొందరు ఆ నాటి ఆహారం కోసం విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. కొందరికి అప్పుడే పొయిలమీదికి కుండలు ఎక్కినవి. కొందరికి ఇంకా పొయ్యిలో పిల్లి లేవలేదు. వాళ్ళగింజలు బజార్లోనే వున్నవి. జాలైనా లేకుండా పాపం ఈ బీద ప్రాణులను సయితం సూర్యభగవానుడు జఠరాగ్ని ద్వారా దహించి వేస్తున్నాడు.

## వ్య త్యా సా లు

"రాత్రి కూడా అన్నం సరీగా తినలేదు. ఆయన పొద్దునసంగా ఊళ్ళోకి వెళ్ళి ఇప్పటివరకూ తిరుగుతూ వుండడంవల్ల, ఆయనకు ఎంత ఆకలి వేస్తున్నదో! ఊరికినే కూర్చున్న దానికి నాకే ఇట్లా వున్నది. ఇంకా యెంతసేపటికి వస్తారో, వచ్చాక గింజలూ అవీ తెచ్చి వండే టప్పటికి ఎంతవే ళవుతుందో! ఎందువల్ల నబ్బా! ఇవ్వాళ్ళ యింతసేపటివర కున్నారు!" అని అనుకుంటూ లక్ష్మి తన భర్తకోసం ఎదురు చూస్తూ, అంతవరకూ వీధిలోకి నాలు గైదు సార్లు వెళ్ళి వచ్చింది. చంటిపిల్ల అన్నం కోసం ఏడుస్తూ వున్నది. రాత్రి అన్నం ఒక్క మెతు కయినా మిగల్లేదు. వండిపెట్టే టందుకయినా ఇంట్లో గింజలు అయిపోయినవి. "ఊరుకో అమ్మా! మీనాన్న ఇప్పుడు వస్తారు. కాయలూ, అవీ తెస్తారు తిందువు గాని" అని బిడ్డను ఊరడిస్తూ వున్నది లక్ష్మి. కళ్ళు కనపడని అత్త మంచంలో వుండి "మబ్బాయి వచ్చాడు టే" అని రెండు మూడు సార్లు కోడలిని అడిగింది.

ఇంతలో చంద్రయ్య బుజంమీద పండ్లబల్లతో ఇంటికి వచ్చాడు. చొక్కా చెమటతో తడిసి పోయి వంటికి అతుక్కు పోయింది. పొట్ట జానెడు లోతుకు పీక్కుని వెళ్ళుతూ వున్నది. భర్తను చూచి లక్ష్మికి చంద్రోదయానికి కలువవలె ముఖం వికసించింది. చంకలో పిల్లను దించి ఎదురుపోయి, బుజంమీద బల్ల

దించి "ఏమండీ! ఇవ్వాళ్ళ యింత సేపటిదాకా వున్నారు? పిల్ల ఆకలికి ఆగలేక గిలగిల కొట్టుకుంటూ వున్నది. మీరు రాత్రి సరీగా అన్నం తినకపోతిరి. ముసలమ్మకు పాపం వేళ మించిపోతూ వున్నది. మీ ముఖం ఎట్లా వాడి పోయిందో చూడండి! ఒళ్ళంతా చెమట పట్టి గుడ్డలు ముద్దముద్దగా తడిసి పోయినవి. త్వరగా బావి దగ్గిరికి రాండి, చేదుతాను, దబ్బున స్నానంచేసి, బజారికి వెళ్ళి గింజలు తెద్దురు గాని" అన్నది భర్త ముఖంలోకి కళ్ళుపెట్టి.

"నాకేం తొందర రొచ్చింది లేవే? నువ్వుమాత్రం రాత్రి సరీగా తిన్నావా? కాసిని బియ్యం వుంటే వండితే ముసలమ్మకు పెట్టి మిగిలింది మన ఇద్దరం తిన్నాముగా? నీకు లేని ఆకలి నా కెక్కడనుంచి వచ్చింది" అన్నాడు చంద్రయ్య నవ్వుతూవున్న కళ్ళతో భార్య ముఖంవంక చూస్తూ.

మాటధ్వనిని బట్టి మంచంలో వున్న ముసలమ్మ "ఏరా నాయనా? ఇంత ఆలస్యం చేశావు!" అన్నది. చంద్రయ్య తల్లి దగ్గిరికి వెళ్ళి "అమ్మా, నీ కాకలవుతుంది కామాలు, ఈ రెండు అరటిపండ్లూ తిను" అని ఇచ్చి చంటిపిల్లకు ఒక పండిచ్చి బుగ్గగిల్లి ముద్దుపెట్టుకుని, బావి దగ్గిరికి వెళ్ళాడు. భార్య నీళ్ళు చేదుతూ వుండగా, స్నానం చేస్తూ, "డబ్బుగల వాళ్ళ దగ్గిరే

సుమా దుర్బుద్ధులు. ఇవ్వాళ్లోక గమ్మత్తు జరిగింది. అందుకే ఇంత ఆలస్యం అయింది" అన్నాడు చంద్రయ్య వంగి నీళ్ళు తోడుతూ వున్న భార్య అంగసౌష్ఠవాన్ని చూచి మురిసిపోతూ. "ఏమి టది" అని తొందరగా అన్నది లక్ష్మి చేదుతూ వున్న బుంగపైకి లాగి, భర్త ముఖంలోకి వేగంగా చూస్తూ. "ఇప్పుడు కాదు. ఆనిక్కి చెప్తాను. మాటలతో పెట్టుకున్నా ర్నంటే యింకా ఇగురు తుంది" అని చంద్రయ్య స్నానం త్వరగా ముగించి, పొడి బట్టలు కట్టుకుని, "ఇవ్వాళ్ళ షావుకారు సొమ్ముపోను బేడాఅర్థణా మాత్రమే మిగిలింది. అక్కడ ఆ పొరపాటు జరక్కపోతే చాలా లాభం వచ్చేది. బేడ గింజలు తెస్తాను. ఇక అర్థణా మిగులుతుంది. ఏం కూర తెమ్మన్నావు?" అన్నాడు చంద్రయ్య ప్రశ్నార్థకంగా భార్య నోటవంక చూస్తూ.

"వంకాయలు పట్టుకరాండి" అన్నది లక్ష్మి కళ్ళు తిప్పుతూ.

"ఇగురు వేస్తావా? పులుసుపెడతావా ?" అన్నాడు భర్త.

"పులుసుకు చింతపండు లేదు. ఇగురే వేస్తాను" అన్నది లక్ష్మి.

"ఇగురయితే రెండుపూటలకూ రాదు. పులుసయితే

వస్తుంది. చింతపండు లేకపోతే దొడ్లో చింత మొక్క ఆకు కొంచెం కోసిపెడతాను. చింతపండు బదలకా అది వాడు. పుల్లపుల్లగా బాగుంటుంది. కూర వదుగుకూడా అవుతుంది'' అన్నాడు చంద్రయ్య.

లక్ష్మి నవ్వి "అబ్బే! ఆ ఆకు కూరల్లో వేసుకుంటారటండీ? ముదురుది. ఇంకా చిగురు పట్టలేదు. చిగురయితే బాగుంటుంది గాని'' అన్నది.

"ఏదోలే! డబ్బు ల్లేనప్పుడు రుచులు ఎట్లా వస్తవి? అవన్నీ చూచుకుంటే ఎట్లా? ఏదో పని జరగనివ్వాలి గాని ఆకు ముదిరితే మాత్రం దానిలో పులు పెక్కడికి పోయింది? లేతాకు చూచి కోస్తాను, వెయ్యి, పరవాలేదు'' అని చరచరా నడిచి బజారుకు వెళ్ళి పొయ్యాడు చంద్రయ్య.

వంట సిద్ధంచేసి పిల్లకుపెట్టి, లక్ష్మి అత్తకూ, భర్తకూ, ఒక్కమారే వడ్డించింది. "అన్నీ ఇక్కడ పెట్టి నువ్వుకూడా వడ్డించుకోక పొయ్యావు?'' అన్నాడు చంద్రయ్య ప్రేమ ఒలికే కళ్ళతో భార్యముఖంలోకి చూస్తూ. "నాకేం తొందరొచ్చింది లేండి. మీ భోజనాలయ్యాక వడ్డించుకుంటాను'' అన్నది లక్ష్మి.

భోంచేస్తూ, "చూడు, ఇవ్వాళ్ళ వంకాయకూర ఎంత బాగున్నదో?''అన్నాడుచంద్రయ్య తృప్తి అభినయిస్తూ.

"మీరు నిర్ణయించిన పాకం మీ కెందుకు బాగోదు లేండి?" అన్నది లక్ష్మి ఓర చూపులు చూస్తూ. "చూడు ఇందాకటి నించీ ఆకుక్క నానోటివంకా, చెయ్యివంకా ఎట్లా రెప్పవెయ్యకుండా చూస్తున్నదో? అన్నం కోసం దాని ప్రాణం ఎట్లా కొట్టుకొంటున్నదో చూడు" అని చంద్రయ్య పళ్ళెంలో పెట్టెడుఅన్నం పట్టుకవెళ్లికుక్కకు వేశాడు. అది తోక ఆడించుకుంటూ తిన్నది.

లక్ష్మి అదిచూచి "అదేమి టండీ! అన్నమంతా కుక్కకు వేశారు. తెచ్చింది తవ్వెడుగింజలు. పిల్లతో నలుగురం తినాలి. మిగిలిన అన్నం మాకు చాల దని మళ్ళీ వడ్డించుకోకుండా అంతటితో లేచేరు. మీ కేం, మమ్మల్ని బాగానే తిన మంటారు. మీరేగా పస్తుండేది" అన్నది భర్త ముఖం కేసి జాలిగా చూస్తూ.

"నే నేమీ పస్తుండను. మమ్మకు కడుపునిండా పెట్టు. మిగిలింది మనం చూచుకుందాము. తక్కువగా తింటే వంటికి ఎంతమంచిదో నీకు తెలుసా? ఎంత ఆరోగ్యమో ఎరుగుదువా?" అన్నాడు చిరునవ్వు నవ్వేకళ్ళతో చంద్రయ్య భార్యను తృప్తిపరచా లని ఆమెచూపుల్లో చూపులు కలిపి.

"ఔను, పేగులు మూటకట్టుకోవడం ఆరోగ్యం అని మీ శాస్త్రంలో వున్నది కామోలు" అన్నది లక్ష్మి భర్తవంక హేళనగా చూస్తూ.

"గాంధీగారేమి వ్రాశారో తెలుసా మితాహారాన్ని గురించి? అన్నం ఎక్కువ తిని రోగాలు పుట్టి చచ్చినవాళ్లున్నారు గానీ, తక్కువ తిని కాస్తన్నా బాధపడ్డవాణ్ణి ఒక్కణ్ణి చూపించు?" అని. "ఇక చల్ల తీసుకరా" అన్నాడు చంద్రయ్య.

"చల్లంగా వుంటే మీ పేరే పెట్టుకుంటాను. లోగా ఇవ్వవలసిన డబ్బు ఇవ్వాలేదని వాళ్లు ఇవ్వాళ్ల మజ్జిగ పొయ్యా లేదు. పుల్ల నీళ్ళు వున్నవి. తెమ్మంటారా?" అన్నది లక్ష్మి.

"ఇంకేం! వాణీతల్లి వుంటే వెధవచల్ల ఎందుకు? పట్టుకరా" అన్నాడు చంద్రయ్య.

లక్ష్మి అతడు వద్దంటున్న కొద్దీ మారు అన్నం వడ్డించి తరవాణి పోసింది భర్తకు పుల్లనీళ్ళు పోసి పెట్టవలసి వచ్చిందని అదివరకు కళకళలాడుతూ వున్న ముఖం ఇంత చేసుకుని. "మిరపకాయ ఒకటి వుంటే నిప్పుల్లో పొర్లించి ఇస్తావూ" అన్నాడు చంద్రయ్య. "రెండు వుంటే కూరలో వేశానండీ" అన్నది లక్ష్మి భర్తవంక క్షమించమని ప్రార్థించినట్లు చూస్తూ. కావలసినంత వరకూ తిని చంద్రయ్య పళ్ళెం ముందరినుంచి లేచాడు. లక్ష్మి అదిచూచి ఆత్రమయిన గొంతుతో "అదేమిటండీ! అన్నమంతా వదిలిపెట్టి లేశారు. నాకు

లసి వచ్చింది? బీదవాళ్ళం మన వుసురు దానికి తప్పక తగులుతుంది” అన్నది లక్ష్మి.

౨

“ఇందాకటినించీ వాళ్ళింట్లో ఎవరో ఏడుస్తున్నట్టు వినిపిస్తూంది ఏమిటి?” అన్నాడు చందర్రియ్య భార్యతో.

“మీరు ఇంటికి రాకముందు వాళ్ళింట్లో ఒక సంగతి జరిగింది. పార్వతమ్మకు నాలుగురోజుల నుంచీ జ్వరం తగులుతూ ఉన్నదట పాపం. నోటికి యేదీ సహించనందున అందులో పెద్దముండ గనక మనసు పోవడంవల్ల, జ్వరంలో వుండికూడా అట్లాగే లేచి అన్నంలో కాసిని పాలుపోసుకున్న దట. అది పాపయ్యచూచి ఇంకేం సంసారం మనాయిస్తుం దంటే, ఇట్లా అందిందల్లా తింటూవుంటే మూన్నాళ్ళకే చిప్పచేతికి వస్తుం దంటే, మమ్మల్ని కొరుక్కు తినేటందుకే ఇన్నాళ్ళూ బతికావంటే అని తల్లిమీదికిపొయ్యి నోటికివచ్చినట్లల్లా తిట్టాడు. అందుకని ఏడుస్తూ వున్నది పార్వతమ్మ పాపం” అన్నది లక్ష్మి.

“ఇందుకేనా తల్లిని తిట్టింది? వాణ్ణి తగలెయ్య! తల్లి కాసిని పాలు పోసుకుంటేనే వాడి లక్షలన్నీ గాలికి ఎగిరి

పోతయ్యా. వాడికి బుద్ధి వుండొద్దూ. తల్లి కన్నా ఇంత పెట్ట కుండా రేపు చచ్చేటప్పుడు వాడి లక్షలన్నీ బళ్ళమీద స్మశానానికి తనతో తీసుక వెళ్లుతాడు కామాలు! ఆ మాట వినేసరికి పార్వతమ్మ మీద నాకు జాలివేస్తున్నది" అన్నాడు చంద్రయ్య.

"పో నివ్వండి మన కెందుకు? పాడుగోల" అన్నది లక్ష్మి.

ఒకనాడు కాకి ఒకటి ముక్కున గిన్నె కరుచుకుని, వాళ్ళపందిరి గడమీద వాలి, నోట్లో వున్న గిన్నె కింద పడ వేసింది. ఘల్లు మన్న శబ్దం విని చంద్రయ్య వెళ్ళి చూచాడు. మనిషి వెళ్ళగానే కాకి ఎగిరిపోయింది. గిన్నె చేత్తో తీసుకుని "వెండి గిన్నె ఎవరిదో పాపం" అను కుంటూ చంద్రయ్య "ఏమేవ్! లాటు పడ్డది. ఇట్లారా" అని నవ్వుతూ భార్యను పిలిచాడు. వెంటనే లక్ష్మి "ఏమిటా లాటు" అంటూ భర్త దగ్గిరికి వెళ్ళి గిన్నె చూచి, ఆశ్చర్యంతో ఎక్కడిది దండీ ఇది?" అని అడిగింది భర్త కళ్ళల్లోకి ఆశగా చూస్తూ.

"కొన్నాను. ఇంకా నీకు తెలియదా ఏమిటి!"

"నిజమే! నమ్మకేం" అని లక్ష్మి ఎక్కడిదో చెప్పం డని భర్తను తొందర పెట్టసాగింది.

చంద్రయ్య నవ్వి "కాకి తెచ్చిపడవేసింది" అన్నాడు.

"ఎవరిదో నండీ పాపం? వాళ్ళెంత ఇది అవు తున్నారో!" అన్నది లక్ష్మి జాలిగా.

చంద్రయ్యా గిన్నెను అటూ ఇటూ తిప్పి దాని మీద చెక్కివున్న పేరును చూచి "ఏమేవ్ పాపయ్యా గారిదే యిది. వాళ్ళకు ఇచ్చివేసి వస్తాను" అన్నాడు.

"మీరు ఇవ్వపోతే దొంగతనంగా తీసుకవెళ్ళా రని అనేమాత్రపు వాళ్ళు. వాళ్ళకు కాకి పడవేసిం దని మనం నమ్మకం కలిగించే దెట్లా? కాకి గడపైన వుండగానే, వాళ్ళను పిలుచుకవచ్చి ఇట్లా గిన్నె పడవేసిందని చూపిస్తే మనమీద నెపం లేకుండా పొయ్యేది" అన్నది లక్ష్మి అమాయికంగా.

ఆ మాటకు చంద్రయ్యా నవ్వి "ఎగిరిపోకుండా కాకిని గట్టిగా పట్టుకోక పొయ్యావూ? పోనీ, పోవద్దని ఆజ్ఞాపించ లేకన్నా పొయ్యావూ? పిచ్చిదానా. ఇట్లా కాకి తెచ్చి పడవేసిందని చెప్పి ఇస్తే పోయిన సొమ్ము తిరిగి వచ్చిందే చాలని వాళ్లు సంతోషిస్తారుగానీ, మనమీద ఎంత మాత్రం అనుమానం పడే అవకాశం లేదు. దొంగతనం చేసినవాళ్ళు తిరిగి తీసుకవెళ్ళి యిస్తారా అని వాళ్ళకు మాత్రం తెలియదూ" అన్నాడు.

"సరే, ఆలస్యం కాకుండా యిచ్చిరాండి" అన్నది లక్ష్మి.

అప్పుడు చంద్రయ్య వాళ్ళసొమ్ము వాళ్ళకు తిరిగి ఒప్పగిస్తున్నందుకు తన శీలాన్ని వాళ్ళు ఎంతో పొగుడుతారనీ, మీదు కాబట్టే మా సొమ్ము తిరిగి యిచ్చారని తన్నెంతో గౌరవిస్తారనీ, అనుకుంటూ గిన్నె చేత్తో పుచ్చుకుని వికసించిన ముఖంతో, పక్కయింటి పాపయ్యగారింటికి వెళ్ళాడు. అప్పుడు పాపయ్య పోత విగ్రహం లాగా కూర్చుని బాకీలదస్త్రం తిరగ వేస్తున్నాడు.

"ఇదిగోనండీ! దీనిమీద మీ పేరు వున్నది. కాకి తెచ్చి మా ఇంట్లో పడవేసింది" అని సంతోషంతో గిన్నె యిచ్చాడు చంద్రయ్య. పాపయ్య గిన్నె తీసుకుని కూర్చోమని అయినా అనకుండా ఆయన పుట్టంతా మునిగిపోయినట్టు ఈపని ఎప్పటినించి అన్నట్టు చంద్రయ్య వంక కరుకుగా చూచాడు. చంద్రయ్య చిన్నపోయి "ఎవరిచేతనైనా పంపించకుండా ఎందుకు వచ్చానా" అని ఇంత ముఖం చేసుకుని ఇక అక్కడ నిలవకుండా "నాభార్య చెప్పిందే నిజం. నేనే పొరపడ్డాను" అనుకుంటూ ఇంటికి వచ్చాడు.

## 3

చంద్రయ్య తండ్రి హయాములో చాలా ధనవంతులు. పూర్వం వాళ్ళది పెద్ద కమీషన్ పండ్ల వ్యాపారం. కాబూలు, బెంగుళూరు, మద్రాసు ఇంకా ఎక్కడెక్కడి నుంచో పండ్లు కమీషనుకు వస్తూవుండేవి. బొంబాయి, కలకత్తా, రంగూను ఇంకా విదేశాలకుగూడా పండ్లను ఎగుమతిచేస్తూ వుండేవాళ్ళు. ప్రపంచంలో ఎక్కడా పండ్లులేని సమయంలోకూడా వీళ్ళకు వ్రాస్తే ఏ రకం పండ్లనైనా సప్లయి అవుతయ్యని అందరి వ్యాపారస్తులకూ మంచి నమ్మకం వుండేది. వీళ్లు మోసం అనేది ఎరక్కుండా న్యాయంగా నడిచినందున లాభాలు తగ్గి అంత గొప్ప వర్తకం గతించిపోయి కాలక్రమేణా ఇతనిహయాములో బీదవాళ్ళయి పొయ్యారు. పూర్వం వున్న పెద్ద భవనం అవీ బాకీదార్లు వేసుకునివెళ్ళారు. మరిఒకచోట స్థలంకొనుక్కుని పూరిఇల్లు నిర్మించుకుని దానిలో కాలం వెళ్ళబుచ్చుతూ, వాళ్ళ పూర్వ వర్తకమయిన పండ్లను మాత్రం వదిలి పెట్టకుండా, బీదవాడై పోయినందున కొట్టుపెట్టుకునే తాహతు లేక ఒక షాహుకారు దగ్గర పండ్లు వేసుకుని తిరిగి అమ్ముకుంటూ, అమ్మిన డబ్బులో వచ్చిన లాభం మాత్రం తీసుకుని అసల్లోది ఒక్కకానయినా తినకుండా షావుకారు సొమ్ము చెల్లించివేస్తూ,

ఒకనాడు ఎండుతూ, ఒకనాడు పండుతూ, వచ్చిన దానితోనే తృప్తిపడుతూ, రోజులు గడుపుతూవున్నాడు. చంద్రయ్యకు ముప్పయియేళ్ళు వుంటవి. ఎర్రటి ఆజాను బాహువిగ్రహం. చలాకీ అయినవాడు.

పాపయ్యది పూర్వం నిరుపేద కుటుంబం. ఇతనికి పది పదిహేను సంవత్సరాల ఈడు వుండగా, తండ్రి దొడ్లో మట్టి తవ్వుతూ వుంటే, వరహాల బాన దొరి కిందట. అప్పటి నుంచీ ధనవంతులై ఇళ్ళూ, పొలాలూ తాకట్లూ, విక్రియాలూ, చేయించుకుని డబ్బు పెట్టు బడి పెడుతూ, వడ్డీ వ్యాపారం సాగిస్తూ వున్నాడు పాపయ్య. బాకీదార్ల మీద దావాలు వేసి నెలకు రెండు మూడు ఇళ్ళో, పొలాలో స్వాధీనం చేసుకుంటూ వుంటాడు. కొన్ని లక్షలకు వుంటుం దని గ్రామంలో పుకారు. ఒక కాసీ ధర్మం చెయ్యడనీ, బాకీదార్లను ఏడిపించుక తింటాడనీ, కాలయము డనీ, చెడిబతికిన వాడనీ గ్రామ స్థులు చాటున అంటూ వుంటారు. పాపయ్యకు దాదాపు అరవై యేళ్ళు వుండవచ్చు. గుండెలకింద పెద్ద బాన బోర్లించి నట్టు పొట్టవేసుకుని నల్లగా వికారంగా వుంటాడు.

పాపయ్య ఇంటికీ, చంద్రయ్య ఇంటికీ మధ్య గోడ మాత్రమే అడ్డం. వీళ్ళింట్లో కమ్మటి తిరగబోతవాసనలూ, వాళ్ళింట్లో పులిసిన పుల్లనీళ్ళ వాసనలూ. వీళ్ళు

తినేవి పంచభక్ష్య పరమాన్నాలూ, వాళ్ళు తినేవి పుల్ల నీటి మెతుకులూ. వీళ్లింట్లో గ్రామఫోను సంగీతం, వాళ్ళింట్లో కూటికి ఏడ్చే పిల్ల సంగీతం. వీళ్లు పండేవి పరుపులూ పందిరి పట్టెమంచాలూ, వాళ్ళుపండేవి గోనె పట్టాలూ కుక్కిమంచాలూ. వీళ్ళవి ఇష్టంవచ్చి నట్లు ఆకలి అయినా కాకపోయినా చెడిదీ పడిదీ గోతానికి తొక్కినట్టు తొక్కడం చేత పొట్టలు పెరిగిన అస్వాభావికమైన ఆకారాలూ, వాళ్ళవి ఆకలికి సరి పోయినంత అన్నం లేక ఒకపక్క కాలుతూ వున్నం దున కట్టెబారిన స్వాభావికమైన ఆకారాలూ. వీళ్ళు రాత్రిళ్ళు సినిమాలూ, నాటకాలూ, చూచి నిద్ర కాయడంవల్లనూ, ఎక్కువ తిన్నందున సరిగా జీర్ణం కాక, రోగాలు పుట్టి ఎప్పుడూ మందులూ మాకులూ తినడం, వాళ్ళు పొద్దుగూకంగానే నిద్రపోయి తిన్నది కాస్తా జీర్ణించుకున్నందున ఏ మందులూ మాకులూ అవసరం లేకుండా ఆరోగ్యంగా వుండడం. ఈయన భార్య మెళ్ళో మొయ్యలేనన్ని బంగారం నగలూ, ఆయనభార్య మెళ్ళో పసుపురంగు దారానికి గుచ్చిన మంగళసూత్రం. వీళ్ళింట్లో ఎప్పుడూ రుసరుసలూ వాళ్ళింట్లో మాటా మందలింపూ లేకుండా సతీపతుల గుసగుసలూ. వీళ్ళింట్లో ఎప్పుడూ రూపాయల గణ గణలూ, వాళ్లింట్లో ఎప్పుడూ కుండల తటతటలూ.

వీళ్ల భావాలు పరులను ఏ విధంగా వంచించి ఇంకా ధనం కూడబెట్టా లన్న విషపూరితాలూ, వాళ్ళ భావాలు పరులను వంచించకుండా భుక్తికి మాత్రం పాటుపడా లనే దోషరహితాలూ, వీళ్ళకు బీదజనాన్ని చూస్తే తగని రోత, వాళ్ళకు బీదాబిక్కాను చూస్తే తగనిజాలి. వీళ్ళ నోటివెంట వచ్చేవి పరుషవాక్యాలూ, వాళ్ల నోటివెంటు వచ్చేవి శాంతమైన మృదువాక్యాలూ.

ఒకనాడు పాపయ్యకూతురు పన్నెండు పదమూ డేళ్ళది దొడ్లో నీళ్లుచేదుతూ కాలుజారి బావిలో పడ్డది. పడ్డధ్వని విని ఇంట్లో ఏదో పని చేసుకుంటూ వున్న మారుతల్లి బావివంక ఏమిటో నని తొంగిచూచింది. బావివద్ద పిల్ల లేదు. గాబరాతో పరిగెత్తుకు వెళ్ళి బావి లోకి తొంగిచూచింది. పిల్ల బుడగలు వేస్తున్నది. ఆమెకు కాళ్ళు భూమిమీద నిలవలేదు. ఆమె మనసు మనసులో లేదు. అంతా అయోమయం అయిపోయింది. గుండె బాదుకుంటూ "అయ్యో! అయ్యో!! ఇం కేమున్నది కొంప పోయింది" అని పెద్ద వెర్రి కేక పెట్టింది. ఆ కేకకు ఇనప్పెట్టె వద్దవున్న పాపయ్య పరిగెత్తుకుంటూ బావి వద్దకు వెళ్ళి సంగతి తెలుసుకుని "అయ్యో! నా బంగారం పోతూ వున్నది. నా ముద్దుల తల్లిని రక్షించండో నాయనా" అంటూ ఏడవడం ప్రారంభించాడు. తల్లి శోకాలు తీస్తూ వున్నది. ఈ గల్లం తంతా విని వాళ్ళ

ఇల్లంతా అప్పిడే జనంతో నిండిపోయింది. ఆ వచ్చిన జనాన్ని చూచి ఏడుస్తూ వున్న పాపయ్య "నా తల్లిని బతికించిన వాళ్ళకు వెయ్యిరూపాయ లిస్తాను నాయనో, వెంటనే బావిలో దిగి నా బిడ్డను కాపాడిన వాళ్ళకు అడిగినంత సొమ్ము తెచ్చి ముందు పోస్తాను తండ్రు లారో" అని ప్రతిజ్ఞచేస్తూ పొట్ట పట్టుకుని గందరగోళంగా ఏడుస్తూ అటూ ఇటూ కదను తొక్కుతున్నాడు.

అప్పుడే తిరిగి తిరిగీ వచ్చి ఇంట్లో కంచం దగ్గిర కూర్చుని ముద్ద కలుపుతూ వున్న చంద్రయ్య ఆ ఏడుపులు విని సంగతి గ్రహించి కంచం దగ్గిరనించి అట్లాగే లేచి, లేగదూడ ఆర్తనాదం విన్న తల్లిఆవువలే ఒక్క దూకులో వాళ్ళఇంట్లోకి వెళ్ళి, జనాన్ని తప్పించుకుని ఎవ్వరికీ చెప్పకుండానే వెళ్లి, బావిలో గబాలున దూకాడు. చూస్తున్న జనమంతా నివ్వెర పొయ్యారు. బావిలో దూకిన చంద్రయ్య ఒక్కమునుగులో పిల్లను పట్టుకుని నీటిపైకి తెచ్చి, తాడు వెయ్య మని కేక వేశాడు. తాడు తెచ్చి చిన్న మంచం కట్టి బావిలోకి వదిలి పిల్లను పైకి తీశారు. పిల్లను చూచి బతికే వున్న దంటే, వీళ్ళ అదృష్టం మంచిదంటే, దేము డల్లే చంద్రయ్య వీళ్ళకు అడ్డు పడ్డా డంటే, అడ్డుపడ్డందుకు పాపయ్య ఊరికే వదలుతాడా చంద్రయ్యకు ఏ దన్నా ముట్టచెపుతా డంటే ఆ వచ్చిన జనం అంతా అనుకుంటూ

వున్నారు. పైకి తీసిన కూతురిని చూచుకుని బతికివున్న దని తెలుసుకుని పట్టరాని ఆనందం పొందాడు పాపయ్య. పిల్లపొట్ట వత్తివేసేసరికి తాగిన నీళ్ళన్నీ పోయి కళ్లు తెరచి చూచింది ఆ అమ్మాయి. అప్పుడు తల్లిదండ్రుల సంతోషానికి మేరలేదు. పోయిన ప్రాణాలు తిరిగి మళ్ళీ గూట్లో చేరుకున్నవి. ఇంతలో చంద్రియ్య బావిలోనించి బయటికి వచ్చాడు. చంద్రియ్యను పాపయ్య చూచాడు. అంతకు ముందు ఆపదలో వుండి తూలి సమయానుకూలంగా శపథం చేసినమాటలు గుర్తుకు వచ్చినవి. అదివరకు ఆయన ముఖంలో వున్న సంతోషం అంతా తుర్రున ఎగిరిపోయింది. అతన్ని శత్రువును చూచినట్టు చూచాడు పాపయ్య. చంద్రయ్య అక్కడ వుండకుండా ఇంటికి వెళ్ళిపొయ్యాడు.

## ౪

బావిలో అమాంతంగా దూకటంచేత తలకాయకు దెబ్బ తగిలి చంద్రయ్యకు నాలుగురోజులనుంచీ అభిఘాత జ్వరం తగులుతూ వున్నది. లక్ష్మికి భరించరాని మనో వ్యథగా వున్నది. అస్తమానం భర్త మంచంవద్దనే కాలం గడుపుతూ వున్నది. ఈ నాలుగు రోజుల నుంచీ చంద్ర య్యకు అన్నం లేదు. లక్ష్మిగూడా తినడం మానుకుని

అత్తకూ పిల్లకూ మాత్రం వండి పెట్టుతూ వున్నది. "నువ్వు అన్నం తిన్నావా" అని అంత జ్వరంలో వుండి కూడా చంద్రయ్య నాలు గయిదుసార్లు భార్యను అడిగాడు. ఆమె తిన్నానని సమాధానం చెప్పింది. "ఇవ్వాళ్ళ జ్వరం కొంచెం తగ్గినట్టు కనపడుతూ వున్నది. అన్నం మీదికి బుద్ధి పోతూ వున్నది" అన్నాడు భార్యతో చంద్రయ్య. జ్వరం తగ్గినట్టుందని భర్త మాటలు వినగానే లక్ష్మికి పోయిన ప్రాణం లేచి వచ్చి నట్టయి వంటిమీద చెయ్యివేసిచూచి, వికసించిన ముఖంతో "అవునండీ, నిజంగానే తగ్గింది. నిమిషంలో అన్నం వండిపెడతా వుండండి" అని త్వరత్వరగా వంటఇంట్లోకి వెళ్లింది.

బియ్యం బుట్ట చూచింది. ఒక్క గింజయినా లేదు. కళ్ళల్లో గిర్రున నీళ్లు తిరిగినవి. "అయ్యో! ఎట్లా? డబ్బులన్నా లెవ్వే. ఆయన అన్నం తిని నాలుగు రోజు లయింది. ఇవ్వాళ్ళ అన్నం కావాలని అడిగితే ఇంట్లో గింజల్లేవు. ఆయన ఇన్నాళ్ళకు అన్నం అడిగితే పెట్టలేని నా జన్మ ఎందుకు? భగవంతుడా! ఈ బీదతనాన్ని మా కెందుకిచ్చావు? అన్నంకోసం ముఖం వాచే టట్టు ఎందుకు చేస్తున్నావు? మేము చేసిన అపరాధం ఏమిటి?" అని విచారపడి "ఆయనకు ఇప్పుడు గింజ ల్లేవని తెలియనిస్తే చింతపడతాడు. తెలియ నివ్వకూడదు. ఎలాగో గింజలు తెచ్చి అన్నం వండి తీసుక వెళ్ళాలి" అని నిశ్చయించి

ఆలోచించడం మొదలుపెట్టింది. ఎదురుగా పాపయ్య ఇంటిగోడకు పంది కొక్కులు కన్నంవేసి కొట్టిపోసిన వరి పొట్టు నాలు గయిదు మానికెల్లకై ఆమె కళ్ళపడ్డవి. ఆమె ప్రాణం లేచి వచ్చినట్టయింది. "అంత పొట్టులో దోసెడు గింజలు దొరక్కపోతయ్యా, ఆయన వరకు ఈ పూటకు గడిస్తే చాలు" అనుకుని గంపెడాశతో లేచి అక్కడికి వెళ్ళి, పొట్టంతా వత్తి చూచింది. ఆమె ఆశ వృథా అయింది. ఒక్క గింజయినా గట్టిది తగల్లేదు. ఆమె పాణం ఉసూరు మన్నది. "మాకుమల్లే అవీ ఎంతదరిద్ర గొట్టువో! పాపం వాటికి ఎంత ఆకలి అయ్యిందో, మనబోటి అన్నాతురులు ఇంకా వుంటా రని అయినా గుర్తించ కుండా ఒక్కగింజయినా మిగలకుండా తినివేసినవి. పాపయ్య ఎంత పిసినిగొట్టువాడో అతనికి అవి కూడా జడిసి ఇక్కడికి దొంగతనంగా తెచ్చుకుని తిన్నవి పాపం" అనుకుంటూ ఉంటే ఆమె దృష్టి పాపయ్యగారి ఇంటిమీదికి మళ్ళింది. "తవ్వెడు బియ్యం బదు లడిగి పట్టుకవస్తే ఇవ్వాళ్ళకు గడిచి పోతుంది' అనుకుని "ఏమో పోతే వాళ్ళేమంటారో" అని వెళ్ళడానికి సందేహించింది. ఎం డెక్కుతూ వున్నది. భర్తకు వేళ మించి పోతూ వున్నది. "సరే వెళ్ళక తప్పదు. అడిగి తెద్దాం" అని బయలుదేరింది. నాలు గడుగులు వేసింది. అయిదో అడుగు ముందుకు పడలేదు. ఆమె కేదో తప్పు పని

చేస్తున్నట్టు గుండెలు దడదడా కొట్టుకో మొదలు పెట్టి నవి. వాళ్ళ నడిగితే ఏమంటారో అని వెళ్ళి అడగడానికి ఆమెకు బిడియం వేసి దారిలోనుంచే ఇంటికి తిరిగివచ్చింది. అన్నం తీసుకుని వెళ్ళకుండా భర్తవద్దకు పోవడానికి తానేదో అపరాధం చేసినట్టు తన మనస్సు అంగీకరించ లేదు. "ఈ దరిద్రం పుటక ఎందుకు పుట్టాను" అని తన్ను తాను నిందించుకున్నది. ఇంతలో భర్త "ఏమేవ్" అని కేక వేశాడు. ఆ కేక విని ఆమెకు ప్రాణం ఎగిరిపోయి నట్ట యింది. గుండెలు గబగబా కొట్టుకో సాగినవి. పలకడానికి నోరు పెగిలి రాలేదు. పలకా లని ప్రయత్నించింది. కానీ ఏమీ ప్రయోజనం కలగలేదు. ఇంకెక్కడయినా తెద్దా మంటే వీళ్ళచుట్టూపట్లా వున్నవాళ్ళు వీళ్ళకంటె బీద వాళ్లు. సరే "ఏ మయితే అది అవుతుంది" అని ప్రాణా లన్నీ బిగబట్టుకుని పాపయ్యాగా రింటికి నడిచి వెళ్లింది.

వెళ్ళి తనభర్తకు జ్వరం తగులుతున్న దనీ, ఒక్క తవ్వెడు గింజలి స్తే రెండురోజుల్లో మళ్ళీ తెచ్చి యిస్తాననీ అడగలేక అడగలేక సగం చచ్చి పాపయ్యా భార్య సుంద రమ్మను అడిగింది. ఈ మాటలు విని లక్ష్మి ముఖం చూ స్తే సుందరమ్మకు జాలివేసిండి. గింజలు ఇవ్వా లను కున్నది. ఇంతలో ఆ మాటలు వింటూ వున్న పాపయ్యా ఇటువంటి పీడలు పెట్టుకో బోకు అన్నట్టు భార్యవంక ముఖం చిట్లించుకుని కళ్లు బాగా విప్పి ముళ్లు గుచ్చినట్టు

చూచాడు. సుందరమ్మ భర్త ఉద్దేశాన్ని తెలుసుకున్నది. గింజలు చాటుగానైనా తీసుకవెళ్ళి ఇవ్వాలని చూచింది. గింజలపెట్టెకు తాళం వేసి తాళపుచేతులు భర్త మొల్లో కట్టుకోవడంవల్ల చేసేది ఏమీ లేక, "అయ్యో! పాపం ఎప్పుడూ అడగని దానివి వచ్చావు. మాకూ గింజలు ఇవ్వాళ్ళకే వచ్చినవి. ఉంచుకునే లేవన్నారని అనుకుంటా వని నాకు కష్టంగా వున్నది" అని భర్త మర్యాదను కాపాడింది.

లక్ష్మమ్మ ఆ మాటలు విని నిర్విణ్ణురాలయింది. ఆమె ముఖంలో కత్తికాటుకైనా నెత్తురుచుక్క లేదు. చిన్న పుచ్చుకుని బరువెక్కిన హృదయంతో ఇంటి దారి పట్టింది. ఆమెకు దుఃఖం కోపం ఒక్క మారుగా వచ్చినవి. ఆమె కళ్ళవెంట అప్రయత్నంగా నీళ్ళు జలజలరాలి దారిపొడుగూనా పడ్డవి. "ఈశ్వరా! అందరూ నీకు సమాన మైన బిడ్డలు కారా? ఒకళ్ళని ఏడిపిస్తూ ఒకళ్ళని నవ్విస్తూ వుంటావు ఎందుచేత? అందరినీ సమానంగా చూడ రాదూ? దేవుడవైన నీదగ్గిర ఇన్ని బుద్ధులు వుండబట్టే నిన్నుపట్టి వీళ్ళుగూడా నేర్చుకున్నారు" అని నిందిస్తూ పాదాలకు మణుగురాళ్ళు కట్టినట్టు భారంగా గడప మెట్లెక్కుతూ ఇంట్లో ప్రవేశించింది. ఆమె పుట్టాక తీవ్రమైన మనోవ్యథ పొందిన రోజదే. ఆ క్లేశాన్ని భరించలేక

ఆమె కోమల శరీరం కందిపోయింది. కళ్ళవెంట నీళ్ళు కూడా రాకుండా ఇంకి పోయినవి.

ఇంతలో వాళ్ళింటికి ముష్టెత్తుకునే ఒక ముసలాయన వచ్చాడు. "అమ్మా! నువ్వు పాపయ్యగారింటికి రావడం వాళ్ళు కాదని చెప్పడం, అంతా చూచాను. అప్పుడు నీముఖం చూస్తే నాకు ఎంతజాలి వేసిందనుకున్నావు తల్లీ! ఇదిగో బియ్యం తీసుకో" అని చంకన వున్న బియ్యం మూటను ఇవ్వబోయ్యాడు.

ఆ మాటలకు లక్ష్మి ఎండిపోయిన ఆశాలత చిగిర్చి నట్టయింది. అతని ఉదారబుద్ధిని మనస్సులో పొగుడు కుంటూ, "అయ్యో! తండ్రీ! నువ్వు నీపొట్ట కోసం అక్కడక్కడా తెచ్చుకున్న గింజలవి. మాకిస్తే నీ కెట్లాగు?" అన్నది.

"అమ్మా! నాది ఒక్క పొట్ట. గిద్దెడు గింజ లయితే నాకు చాలు. రోజూ వచ్చే గింజలన్నీ నాకు సరిపడా వుంచుకుని, మిగిలినవి ఎవరికో ఇట్లాగే ఇచ్చి వేస్తుంటాను. పాపం నువ్వు ఇంట్లో గింజలు వున్నప్పుడల్లా పొమ్మనకుండా ఇన్ని వేసే దానివి. ఏమి శాశ్వతం తల్లీ! బతికినన్నాళ్లూ ఇంతపొట్టకూ, బట్టకూ అంతే. పొయ్యేటప్పు డేమన్నా కట్టుక వెళ్ళుతామా. ఇంకా నేను తిరగవలసినవి కొన్ని ఇళ్ళు వున్నవి. అవి నాకు సరి

పోతవి. ఇవి తీసుకో నా తల్లీ! నీముఖం చూస్తే నాకు కళ్ళనీళ్ళు వస్తున్నవి. సందేహించ బోకు" అన్నా డాయన.

లక్ష్మి కృతజ్ఞతగా చూస్తూ, విధిలేక పుచ్చుకుని వడివడిగా వంట ఇంట్లోకి వెళ్ళింది.

## ౫

ఒకనాడు లక్ష్మి దొడ్లో బావివద్ద నీళ్ళు చేదుతూ వున్నది. "లక్ష్మీ" అని ఎవరో పిలిచినట్టు వినిపించి నీళ్ళు చేదటం ఆపి అటూ ఇటూ చూచింది లక్ష్మి. ఎవ్వరూ కనిపించలేదు. తల వంచుకుని నీళ్లు చేదుకుంటూవున్నది. మళ్ళీ "లక్ష్మీ, ఇటు ఇటు" అని వినపడ్డది. తలయెత్తి అటూ ఇటూ మళ్ళాచూచింది. "నేనే లక్ష్మీ పిలిచింది" అని వాళ్ళకూ వీళ్ళకూ మధ్య పడిపోయిన మట్టిగోడవద్ద ఎండిపోయిన బంతిచెట్ల నడుమ నిలుచుని సుందరమ్మ అన్నది. నీళ్ళు తోడడం ఆఖరయినందున గోడవద్దకు వెళ్లి పూస్తూవున్న మందార చెట్టువద్ద నిలుచుని "ఎందుకమ్మా పిలిచావు" అన్నది లక్ష్మి.

"నీతో మాట్లాడా లని నాలు గయిదు రోజులనుంచీ నీకోసం చూస్తూ వున్నాను. సందర్భ పడలేదు- ఇవ్వాళ్లే ఆయన పొద్దున్నే ఎక్కడికో వెళ్లాడు. అందువల్ల ఇప్పుడు

వీలు చిక్కింది. మొన్న నువ్వు బియ్యానికి వచ్చిన దగ్గిరి నించీ నా మన సంతా నీ మీదే వున్నది. ఆ రోజు మీ కెట్లా గడిచిందా అని ఎన్నోసార్లు అనుకున్నాను. ఆ రోజు నీ దీనవదనం నా కళ్ళల్లో ఇప్పటికీ మెదులుతూనే వున్నది. కావలసినంత డబ్బు వున్నది. తగలెయ్యనా ఎందుకు? ఈగకూ, దోమకూ కూడా పోనియ్యడు. దయా ధర్మాలూ లేవు. ధన పిశాచిలాగా ఎప్పుడూ తాళపు చేతులు మొల్లో కట్టుకుని అస్తమానం పెట్టెవద్దనే పడి వుంటాడు. మీకేదన్నా సహాయం చెయ్యాలని చూచాను. ఎట్లా వీలవుతుంది. తాళపుచేతులు దగ్గిరకట్టుకుని ఎప్పుడూ అక్కడే పాతేసుకుని ఉంటాడయ్యో. లక్ష్మీ! నేను పూర్వజన్మంలో ఏం నిప్పులపూజ చేశానో నా కిటువంటిభర్త దొరికాడు? నీ పూర్వపుణ్యం మంచిది. మంచి భర్త దొరికాడు. డబ్బెందుకు తగలెయ్యనా? ఈడూజోడూ కుదిరిన భర్తతో కాపరం చేస్తూ అడుక్కు తిని అయినా సంతోషంగా కాలం గడపొచ్చు" అన్నది సుందరమ్మ.

"అవును, ఆడదానికి ధనచింతకంటే పతిచింత ఎక్కువ. మా దగ్గిరేం డబ్బున్నది? నా భర్తే నాకు డబ్బూ అన్నీ అలంకారాలూను. ఆ మహారాజు పల్లెత్తు మాట నన్నంటాడా. ఎంత ప్రేమగా చూచుకుంటాడు! అటువంటి భర్త నవ్వుముఖం చూస్తూవుంటే

చాలదూ? ఆడదానికి ఇక ఆకలి వేస్తుందా, సొమ్ము మీదికి భ్రాంతిపోతుందా! మాకు మా పూరిల్లే ఇంద్రభవనం. మా పేదతనమే మాకు సకల ఐశ్వర్యాలు" అన్నది లక్ష్మి.

"నిజమే లక్ష్మీ! నా దుస్థితంతా నీకోసారి చెబుదామనుకుంటాను. నాబోటి దానికి సుఖం ఎలా వుంటుంది. ఈడుమించిన భర్త, అందులో పెద్దపులిలాంటి ముఖం, పెద్దపొట్టా, ఏను గంతలావున, గూపమా పాడా, అతన్ని చూస్తేనే నా కసహ్యం వేస్తుంది. నా స్థితి నీ బోటి ఉత్తమసతి హృదయంలో వేస్తే మంచిది. నిజం చెప్తున్నాను. నా కతనివల్ల సంసార సుఖం ఏమీ లేదు. దగ్గిరికి వస్తే ముసలికంపూ, ఏదువాసనా. సిగ్గు విడిచి చెప్తున్నాను. వంటిమీద చెయ్యివేశాడా పెద్ద రాయి పడ్డట్టుండి, వళ్ళు జలదరిస్తుంది. నా తల్లిదండ్రులు నాలుగు వేలకు నన్నతని కమ్మారు. అతని డబ్బే నా ప్రాణం తీసింది! నా జీవితాన్ని కూలదోసింది. మీ భార్యాభర్తలను చూచి నేను ఎంతో ముచ్చట పడుతూ వుంటాను. నా స్థితి తలుచుకుని నేను ఏడవని రోజు లేదు. నా జీవితం దుఃఖమయం అయిపోయింది. చూడు, సొమ్ములు లేకపోయినా నీ ముఖం ఎంత కళకళలాడుతూ వున్నదో. నాకు ఇన్ని సొమ్ములు వున్నా ఏమి లాభం. నా ముఖం కరుడు కట్టిపోయింది." అని అటూ ఇటూ

ఎవరూలేకుండా చూచి మెళ్ళో కాసుల పేరులోవి రెండు కాసులు తీసి "లక్ష్మీ! ఇవి తీసుకో! మీ కిచ్చేటందుకు ఇంతకంటే నా కేమీ చిక్కడు" అన్నది.

లక్ష్మి ఆమె ఉదారభావానికి ఆశ్చర్యపడుతూ "వద్దమ్మా వద్దు, మా కిలాగే గడచి పోతూవున్నది." అన్నది.

"తీసుకోమ్మా! మీబోటి పుణ్యదంపతులకు ఏదన్నా సమర్పిస్తే మాబోటి వాళ్ళం తరిస్తాము. ముందు జన్మకైనా మంచి భర్త లభిస్తాడు. పొద్దున్నే లేచి మీముఖాలు చూస్తే పంచమహా పాతకాలు నశిస్తవి. మిమ్మల్ని భక్తితో పూజిస్తే వచ్చేజన్మలో సినిమానటైనాకూడా పుట్టొచ్చు" అని లక్ష్మి వద్దంటున్నకొద్దీ బలవంతాన ఆమె పమిటచెంగుకు రెండుకాసులూ ముడివేసింది సుందరమ్మ.

౬

పాపయ్యభార్య సుందరమ్మకు ఇరవైయేళ్ళకు ఒకటో రెండో పెచ్చువుంటయ్యి; చదువుకున్నది. యవ్వనంలో తనికిసలాడుతూ వున్నది. అందులో కొంతరూపవతి కూడా. పాపయ్యకు రెండో సంబంధం. మొదటి సంబంధానికి ఒక్క ఆడపిల్ల, ఈ సంబంధానికి అసలే పిల్లలు కలగలేదు. ఇంటిపక్కన వున్న చంద్రయ్యను చూస్తే

ఆమెకు చాలా సంతోషం. ఎన్నోసార్లు ఆమె కటాక్ష వీక్షణాలు విసిరి మన్మథుణ్ణి అతనిపైకి దండయాత్రకు పంపింది. కానీ చంద్రయ్య ఆమెవంక కన్నెత్తైనా చూడ లేదు. మన్మథుని శక్తి శివునిమీదన్నా పని చేసింది కాని చంద్రయ్యమీద సారలా. చప్పుడుచేసి అతనిచూపును తనవైపుకు మళ్ళించుకుందా మని అనేకసార్లు ప్రయ త్నించింది. అతడు తలకాయ తిప్పిచూచి ఆమెవైపు దృష్టి నిలపకుండా పెడముఖం పెట్టేవాడు. రెండుసార్లు పలక రించి చూచింది. అతనిలో ఆ వుద్దేశ్యం వున్నట్టు కనుపిం చలా. సిగ్గు విడిచి మాట మాటవరసలో అందించింది కూడా. ఏమీ ప్రయోజనం కలగలా. "నీకు అంత అందం వుండి ఎందుకు? తగలెయ్యనా" అని తనలో తిట్టుకుని సుందరమ్మ తనవుద్దేశాన్ని అతనిమీద నుంచి మరల్చు కున్నది. కానీ అతడు కంటపడ్డప్పు డల్లా చూపులతో ఆలింగనం చేసుకుని మరీవదిలి పెడుతూవుంటుంది.

పాపయ్య వీధి అరుగు మీద కూర్చుని వాళ్ళతో వీళ్ళతో ఆ మాటా ఈ మాటా సందున "మాది ఎంత మంచి దనుకున్నారు? నేనంటే దానికి ఎంతభక్తి. పొద్దు న్నే నా పాదాలకు మొక్కందే ఏ పనీ చెయ్యదు. నన్ను ఒక్క నిమిషం చూడంది వుండలేదు. నేను ఒకరోజున ఒకముద్ద తక్కువతిన్నానా అది గిలగిల్లాడుతూ ఎంతో నొచ్చుకుంటుంది. అది ఎప్పుడైనా ఇంట్లో పనిచేస్తు

న్నప్పుడు బావిలో కాస్తచేద వేశానా ఎక్కడ కని డుతుందో మరి, ఒక్కగంతులో వచ్చి మీ రేమిటండీ తోడడం అని చేతుల్లో చేద లాక్కుంటుంది. ముసలి ముండాకొడుకును గదా నామీద దానికి ఎంత మోహం అనుకున్నారు? వంట చేసిందా అమృతంతో సమానం. ఏమి దాని తెలివి తేటలు! ఇటువంటి ఆడ వాళ్ళు అందరికీ దొరుకుతా రండీ"? అని తాను ఒక మన్మథు డయినట్లూ, తన భార్యా ఒక మహాపతివ్రత అయినట్లూ, పొగుడుకుంటూ గప్పాలు కొడుతూ వుంటాడు.

ఒకనాటి ఉదయం చంద్రయ్యా వీధి అరుగుమీద ముఖం కడుక్కుంటూ వున్నాడు. పాపయ్యగారి ఇంటి వసారాలో ఒక ఆసామీ, పాపయ్యా, లెఖ్ఖదగ్గిర తఖ రారు పడుతూ వున్నారు. పదిరూపాయిలు ఎక్కువ వ్రాశావని ఆ ఆసామీ, లేదు నేను సరీగానే వ్రాశానని పాపయ్యా, సరీగా వ్రాసి నట్టయితే రామాయణం నెత్తిన పెట్టుకుని ప్రమాణం చెయ్యి అని ఆ ఆసామీ, ఛా బుద్ధితక్కువ మాటలు మాట్లాడబోకు; నా కేం ప్రమాణం చెయ్యాలని? కావలసినస్తే నువ్వే పదిసార్లు చేసుకో అని పాపయ్యా, ఇట్లా మాటలు ముదిరి తాతా మనమడు వరసకు వచ్చింది. తర్వాత నోటి అంతరం గడిచి చేతుల వరకూ వచ్చింది. చేతులు చేతులూ కలిసి

నవి. ఆ ఆసామి బక్క చిక్కి బలహీనంగా ఉన్నాడేమో, పాపయ్య ఒక దెబ్బవేసి ఒక నెట్టు నెట్టాడు. ఎత్తుగా వున్న అరుగుమీద నుండి కిందకు పోయి ఆ ఆసామి రెండుబారల దూరంలో పడ్డాడు. కిందపడి నేలకు బాగా అదుముకున్నందున ఆ ఆసామీకి తలకాయకు బలమైన గాయం తగిలి రక్తం రావడం మొదలు పెట్టింది. అతను పాపయ్యమీద కలియబడే తాహతు లేక, చేసేది ఏమీ లేక, లేచి, దుమ్ము త్తి పోసి తిట్టి, నీ దుంప తెంపుతా ఉండు అని వెళ్లిపొయ్యాడు. ఇదంతా అరుగుమీద కూర్చున్న చంద్రయ్య చూస్తూనే వున్నాడు.

నాలుగు రోజుల కల్లా ఆ ఆసామి చార్జి దాఖలుచేసి నట్టు పాపయ్యకు నోటీసులు వచ్చినవి. చంద్రయ్యకు సాక్ష్యం నోటీసులు వచ్చినవి. పాపయ్య చంద్రయ్య ఇంటికి వెళ్లి ఆ ఆసామి కాలుజారి తనంతట తానే కింద బడ్డందున దెబ్బ తగిలిందనిన్నీ, తా నేమీ చెయ్యలే దనిన్నీ చెప్పమని అన్నాడు.

ఆ మాటలకు చంద్రయ్య "నే నబద్ధం ఆడను. చూచింది చూచినట్లు చెపుతాను" అని నిర్మొగమా టంగా ఖండితంగా చెప్పాడు.

ఆ మాటకు పాపయ్యముఖం వెలవెలపోయి "ఇరుగు పొరుగున వున్నవాళ్ళం. ఏదన్నా కష్టాలు వస్తే మనం

మనం ఆదుకోకపోతే ఎట్లా? ఈ సమయంలో నా పక్షం మాట్లాడకపోతే వీల్లేదు" అని పాచిక వేశాడు.

ఆ పాచిక చంద్రయ్య ముందు పారలా. డబ్బు పెట్టుబడి పెడతాను, వ్యాపారం చేసుకుందువు గాని నిన్ను అంతవాణ్ణి చేస్తాను ఇంతవాణ్ణి చేస్తాను, అని పాపయ్య ఆశలు పెట్టి మెరిపించాడు. అవన్నీ చంద్రయ్య బుర్రకు ఎక్కలేదు. ఆఖరికి రెండు చేతులూ పట్టుకుని బతిమలాడాడు. చంద్రయ్య లొంగలేదు. ఇక చేసేది లేక పాపయ్య అప్పటికి ఊరుకున్నాడు.

వాయిదా రెండురోజులు ఉం దనగా రెండు వంద లిస్తాను తన పక్షం చెప్పమని పాపయ్య చంద్రయ్యవద్దకు రాయభారం పంపాడు. చంద్రయ్య "లక్ష రూపాయలు ఇచ్చినా నే నబద్ధం చెప్పను. పద్దపద్దాకా నా వద్దకు రావద్దు" అని ఆ వచ్చినవాళ్ళతో చెప్పివేశాడు. "బలవంతునితో విరోధం పెట్టుకో వద్దు. నీ కంత మంచిది కాదు" అని ఆ వచ్చినవాళ్ళు అన్నారు. చంద్రయ్య నిర్లక్ష్యంగా "కా నివ్వండి ఏం చేస్తాం" అన్నాడు. అంతటితో వాళ్ళు వెళ్ళిపొయ్యారు.

చంద్రయ్య మేలుకోరే కొందరు స్నేహితులు "అంత డబ్బు గల పాపయ్య పదిరూపాయల కోసం అబద్ధమాడి డబ్బు మీద తీపి చేత పైగా అతని తలకాయ

పెచ్చు గూడా ఊడ కొడితే కూటికి లేని బీదవాడివి నువ్వు ఎంత మాత్రం శ్రమ పడ నవసరం లేకుండా ఎవరి తలకాయా పగల గొట్ట నక్కరలేకుండా ఒక్క మాటలో రెండువందలు వచ్చి వళ్లో పడుతూ వుంటే ఇంకా వెనకా ముం దాడతా వెందుకు”? అని చంద్రయ్యకు హితోపదేశం చేశారు. చంద్రయ్య ఆ మాటలనుగూడా లెఖ్ఖచెయ్య లేదు. వాయిదా నాటికి చంద్రయ్య కోర్టుకు వెళ్లి నిజంచెప్పడం, పాపయ్యకు జరిమానా పడడం, జరిగి పోయింది.

## ౨

పాపయ్యకు ఇప్పుడు వున్న ఇల్లు పడగొట్టించి మేడ వెయ్యాలని సంకల్పంకలిగింది. వాళ్ల స్థలం వెడల్పుఎక్కువ లేకుండా తోకలాగా పొడుగు ఎక్కువ వున్నందున మేడకు యోగ్యంగాలేదు. బాజాయు వైపున ఇంకాస్థలం, కొంత కలిస్తేనే గాని మేడ పడేటట్టు కనుపించ లేదు. దక్షిణంవైపు అమ్మేస్థలంవున్నది గాని దక్షిణం కలుపుకోగూడ దని ఆస్థలంమీది నుంచి దృష్టి తిప్పుకున్నాడు. ఇక ఉత్తరం కలుపుకోవాలి. ఉత్తరపు వైపున కాపరంచేస్తున్నది చంద్రయ్య. చంద్రయ్యను ఇల్లు తనకు అమ్మ మని కబురుచేశాడు. చంద్రయ్య కోపపడి “ఆమాట నాదగ్గిర

తేవద్దు" అన్నాడు. పాపయ్య అంతటితో వదిలిపెట్ట కుండా ఎందరిచేతనో చెప్పించాడు. "ఆయిల్లుస్థలం తన కి స్తే మరో ఇల్లు కొనిపెట్టి పైగా వెయ్యిరూపాయిలు రొఖ్ఖం ఇస్తాను" అన్నాడు. అందుకూ వప్పుకోలేదు. ఆఖరుకు పదిగజాల నెడల్పున అయినా ఇవ్వవలసింది, వెయ్యి రూపాయలు ఇస్తా నని కబురుచేశాడు. లాభంలేక పోయింది.

రెండంత స్తుల మేడ వేసి పై అంత స్తులో ఖులాసాగా మంచి గాలి పీలుస్తూ, పడక్కుర్చీలో కాళ్లు బారచాపి పండు కోవా లనీ, అందులో ఠీవిగా కూర్చుని పడుచు పెళ్లాన్ని వళ్లో కూర్చోపెట్టుకుని భోగం అనుభవించాలనీ అతనికి ఎన్నాళ్లనుంచో ఉబలాటం వుండడం చేత స్థలం కోసం విశ్వ ప్రయత్నాలు చేశాడు. అన్నీ నిష్ఫలం అయి పోయినవి. అతనికి చంద్రయ్య స్థలం కలి స్తేనే గాని డాబా పడదు. "కొయ్య ముండా కొడుకు! ఉండు, వీడి మదం అణిగిస్తా"! అని పళ్లు పటపట కొరికాడు. స్థలం ఎలా వస్తుందా అని దీర్ఘాలోచన చెయ్యడం మొదలు పెట్టాడు. చంద్రయ్య బతికి వుండగా స్థలం వచ్చే టట్టు అతనికి కనుపించలేదు. అతని వూహ చాలా వరకు పోయింది. వెయ్యి రూపాయిలు ఖర్చుపెట్టి చంద్రయ్యను కడ తేరి స్తే—ఆ మాట అనుకునే సరికి ఉరి స్తంభం ఎదట ప్రత్యక్ష మయింది. అతని కాళ్లూ చేతులూ వణికి

నవి. గుండె వేగంగా కొట్టుకో మొదలు పెట్టింది. "అమ్మయ్యో! ఆ పని వద్దు" అనుకున్నాడు. ఇంకే మయినా వున్న దేమో నని ఆలోచించాడు. "కొన్ని రూపాయిలకు అతని మీద నోటు సృష్టించి దావా వేసి స్వాధీనం చేసుకుందామా" అనుకున్నాడు. పోలీసులూ జైలూ, కళ్లకు కట్టినట్టు కనిపించినవి. భయపడ్డాడు. "మొత్తం సృష్టించడం కష్టం. సాక్షి సంతకాలూ వ్రాసే వాడూ ఎక్కడ దొరుకుతారు? కొంత సొమ్మన్నా బాకీ వుంటే దాన్ని బట్టి ఏదో తిప్పలు పడవచ్చు." కాస్సేపు ఆలోచించి "ఎట్లా చిక్కక పోతాడో చూస్తాను" అనుకుని అక్కడ నుండి లేచాడు పాపయ్య.

కొన్ని నెలలు గడిచినవి. చంద్రయ్య అత్తగారిది ఈతముక్కల. వాళ్లూ పేదవాళ్ళే. అతని మరదలి పెండ్లి వచ్చింది. రైలు ఖర్చులకు గానీ చదివింపుకు గానీ పాతిక ముప్పయి రూపాయిలు కావాలి. బతికిచెడ్డవాడు. తన దగ్గిర ఏమీ లేక పోయినా మరియాదలు జరిపే విషయంలో గానీ, ఇంకా ఏదన్నా కర్చుపెట్టవలసి వస్తే గానీ, తలైనా తాకట్టుపెట్టి బాగా జరపాలంటాడు. తాహాతుకు మించిన త్యాగబుద్ధి ఉన్నది. అతని దగ్గిర డబ్బూలేదు, లోభితనమూ లేదు. ఆ వేళ ఒక్క కానీ చేతులో లేదు. ఎక్కడన్నా అప్పు తెద్దామంటే ఇచ్చే

వాళ్ళు ఎవ్వరూ కనుపించలేదు. పెండ్లి రెండురోజుల్లోకి వచ్చింది. భార్యా భర్తలు దిగాలపడి కూర్చున్నారు.

ఇటువంటి సమయంలో పాపయ్య వాళ్లింటికివచ్చాడు. చంద్రయ్య చూచి ఎప్పుడూ రానివాడు ఎందుకు వచ్చాడా అని ఆశ్చర్యపడి కూర్చోమన్నాడు. పాపయ్య లేని సంతోషం తెచ్చుకుని విషపునవ్వు నవ్వుతూ, "ఏం చంద్రయ్యా ! ఎక్కడా కనుపించడం లేదే!" అన్నాడు.

అతని నోటివెంట అంతటి చల్లనిమాట చంద్రయ్య ఎప్పుడూ విని లేడు. కనక ఆశ్చర్య పడుతూ ఆ పరామర్శకు కారణ మేమిటో ఊహించుకోలేక "ఏదోనండీ, నా పనిమీద నేను తిరుగుతూవుంటాను. తిరగంది మా డొక్కలు ఆడవు గదండి"? అన్నాడు సదభిప్రాయంగా.

పాపయ్య ప్రేమ ముఖంలో కనపరుస్తూ, ఇక యెత్తు కున్నాడు. "అందుకే, పాపం, చంద్రయ్యా! మీ యింటికి ఇప్పుడు నేను వచ్చింది. నువ్వు పొద్దున్నే లేవడం, బల్ల నెత్తిన వేసుకుని ఎర్రటి అగ్గిలో ఇల్లిల్లూ, బాజారు బాజారుకూ తిరగడం, నీ కష్టాన్ని నేను చూడలేకుండా వున్నాను. అట్లా బల్ల నెత్తినవేసుకుని తిరక్కపోతే, నన్ను కావలసినవరకూ డబ్బు అడిగి తీసుకుని బజార్లో హాయిగా కొట్టుపెట్టుకోరాదూ? నీడపట్టున కూర్చుని శ్రమ లేకుండా సంపాదించవచ్చునే" అన్నాడు.

ఆ మాటలకు చంద్రయ్య నివ్వెరపోయి ఆ యన నిర్హేతుక జాయమానా కటాక్షాన్ని గ్రహించలేక "ఈ బీదవాళ్ళమీద తమకు దయగలిగినందుకు సంతోషిస్తు న్నాను. ఏదో లెండి, ఇవ్వకపోయినా యిచ్చినంత మాట న్నారు. అదే పదివేలు" అన్నాడు అమాయకంగా.

"అబ్బే! కాదు చంద్రయ్యా, నేను ఊరికే అనడం కాదు. నువ్వు ఇప్పుడడిగి తీసుకో యిస్తానో లేదో. నీకు అప్పు ఇవ్వడానికేమయ్యా, మంచివాడివి! నువ్వడిగితే చాలు, ఎవడయినా నీకాళ్లదగ్గర తెచ్చిపొయ్యడూ" అన్నాడు పాపయ్య.

చంద్రయ్య "ఆయన మాట అందించనే అందించాడు. ముప్పయి రూపాయిలు అడిగి తీసుకుందామా. ఈ ముప్పు గడిచి పోతుంది" అనుకుని, "ఏమో తీరా అడిగే సరికి ఏమంటాడో" అని సందేహిస్తూ ఆలోచించడం మొదలు పెట్టాడు.

"ఏం చంద్రయ్యా! ఆలోచిస్తున్నావు. రెండువందలు పంపేదా ? ఇరుగూ పొరుగున వున్న వాళ్లం ఒకళ్లని ఒకళ్లు ఆదుకోక పోతే ఎట్లా?" అన్నాడు పాపయ్య.

చంద్రయ్య కోరిక హృదయంలో దాగలేక పోయింది. హృదయాన్ని దూసుకుని అతనికి తెలియకుండానే బైటికి వచ్చింది. "మీరు అంతగా నా మీద దయ

చూపిస్తున్నారు గాబట్టి ముప్పయి రూపాయిలు ఇప్పించండి" అన్నాడు.

తన పన్ను గడ పారిందని సంతోషిస్తూ ఇక అందుకున్నాడు పాపయ్య. "ముప్పయి రూపాయి లేమి టయ్యా! చచ్చుముక్క కాకపోతే, నేనిచ్చినట్టూ నువ్వు తీసుకున్నట్టూనా, ఇస్తే నీ కేదన్నా ఉపయోగించాలా? ఇంత డబ్బుగలవాణ్ణి ముప్పయి రూపాయిలు ఏమని యిచ్చేది? నాకుచిన్నతనం కదూ! రెండువందలు తీసుకో. నా నోటి వెంట ఏం వచ్చిందో వచ్చింది. బజాట్లో కొట్టుపెట్టుకుని హాయిగా సుఖపడు. అప్పుడు మా అమ్మాయి బావిలో పడితే పైకి తీసి బతికించావు పాపం. వడ్డీ ఇవ్వాలని దడుస్తున్నావు కామాలు పాపం. మాకు అంత సహాయం చేసిన వాడివి. నీదగ్గిర చస్తే వడ్డీ పుచ్చుకుంటా నటయ్యా! పిచ్చివాడివి లా గున్నావు! నీ కష్టాలన్నీ చూడలేకుండా వున్నాను. మీారు కోరినంత డబ్బూ ఇస్తాను. మీారు పైకి రాం డయ్యా అని మొత్తుకుంటూ వుంటే నీ బాగును నువ్వు కోరుకోకుండా అల్లా దరిద్రింతోనే ఉంటానంటావే మయ్యా! ఇంతా ఏడ్చేది నే నెందుకంటే, పక్కన డబ్బుగలవాడివి ను వ్వుండి కూడా వాళ్లకి కాస్త సహాయం చెయ్యలేక పోయ్యావ్రూ అని చూచేవాళ్లు నన్ను చివాట్లు వేస్తా రని. తెలిసిందా? వెర్రివాడివి కాకపోతే

ఎవడికైనా కాస్త మాట అందిస్తే కొసరి కొసరి ఇంకా తే తెమ్మంటాడు" అన్నాడు.

"మీరంతగా చెపుతూ వున్నారు కాబట్టి అరవై రూపాయలు ఇప్పించండి. నాలుగుకాయలు పెట్టుకుని బజాట్లో కూర్చుంటాను" అన్నాడు చంద్రియ్య.

"నీకు బాగుపడా లని లేదా ఏమిటి ? చంద్రియ్యా! నువ్వు కాదంటుంటే నే నేం చచ్చేది? నీ యిష్టం! నా దగ్గిర వందరూపాయిలకు తక్కువ పద్దు లేనే లేదు. వేలు ఇవ్వడం వేలు పుచ్చుకోవడం. అదీ ఈ వందయినా నిన్ను గురించే" అన్నాడు పాపయ్య.

చంద్రియ్య తనకు ముప్పయి రూపాయిలు అత్యవసరం వున్నది గాన ఆయన వందరూపాయిలకూ తక్కువ పద్దు లేదన్నందున అంతకు తక్కువైతే ఇవ్వడనీ, ఇవ్వకపోతే అవసరం గడవ దనీ, వడ్డీ పుచ్చుకో నన్నందున, వందరూపాయిలు తీసుకుని అయిన వరకూ ఖర్చుపెట్టి తతిమ్మాది కదిలించకుండా ఒకచోట వుంచి, వంద రూపాయిలకూ తరుగుపడ్డ మొత్తాన్ని కొన్ని నెలల్లో భర్తీ చేసి నూరు రూపాయిలూ ఒక్కమారే కట్టి వెయ్యవచ్చు అనుకుని అందుకు అంగీకరించాడు. పాపయ్య చంద్రియ్యను ఇంటికి తీసుకుని వెళ్లి నోటు వ్రాయించి, సంతకం పెట్టించుకుని, వందరూపాయిలు ఇచ్చి వేశాడు.

ఇంటికి వచ్చిన చంద్రయ్యను చూచి సుందరమ్మకు కళ్ళపండగ అయింది. తుమ్మెదల వంటి ఆమె రెండు కళ్లూ చంద్రయ్య ముఖపద్మం మీద వాలి ఎంత సేపటికీ తిరిగి ఆమె స్వాధీనం కాలేదు.

## ౮

అయిదారు నెలలు గడిచినవి. ఒకనాడు చంద్రయ్య భార్యతో, "పాపయ్యకు నోటు వ్రాసి డబ్బు తెచ్చి చాలా కాలం అయింది. పాపయ్య అసలునిదానించే మనిషి కాడు. ఎందుచేతనో మనలను ఇంతవరకూ కదిలించనన్నా కదిలించ లేదు. ఇంకా పదిరూపాయిలు కొరవ వున్నది. అది భర్తీ చేసి త్వరగా ఇచ్చి వెయ్యాలి. మనం అడక్క ముందే ఇచ్చాడు పాపం. ఇంకా ఆలస్యం చేస్తే బాగా వుండదు" అన్నాడు.

"వచ్చేది వర్షాకాలం. ఇల్లు కురుస్తూ వున్నది. చాలా ఏళ్లయింది కప్పించి. ఈ సంవత్సరం కొత్తరెల్లు తెచ్చి బాగా కప్పించుకోక పోయ్యామా, వర్షం కురిసిందంటే ఇంట్లో వుండలేము. ఎట్లా గయినా కొరవపడ్డది గనక ఇప్పుడు పదిరూపాయిలు ఖర్చుపెట్టి ఇల్లు తిరగవేయించుకున్నామంటే అయిదారు సంవత్సరాలవరకూ పరవా లేదు. పాపయ్యకు మరికొన్నాళ్లు ఆగి భర్తీచేసి ఇవ్వవచ్చు" అన్నది లక్ష్మి.

"నువ్వు చెప్పినమాట బాగానే వున్నది, గానీ ఆయన వడ్డీ తీసుకో నన్నాడు. వడ్డీ తీసుకుంటే మనం ఎన్నాళ్ళు ఆపుకున్నా పరవా లేదు. ఇప్పుడు ఎక్కువ ఆలస్యం చేస్తే వడ్డీ పుచ్చుకోనన్నా నని ఇంత ఆలస్యం చేశా రనుకుంటా డాయన" అన్నాడు చంద్రయ్య.

"అత డంటే మాత్రం మన కెందుకు ? ఆలస్యం అయినా కాకపోయినా ఇంకొక నెల కష్టపడన్నా వడ్డీతో ఇచ్చివేద్దాము. వడ్డీ లేకుండా ఇచ్చామంటే ఏదన్నా మాటొస్తే మీ కానాడు వడ్డీలేకుండా సహాయం చేశా మని చెప్తుతారు. ఎందుకు వాళ్ల సొమ్ము? మన కసలు వద్దు" అన్నది లక్ష్మి.

తర్వాత నాలు గయిదు రోజులకు లక్ష్మి పొయ్యి మీద గింజలు కడిగిపెట్టి, కత్తిపీటమీద కూర్చుని కూర తరుగుతూ వున్నది. ఇంతలో చంద్రయ్య బుజంమీద బల్లతో అతిథిని వెంటపెట్టుకు వచ్చి "త్వరగా వంట కానియ్యి" అని భార్యతో చెప్పి "ఏం కూర చేస్తున్నావు?" అన్నాడు.

"ఆనపకాయ నిన్నటిది కాస్త మిగిలి వున్నది. పులుసు వేస్తున్నాను" అన్నది లక్ష్మి.

"సరే నే వచ్చేటప్పుడు దోసకాయలు తెచ్చాను. అవి పచ్చడిచెయ్యి. పైమనిషికూడా వున్నాడు" అన్నాడు చంద్రయ్య.

"అట్లాగే చేస్తాను, పని మీద వున్నాను. ఎండె క్కుతూ వున్నది. కాస్త దోసకాయలు చెక్కుతీసి పెట్టండి" అని భర్త ముఖంలోకి ఒయ్యారంగా చూచింది లక్ష్మి.

"సరే, తమ ఆజ్ఞ ప్రకారం నడుచుకోక పోతే రాణీ గారికి కోపం రాదూ?" అని పెదిమెల మీద నాట్యం చేస్తూ వున్న చిరునవ్వుతో భార్యదగ్గిర కూర్చుని దోస కాయలు చెక్కు తియ్యడం ప్రారంభించాడు చంద్రయ్య.

అటువంటి సమయంలో పాపయ్య యమధర్మరాజు చిత్రగుప్తుణ్ణీ, కింకరులనూ, వెంటవేసుకుని వచ్చినట్టు ఒక అమీనా,కొంతమంది మనుష్యులతో,వాళ్లింటికి వచ్చాడు. ఆ వచ్చిన వాళ్లను చూచి చంద్రియ్యా లక్ష్మి నివ్వెర పొయ్యారు. అమీనా పాపయ్యగారికి ఇల్లు స్వాధీనం చెయ్య మని అడిగాడు. పిడుగువంటి ఆమాట విని చంద్రియ్యా, లక్ష్మి, అదిరి పడ్డారు. చేతులో వున్న కూరగాయలు పట్టు వదిలి వాటంతట అవే కిందకు జారి పోయినవి. "ఏమి స్వాధీనం ఏమిటి?" అని చంద్రియ్య వణుకుతూ వున్న కంఠంతో అన్నాడు.

"ఏమిటయ్యా, ఎరగనట్టు మాట్లాడతావు? పాపయ్య నీమీద వెయ్యిరూపాయిలకు దావా చేసే, డిక్రీ పొందే, యిస్తిహారూజరిపే, ఇప్పుడు స్వాధీనానికి వస్తిమీ,

నువ్వు ఎరగనట్టు మాట్లాడితే మాత్రం పోతుందా? మమ్మల్ని కష్ట పెట్టకుండా త్వరగా స్వాధీనం చెయ్యి" అన్నాడు అమీనా దయా దాక్షిణ్యాలూ లేని గొంతుతో.

ఆ మాటలకు చంద్రయ్యకు తలకాయ బొంగరం లాగా గిర్రున తిరిగిన ట్టయింది. కళ్ళు చీకట్లు కమ్మినవి. సప్తసముద్రాలూ ఏకమై పొరి మహాప్రళయం వచ్చినట్టు కనిపించింది. భూకంపం వచ్చి భూమి గజగజ వణికిన ట్టయింది.

"అమ్మయ్యో! వెయ్యి రూపాయిలే! ఎంత దురాగ్రానికి వడికట్టాడు" అని అరిచాడు చంద్రయ్య. పాపయ్య తన ఇంటికి ప్రేమతో వచ్చి, అప్పు పట్టిం దెందుకో, తన కప్పుడు అర్థ మయింది. తాను స్థలం అడిగితే ఇవ్వలే దని ఈ దగా చేశా డని తెలుసుకున్నాడు. "దావా చేసిం దెప్పుడు? డిక్రీ అయ్యిం దెప్పుడు? నాకు నోటీసులన్నా రా లేదే! అంతా మోసం మోసం! ఇటువంటి దగాఖోర్లకు గవర్నమెంటు కూడా సహాయం చేస్తూ వున్నది. రాజే న్యాయాన్యాయాలను గుర్తించ లేకపోతే బీదజనం బతికే దెట్లా? వాళ్ల అండ చూచుకునే వీళ్లిన్ని మోసాలు చేస్తున్నారు" అనుకుని తల ఎత్తాడు. పాపయ్య వినాయకుడి లాగా అరుగు మీదకూర్చుని ఉన్నాడు.అతనివళ్లు భగ్గున మండిపోయింది.ముఖం ఎర్రపడ్డది.కళ్లు చింతనిప్పులై అగ్ని

కణాలు కక్కుతూ వున్నవి. కోపతీవ్రం చేత శరీరం కంపించింది. పళ్ళు పటపట కొరుకుతూ "ఒరేయ్! పాపాయ్!! అని పెద్ద కేక పెట్టాడు. ఆ కేకకు అక్కడ ఉన్న వాళ్లందరికీ చెవులు గింగురు మన్నవి. ప్రళయ కాలరుద్రునివలె ఉన్న అతని ఆకారాన్ని చూచి పాపయ్యను ఏమిన్నా చేస్తాడేమో నని,అయినా వాళ్లూ భయపడ్డారు. "ఇందుకా నువ్వు వద్దంటున్నకొద్దీ బలవంతాన నాకు అప్పు పెట్టింది? కడుపులో విషం పెట్టుకుని లేని ప్రేమను చూపిస్తూ, ఇంత మోసమా నువ్వు చేసేది? నూరురూపాయి లిచ్చి వెయ్యిరూపాయిలు చేశావ్రా! ఎవరన్నా చూస్తారని తలుపులు బిగించి చీకటింట్లో సంతకం పెట్టించిం దిందుకా? బీదవాళ్లను అన్యాయం చేసి నువ్వేం బాగుపడి చస్తావు? లోకుల సొమ్ము తిని నువ్వంతలావున బలిశావు. నీ వంట్లో వున్న రక్తపుచుక్కలన్నీ బీదవాళ్ల అశ్రుకణా లని తెలుసుకో. వేసుకో మా కొంప! నువ్వే బాగుపడు! మేము పై గుడ్డలతో వెళ్లిపోతాము" అన్నాడు చంద్రయ్య.

లక్ష్మమ్మ పెద్దపెట్టున ఏడుస్తూ, "ఇంత అన్యాయం ఎక్కడన్నా వుందా! మేమే కనపడ్డామా నీ కళ్లకు. మా దీపం తీసి నువ్వేం బాగుపడతావు? మా వుసురు నీకు తగలకుండా పోతుందా! ఇప్పుడు మేము ఏ చెట్టు కిందికి చేరాలి" అన్నది.

పాపయ్య ఇవన్నీ వింటూ ఏమీ తమకలేదు. ఇంకా చూస్తారేం అన్నట్టు తన వెంట వచ్చిన వాళ్లవంక కరుకుగా చూచాడు. వాళ్ళు వెంటనే ఇంట్లోకి పోయ్యారు. తరిగిన కూరగాయలు ఒకచోట పడివున్నవి. పులుసుకని నానబెట్టిన చింతపండు చట్టిలోనాని సిద్ధంగా ఒకచోట వున్నది. పొయ్యిమీద అన్నం కుతకుత లాడుతూ ఇంత ద్రోహానికి వచ్చావా పాపయ్యా అన్నట్టు ధ్వనిచేస్తూ వున్నది. నువ్వు ఎందరి నోళ్ళుకొట్టి డబ్బు కూడపెట్టినా ఆఖరికి నాలోకే రావా లన్నట్టు పొయ్యిలో కట్టెపుల్లలు మండుతూ వున్నవి. ఆ వచ్చిన వాళ్ళు ఉడికే ఉడికే కుండను దించటానికి సందేహించి బయటికివచ్చి చేతులు నలుపుకుంటూ, "పొయ్యిమీద అన్నం ఉడుకుతున్నదండీ, అయ్యా" అని పాపయ్య వంక జడుస్తూ చూచి అన్నారు. వాళ్ల మాటలు విని "అయితేఏం? కానివ్వండి" అన్నట్టు వాళ్ళకేసి పళ్ళుబిగించి గుస్సు ఉరిమాడు పాపయ్య. వాళ్ళు లోనికి వెళ్ళి ఏదో గొణుక్కుంటూ కుండను కిందికి దించివేసి ఒక్కొక్క సామానే బయట వేస్తున్నారు.

చంద్రయ్య "ఇకరా! మనం వెళ్లిపోదాం! వాణ్ణేబాగు పడనివ్వు" అని భార్యను పిలిచి "సరే కానివ్వు" అని తల పంకించి "మంచంలోవున్న తల్లిని, భార్యను చెయ్యి పట్టుకుని నడిపించుకరా" అని చెప్పాడు.

ఇంతలో ఆ బొజారు వాళ్లు నలుగురూ అక్కడకూడు కున్నారు. సంగతంతా విని పాపయ్యను మనసులో తిడుతూ, "పాపం, చంద్రయ్య మంచివాడు మనబజారులో నుంచిపోతున్నాడు అయ్యో"! అనికొందరూ, "నమ్మించి ఎంత మోసం చేశాడు దుర్మార్గుడు!" అనికొందరూ "ఇంత డబ్బుండీ ఏం లాభం? పరులకు ఒకకానీ రాలనిస్తాడా. పాపం చంద్రియ్య వుండి వాడుపోరాదూ? మన బజారు పీడా వదులుతుంది" అని కొందరూ, ఎవరికి తోచినట్లు వాళ్లు అనుకుంటూ, చంద్రియ్యను గురించి చింతి స్తున్నారు.

ఇందాక భోజనానికై వెంట తీసుకవచ్చిన మనిషిని "నీకు ఇంకోచోట పెట్టిస్తాను రా" అని చెప్పి చంద్రయ్య గబగబా ముందు నడుస్తూ వున్నాడు. వెనకాల లక్ష్మి పిల్లను చంకన వేసుకుని అత్తను మెల్లిగా నడిపించుకుంటూ వెళ్లుతున్నది. "ఇంట్లో సామానంతా మీది మీరు తీసుక వెళ్లవచ్చు" అని అమీనా అన్నాడు. చంద్రయ్య "మాకేమీ అవసరం లేదు. సామాను ఒక టొచ్చి మమ్మల్ని వుద్ధరిస్తుందా! అంతా వాణ్ణే వేసుకో నివ్వు" అని ముగ్గురూ నడుస్తూ వాకిలి దాటారు. లక్ష్మి ముఖం చింతతో వున్న దిగానీ చంద్రయ్య ముఖంలో కాస్తన్నా చింత కనపడలేదు. ముఖం ఎర్రిబారి వున్నది. కళ్ళు జ్యోతుల్లాగా వున్నవి. అతనికి ఇంకా కోపం తగ్గలేదు.

ఇంట్లో నుంచి గబగబా వెళ్ళుతూవుంటే పాదాల తాకుడుకు నేల ప్రతిధ్వనించి చూచేవాళ్ళకు భీతిని కలిగించింది.

వాళ్లు వెళ్లుతూ వుంటే ఆ బాజారు జనమంతా వనవాసం వెళ్లుతూ వున్న సీతారామలక్ష్మణుల వెంట గ్రామ ప్రజలు పడ్డట్లు వెంబడించి వాళ్లను అందాకా సాగ నంపి వచ్చారు. చంద్రయ్యా వాళ్లు ఇల్లు వదిలి బజారునే పోతూ వుంటే చూచి దుఃఖించని వాళ్లూ, అతని మంచి గుణాలను చెప్పుకుంటూ పాపయ్యను తిట్టిపోయని వాళ్లూ లేరు.

౬

చీకటి పడింది. పాపయ్య "ఏమేవ్" అని భార్యను పిలిచాడు. దొడ్డివాకిట్లో ఎవరితోనో గుస గుసలాడుతూ వున్న సుందరమ్మ ఆ కేక విని ఉలిక్కిపడి భర్త దగ్గిరికి వచ్చి కాస్త దూరంలో నుంచున్నది. పాపయ్య ఆమెను చూచి చేటంతముఖంచేసుకుని నవ్వుతూ "అంత దూరంగా వుంటా వెందుకే? నేనేం దయ్యాన్నా, భూతాన్నా? దగ్గిరికిరా! నీకో మంచిమాట చెప్పుతా" అన్నాడు.

"ఏమిటా మంచిమాట? ఇక్కడున్నాగా చెప్పు" అన్నది ముఖం చిట్లించుకుని సుందరమ్మ.

"ఇప్పుడే యిట్లా అంటున్నావు. రేపు మేడ వేశాక కూడా ఇట్లాగే పెడపెడగా వుంటావు కామాలు. మేడ తయారయ్యాక వంటకు మనిషిని పెడతా. రెండో అంతస్తులో నువ్వు అచ్చగా ఏ పనీ చెయ్యకుండా నా దగ్గరే కూర్చోవాలి తెలిసిందా? నేనేం తెలివితక్కువ వాడినా, డబ్బులేని వాడినా, చెప్పు?" అన్నాడు.

"ఆ రహస్యమేందో చెప్పుదూ ఈ గోలకే మొచ్చి గాని" అన్నది సుందరమ్మ మూతిముడుచుకుని పెడ ముఖం పెట్టి

"అదే చెప్పొచ్చేది. అంత యుక్తీ పన్ని అంత కష్ట పడి వాళ్ళ ఇల్లూ స్థలాన్ని కొట్టుకవచ్చాడని నన్ను కాస్తన్నా మెచ్చుకోవేం? ఇంకో ఆడదైతే నా పొగుడుతూ నన్నొక దేముడిలాగా కొలవపోయిందను కున్నావు? చంద్రిగాడి ఇల్లు ఇవ్వాళ్ళే స్వాధీనం అయింది. తెలిసిందా! రేపు సిద్ధాంతిని పిలిపిస్తా, ప్లాను వేయించి మూడోనాటి కల్లా మేడ తయారుచేయిస్తా తెలిసిందా! తయారయిన మర్నాడునించీ మనిద్దరం డాబా పైనే వుండడం. ఇక కిందికి దిగేదే లేదు. తెలిసిందా ఇందుకే పిలిచింది" అన్నాడు పాపయ్య.

సుందరమ్మ ఆ మాటలకు అసూయతో ముఖం ముడుచుకుని మూతి తిప్పింది.

రాత్రి పది గంట లయింది. అవి బహుళపక్షపు దినాలు. మృత్యుదేవత జడలు విరబోసుకున్నట్టు చీకట్లు గాఢంగా వ్యాపించినవి. ప్రళయ కాలగర్జనల వలె ఫెళ ఫెళ ఉరమడం మొదలుపెట్టింది. కాల యముడు నుదుట ధరించిన తిలకమో అన్నట్టు దక్షిణ దిక్కున మెరుస్తూ వున్నది. పాపయ్యా భార్యా భర్తలూ గాఢ నిద్రలో మునిగి పోయ్యారు.

గాఢ తిమిరానికి వెలుతురు విముక్తి నిచ్చింది. భళ్లున తెల్లవారింది. ఘోరవార్త. పాపయ్య ఇంటినిండా, ఆ బాజారు నిండా ఎక్కడ చూచినా జనంతో నిండి పోయ్యారు. పాపయ్య చచ్చిపడి వున్నాడు. వంటి మీద కత్తిగాట్లు ఏమీ లేవు. ఎలా చచ్చిందీ ఎవరికీ తెల్లేదు. సుందరమ్మ ఒకమూల శోకాలు పెడుతూ వున్నది. ఆ గ్రామ మంతా ఎక్కడ చూచినా ఈ ముచ్చటలే. "ఎవడో తగ్గ శాస్త్రి చేశాడు. కత్తితో పొడిస్తే కేసవుతుందని గొంతుకాయ నులిమిపారవేశాడు, బీదజనాన్ని పీల్చి పిప్పిచెయ్యకుండా ఎవడో పుణ్యాంకట్టు కున్నాడు" అనికొందరూ "గుండెఆగి చచ్చిపోయ్యాడు" అని కొందరూ "పోనీ ఇటువంటివాళ్ళు పోతే భూమికి వెలితా" అని కొందరూ "పెళ్లాం విషంపెట్టి చంపివేసింది" అని కొందరూ "బతికివుండగా ఒక్క కానైనా సద్వినియోగంచేసి ఎరగడు మానవుడు! ఇప్పుడు ఆ డబ్బంతా

నెత్తిన వేసుకుని వెళ్ళుతాడు కామాలు" అని కొందరూ, ఇట్లా ఎవరి నోటికి వచ్చినట్టు వాళ్ళు నిందించటమే గాని ఒక్కళ్ళయినా పాపం పాపయ్య మంచివాడు, చచ్చి పొయ్యాడని నోటివెంట వచ్చినవాళ్ళు లేరు.

దినవారాలన్నీ అయిపోయినవి. సుందరమ్మ ఇనప్పెట్టె తెరిచి లెఖ్ఖచూడగా ఆరోజువరకూ నిల్వవున్న రొఖ్ఖం ఏబయివేలూ, దస్తావేజుల మీదా ప్రామిసరీనోట్ల మీందా రావలసిన బాకీలు లక్షా, భూములూ, ఇళ్ళస్తిరాస్తి రెండులక్షల ఏబయివేలూ, నగకట్టు రోజువడ్డీలకు తాకట్టుపెట్టుకున్న బాపతు విడిచిపెట్టి వెళ్లినవిగాక ఆమె మెళ్ళోనగలుగానీ లక్షా, మొత్తం అయిదులక్షలకు కనిపించింది. తనభర్త డబ్బుగలవాడని తెలుసుగానీ ఇంతడబ్బున్నదని ఆమెకు ఎప్పుడూ తెలియదు. "అమ్మయ్యో! ఎందరి నోళ్ళుకొట్టి కూడబెట్టాడో ఈ సొమ్మంతా. చంద్రయ్యవంటి కుటుంబాలు ఎన్ని నాశనమయితే ఈ డబ్బంతా పోగయిందో. ఎందరు బీదవాళ్ల కంటినీటితో తడిసి ఈ ఆభరణాలన్నీ ఈపెట్టెలోకి వచ్చినయ్యో"అని ఆనగలను చేత్తోలాగింది. కిందపడి పాముల్లాగా జరజరా పారుకాడినవి. ఆమెకు భయం వేసింది. "ఎన్ని సంసారాలు నేలమట్టమైతే ఈ భూములన్నీ నూ కొచ్చినయ్యో! వాళ్ల ప్రాణాలు ఎంత అటమటించి పోయినయ్యో! వాళ్ల మనస్సులు ఎంత దుఃఖించి

సయ్యో! వాళ్ల ఉసురు ఎంతకొట్టిందో!" అని తీవ్ర వేదన పొందుతూ రూపాయిల సంచి ఒకటి పెట్టెలోకి త్రి పడవేసింది. ఆ ధ్వని బీదవాళ్ళ ఏడుపులాగా ఆమె చెవులకు సోకింది. ఆమె మనస్సు నీరై పోయింది. ఆ ఆలోచనలోనే మునిగి ప్రపంచం మీదికి ఆమె దృష్టిని ఒకసారిమళ్లించి చూచింది. కూడులేక మల మల మాడే పేదవాళ్ళూ, చేరెడు గుడ్డతో మానం కాపాడు కుంటూ వున్న స్త్రీ పురుషులూ, పండటానికి మంచం, ఉండటానికి కొంప, లేక చెట్టుకింద తలదాచు కుంటూ ఎండకు ఎండి వానకు తడుస్తూ వున్న పేదవాళ్ళూ, పొట్ట మూరెడు లోతున పీక్కుని పోయి ఎముకలు కనుపిస్తూ పొలంలో నాగలి దున్నుతూ వున్న బీదరైతులూ, పిల్లాది మొదలూ అస్తమానం చాకిరీ చేసినా పొట్ట జరక్క పస్తులూ, ఉపవాసాలూ చేస్తున్న కర్మకారులూ, ఆమె కళ్ళకు నిజస్వరూపాలతో కనిపించారు. ఆమె కళ్ల వెంట అప్రయత్నంగా నీళ్ళుకారి కాలువలు కట్టినవి. ఆ ఇనుప్పెట్టెనిండా క్రిక్కిరిసివున్న దస్తావేజులూ, నోట్లకట్టలూ, రూపాయిలసంచులూ, ఇవన్నీ తెల్లగా ఆ కష్టజీవుల ఎముకల పోగువలే ఆమెకు కనిపించినవి. మెరిసిపోతూ వున్న ఆ బంగారం కాంతులు పేదజనం ఆకటిజ్వాలల్లాగా ఉన్నవి. ఆభరణాల్లో ఉన్న ఎర్రరాళ్ళు బీదజనం కన్నెర్రచేసి, "మమ్మల్ని అన్యాయం చేసి పెట్టెలనిండా

ఇట్లా ధనాన్ని ఎక్కించుకోవడం మీకు న్యాయమేనా"
అని అడుగుతూ వున్నట్టు తోచింది. ఆమెలో ఒక గొప్ప
మార్పు కలిగింది. తీరని ఆందోళన బయలుదేరింది.
"ఛీఛీ బీదజనం చెమటవడిచి కష్టించిన డబ్బులోనుంచి
వాళ్లను అన్యాయంచేసి సంపాదించిన ఈ సొమ్ము నా
కెందుకు ?" అనుకుని ఇనప్పెట్టె తలుపు మూసింది. ఆ కిరు
మన్నశబ్దం ఆ దరిద్రుల మూలుగుల్లాగా ఆమె తల
కాయలో ప్రతిధ్వనించింది.

౧౦

వెంటనే చంద్రయ్య కుటుంబం ఆ గ్రామంలో ఎక్క
డున్నదో నని వెదక పంపింది సుందరమ్మ. ఆగ్రామంలో
లేరు. చుట్టు పట్లా వెదికించింది. ఎక్కడా కనిపించలేదు.
అత్తగారింట్లో ఉండ వచ్చునీ, ఉంటే పిలుచుక రమ్మనీ,
ఈతముక్కల మనుష్యులను పంపింది. వాళ్లు వెళ్లివచ్చి
అక్కడ వున్నారనీ,రమ్మనమని పిలిస్తే రామన్నారనీ సుంద
రమ్మకు చెప్పారు. సుందరమ్మ వాళ్లు అక్కడ వున్నందుకు
సంతోష పడి వెంటనే ఈత ముక్కల వెళ్లింది. వాళ్లు ఒక
గొడ్లచావట్లో కాలం గడుపుతూ వున్నారు. చంద్రయ్య
కుటుంబాన్ని, వాళ్ల స్థితి గతులనూ చూచి కంట నీళ్లు
పెట్టింది సుందరమ్మ. "మిమ్మల్ని మోసం చేసి ఆయన
ఏమి కట్టుక వెళ్లాడు? తగ్గ ఫలితం వెంటనే పొందాడు.

ఆయన పాపం పండి ఆ విధంగా పరిణమించింది" అని జరిగిన సంగతు లన్నీ చంద్రయ్యతో చెప్పింది.

చంద్రయ్య ఆమె రాకను చూచి మొదట ఆశ్చర్య పడ్డాడు. "ఆ గ్రామానికీ మాకూ ఋణం తీరి పోయింది. నేమిక రాము" అని సుందరమ్మతో అన్నాడు.

"నాయనా! నువ్వట్లా అన వద్దు. మీ ఇల్లు మీ కే ఉన్నది. వచ్చి మళ్లా ఎప్పటిలాగా దానిలో కాపురం వుండండి. ఇప్పటికీ అయిదులక్షల రూపాయిల ఆస్తి వున్నది. దాన్నంతా సద్వినియోగం చెయ్యాదలుచు కున్నాను." అన్నది సుందరమ్మ.

ఆ మాటలు విని ఆ త్యాగబుద్ధికి చంద్రయ్యా లక్ష్మీ చాలా వింత పడ్డారు. "ఏమివదిలివేసి వచ్చామో వచ్చాము. మళ్లీ ఆ యిల్లు మా కవసరం లేదు. పొట్టకు సరిపోను కష్టం చేసుకుని ఇట్లాగే ఎక్కడో పడివుండి వేళకు ఇంత తినగలం" అన్నాడు చంద్రయ్య.

"చంద్రయ్యా! నువ్వేమీ సందేహించవద్దు. ఆ డబ్బంతా మా సొమ్ము కాదు. ముమ్మాటికీ కాదు. అది మీ సొమ్మే, అంటే మీ పేదవాళ్ళ సొమ్మే. మిమ్మల్ని మోసం చేసి సంపాదించిందే. మీది మీ కిచ్చివెయ్యాడం లో మా గొప్పా, మీది మీరు తీసుకోవడంలో మీ తప్పూ, ఏమీలేదు. నాయనా! నన్ను అపార్థం చేసుకో

వద్దు. అంతా విచారించాను. అంతా పరచూచాను. బీద జనాన్ని చూస్తే నా మనసు నీరై పోయింది. నా కళ్ళవెంట నీళ్ళు కారినవి. మీది మీ కిచ్చి వెయ్యడమే నా కర్తవ్యం. మీరు బాగుపడడమే నా ముఖ్యోద్దేశం. తండ్రీ! నా జానెడు పొట్టకు అంత సొమ్మెందుకు? నా వుద్దేశం చెపుతా విను. ఆ అయిదులక్షల రూపాయలూ ఏ బీదవాళ్ళ దగ్గరనించి కూడపెట్టామో వాళ్ళకే మళ్ళీ పంచిపెట్ట దలుచుకున్నాను. అందులో మీకు కూడా వాటా వున్నది. ఆలస్యం చెయ్యకుండా నాతో బయలుదేర రాండి. మిమ్మల్ని చూస్తే నాకు ఎంత దుఃఖం వేస్తు న్నదో నా ముఖాన్ని బట్టి తెలుసుకో. ఆ పని చేసివేసిం దాకా నాకు నిద్ర పట్టదు. మీరు నాతో కదిలిరాందే నే నిక్కడ నించి కదలను. అంతవరకూ నిజం" అన్నది సుందరమ్మ చెమ్మగిల్లిన కళ్లతో.

ఆ మాటలకూ ఆమెలో కలిగిన గొప్ప మార్పుకూ చంద్రయ్య ఆనందించాడు. ఆమాటలు వింటూ వుంటే హృదయం పొంగిపోయింది అతనికి. ప్రతి అక్షరంలోనూ ఆమె బీద జనాన్ని గురించి పడుతూ వున్న మనోవ్యధను గుర్తించాడు. ఆమె ముఖంలో దీనజనరక్షణాన్వితమైన దయాప్రకాశాన్ని చూచాడు. ఆమె దివ్యమూర్తి లాగా కనిపించింది. అతడు అప్రయత్నంగా "తల్లీ!

ధన్యురాలవు ! నీ జీవితం ధన్యమయింది" అన్నాడు ఆనంద బాష్పాలు రాలుస్తూ.

చంద్రయ్యా లక్ష్మి ముసలమ్మతో సుందరమ్మ వెంట స్వగ్రామం చేరారు. వాళ్లను చూచి బాజారు జనమంతా సంతోషాన్ని వెల్లడి చేశారు. చంద్రయ్య పూర్వం ఇంట్లోనే కాపరం పెట్టాడు. సుందరమ్మ వాళ్ళు ఎప్పటిలాగా ఇంట్లో ప్రవేశించినందుకు చాలా సంతృప్తి పడ్డది. చంద్రియ్య కాపరం చేస్తూవున్న పూరికొంప తీసివేయించి వెంటనే డాబా కట్టించి యిచ్చింది సుందరమ్మ. అయిదు లక్షల ఆస్తికిగాను నోట్లూ, తాకట్టు పత్రాలూ, చెల్లు వ్రాసి ఎవరివి వారికి ఇచ్చివేసింది. ఇంకా మిగిలివున్న నాలుగులక్షలకూ పదివేలు మారుకూతురికి వ్రాసింది. తాను పదివేలు వుంచుకున్నది. చంద్రియ్యకు పదివేల రూపాయిలు సగదు ఇచ్చింది. తతిమ్మా ఆస్తి మూడు లక్షల డెబ్బయివేలూ భూములూ పుటారి అమ్మ కొంత చేసి ఫిర్కా మొత్తానికి వున్న బీద కుటుంబాలకు పంచిపెట్టి వేసింది. ఆమె ఔదార్యాన్ని పొగుడుతూ అన్ని పత్రికలూ సంపాదకీయాలను వ్రాసినవి.

సుందరమ్మ పదివేలపై వచ్చే ఆదాయం ప్రతి ఏటా బీదలకు అన్నదానం వస్త్రదానాది సత్కారాలను చేస్తూ, చంద్రియ్య దంపతులను చూచి తృప్తిపడుతూ, కాలం గడుపుతూ వున్నది. సుందరమ్మ వంట చేసుకుని

రెండు మెతుకులు నోట్లో వేసుకుని చంద్రయ్య ఇంట్లోనే వుంటుంది. ఆమెకు మధ్యాహ్నంనుంచీ చీకటిపడేవరకూ ఊపిరిపీల్చేందుకయినా తీరుబడివుండదు. లక్ష్మికితలకాయ దువ్వి జడవెయ్యడం, వెంట్రుకలు నొక్కు నొక్కులుగా దిద్దడం, వింత వింతలుగా రోజు కో మాదిరిగా ఇవ్వాళ్ల కూర్చినట్టు రేపు కూర్చకుండా పూలు అమర్చడం, మాలలు గుచ్చి ఇవ్వడం, ఈ పనిలోనే మునిగి పోతూ వుంటుంది సుందరమ్మ. ఆరోజు ఏచీర ఏరవిక సుందరమ్మ నిర్ణయిస్తుందో అపిగాని లక్ష్మి ఆ రోజు కట్టుకోదు. ఈ పూలు పెట్టుకున్ననాడు ఈచీర, ఈ కోక కట్టుకున్ననాడు ఈ రవిక అని ముందుగానే నిర్ణయించి వుంచుతుంది సుందరమ్మ.

# పుత్రసంతానం

## ౧

సీతమ్మ నాలుగోసారి గర్భం దాల్చింది. ఇదివరకు పుట్టిన ముగ్గురుబిడ్డలూ ఆడపిల్లలు అవడంచేత, ఈ దఫా కూడా ఆడపిల్ల పుడుతుందేమోనని అప్పుడెప్పుడూ చాలా చింతిస్తూ వుంటుంది. అంతా ఆడపిల్ల లవడంచేత మగ పిల్లలంటె పంచప్రాణాలు వదులుతుంది. మగపిల్లవాడిని ఎత్తుకున్న స్త్రీనిచూస్తే ఆబిడ్డను చంకన వేసుకుని ముద్దులతో నలిపివేస్తూ, ఆ పిల్లవాడి తల్లి అడిగిందాకా తిరిగి బిడ్డను ఇచ్చేదికాదు. "ఏమమ్మా! నీకు మగపిల్లలు లేరా ఏమిటి అని ఆమె అంటె ఇంత ముఖం చేసుకుని సీతమ్మ "నాబోటి మొఖాలకే నమ్మా మగబిడ్డలు పుట్టేది" అనేది. టోపీ, లాగూ, మేజోళ్ళూ, బూట్లూ, తొడుక్కుని వాళ్ళ వాకిటి ముందుగా వీధినే పోతూవున్న చిన్న మగపిల్లలను చూస్తే ఆమె బయటికివచ్చి, వాళ్ళు ఎంతో దూరం పోయిందాకా తనివి దీరా చూచి, "ఆ పాడు దేముడు కొండ మిరపకాయంత వేసి ఒక మగ నలుసును నా కివ్వరాదూ, దొరటోపీ మొదలైన వాటితో అట్లాగే అలంకరించుకుని చంకన వేసుకుని,

నా జన్మ సార్థకం చేసుకుందునే!" అనుకునేది. అంతటి భాగ్యం ఎప్పుడు కలుగుతుందా అని తపించి పొయ్యేది. ఈ సారి అయినా మగబిడ్డను దయచేయమని ఎందరో దేముళ్ళకు మొక్కుకున్నది. పిల్లవాడిని కొండకు నడిపించి తల నీలాలు తీయించి పిడికెడు రూకలూ పిల్లవాడి దగ్గరవున్న సొమ్మూ యావత్తూ నిలువుదోపు ఇస్తానని ఏడుకొండలవాడికి ముడుపు కట్టింది.

కాషాయగుడ్డలు కట్టుకున్నవా డెవడైనాసరే వాకిటి ముందుకు బిచ్చానికి వచ్చాడంటే అతన్ని సగౌరవంగా లోనికి పిలిచి "చెయ్యి చూడ్డం తమకు తెలుసునా?" అని ప్రశ్నిస్తుంది. వాడు ఆమెవల్ల ఏదో లాభం పొందవచ్చని చేటంత మొఖంచేసుకుని "తెలియకేమి తల్లీ" అంటాడు. "నాకు మగసంతానం ఏమైనా వున్నదేమో చూచి చెప్పండి"అని ఆమె చెయ్యి యిస్తుంది. వాడు మగసంతానం వున్నదని చెపితే చాలు కడుపునిండా భోజనం పెట్టి వత్రి, దక్షిణ, సమర్పించి ఆ రోజల్లా ఎంతో సంతోషంగా వుంటుంది. "నీకు మగసంతానం లేదమ్మా" అని ఎవడైనా ఖర్మం చాలక నోరు జారాడా అంటే వాడి మొఖాన కాసిని గింజలయినా వెయ్యకుండా ఆ రోజల్లా చింతతో అన్నం తినేదికాదు.

ఆమె భర్తనరసింహం ఇష్టాగోష్టిలో "ఈసారిఅయినా

కొంచెం ముందుగా జాగ్రత్త పడు. చెప్పలే దనుకునేవు సీతా" అన్నాడు.

"చాల్లేండి! మీ వేళాకోళాలు. మన యిష్ట ప్రకారమే జరిగే టట్టయితే మనల్ని పట్టేటందుకు పగ్గాలుంటాయాండీ!" అన్నది సీత.

"ఏమో ముందుగానే చెప్పాను. తరవాత నీ యిష్టం" అన్నాడు భర్త.

నవమాసాలూ నిండినవి. ఒక రోజున సీతమ్మ ప్రసవించింది. మళ్లీ ఎప్పటి మామూలుగానే ఆడ శిశువు కలిగింది. ఆమె చింతకు మేరలేదు. మేరుపర్వతం మీదినుంచి ఒక్కమారుగా కిందికి దొర్లి నట్టయింది. ఈ సారి అయినా మగపిల్లవాడు కలుగుతా డని ఆసించుకుని వుంటే ఆమె ఆశ వృధా అయింది. "ఎంతో మంది దేముళ్ళకు మొక్కు కున్నాను. దేముళ్లూ లేరు. దయ్యాలూ లేరు. అంతా వట్టి తిండిపోతు రాయుళ్ళు" అని విసుక్కున్నది. "మగపిల్లలు పూర్వ జన్మంలో ఎంతో పుణ్యం చేసుకుంటేనే గాని పుట్టరు. అందరాని పండ్లకు ఆసించడమేగాని నాబోటి పాపాత్మురాలికి ఎందుకు పుడతారు. మా ఆడబిడ్డకు చూడు! నలుగురూ వరసనా మగపిల్లలే. ఆమెదే భాగ్యం. మగపిల్లలను కన్నాననే గర్వం ఆమె ప్రతి మాటలోనూ ఆ నడక

లోనూ ఆచేతులు తిప్పడంలోనూ ఎప్పుడూ కసబరుస్తూ వుంటుంది. ఆమె ఎలాచేసినా ఆమెకు చెల్లుతుంది. చెల్లకేమి? రత్నాలవంటి మగబిడ్డలు! వాళ్లను చూస్తేనే ఎటువంటి తల్లికైనా గర్వం పుట్టుకు చక్కావస్తుంది. ఎందుకు పుట్టదు? వాళ్ళు పెద్దవాళ్ళయ్యాక కట్నాలద్వారా బోలెడు సొమ్ము గనస్తుంది. కోడళ్ళువచ్చి కాస్తన్నా పని చెయ్యానివ్వకుండా సుఖపెడతారు. వాళ్ళుమళ్ళీ చక్కనిబిడ్డలను కంటారు. ఒకచోట కూర్చునివాళ్ళందరినీ ఏపనీ చెయ్యకుండా సంతోషంతో ఎత్తుకుని ఆడించవచ్చు. మగపిల్లలను కన్నవాళ్లదే జన్మకాని నాబోటి దరిద్రురాలి దేమిజన్మ? ఇటువంటిది ఈ భూమ్మీద పుట్టడమే తప్పు." అని తనలో అనుకుంటూ మగపిల్లలను గన్నతల్లులను స్త్రీజాతిలో అదొక ఉత్తమమైన జాతిగా నిశ్చయించి వాళ్లకు తన హృదయంలో గౌరవమైన స్థానాన్ని యిచ్చింది.

ఆమె ఆడపిల్లను కన్నందుకు భర్త అయిదారు రోజులు ఆమెతో సరిగా మాట్లాడలేదు.

"సరస పెట్టావు! నీ యిష్టం వచ్చినట్టు కానివ్వు! నువ్వు ఏ పాలఘాటులోనో పుట్టితే నీ బొజ్జ వరహాల బొజ్జని నీ మగడు ఎంత సంతోషించేవాడో" అన్నాడు నరసింహం.

"కానివ్వండి! ఇప్పుడు పిల్లని మాత్రం చెట్టున కోసుకువచ్చామా? పెద్దవాళ్ళను చేసి ఒక అయ్య

చేతుల్లో పెడితే వాళ్లదోవన వాళ్లే పోతారు." అని తన దైన్యాన్ని పైకి కనబడకుండా అన్నది సీతమ్మ.

ఇక తనకు మగ సంతానం కలగదని సీతమ్మ నిరాశ చెంది పోయింది. భర్త ఎప్పుడైనా కోప పడ్డప్పుడు "నాకే మగపిల్లలు వుంటే మీ రిట్లా అంటారా" అని గుడ్ల నీళ్లు గుడ్ల కుక్కుకునేది. ఎవరైనా తన బంధువులలో తన్ను కాస్త బిగ్గరగా మాట్లాడితే తనకు మగపిల్లలు లేని కొరతవల్ల అట్లా అంటున్నారని ఎంచి "మగపిల్లలను గన్నవాళ్ళ గౌరవం రమ్మంటే నా కెలా వస్తుంది" అని చెప్పరానిబాధ పడేది. నలుగురు ఆడవాళ్లు కూర్చున్నచోటికి పోవడానికి తా నేదో అప రాధం చేసినట్టు సిగ్గుపడేది.

ఒకనాడు బిచ్చపుది ఒక తెల్ల చేరెడు గుడ్డమాత్రం మొలకు చుట్టుకుని, చంక నొక బిడ్డను ఎత్తుకుని వాళ్ల వాకిట్లోకి వచ్చి, "అమ్మా! బాలెంతను, ముష్టి వెయ్యండి" అని అడిగింది. సీతమ్మ చూచి "ఏమి పిల్ల" అన్నది. "మగపిల్లోడుండి, అమ్మగారు" అన్నది ఆ బిచ్చపుది. ఆశ్చర్యంతో ముక్కుమీద వేలువేసుకుని "ఓసీ! నీ అదృష్టమేమే మగపిల్లవాడా!" అని "ఆ పాడు దేముడు కూడులేక అడుక్కుతినే దానికి వెయ్యకపోతే అస్తమానం పలవరించేదానికి నాకు వేస్తే వాడి సొమ్మంతా ఏం మునిగిపోతుందో" అని అనుకుని, సీతమ్మ దాన్ని లోనికి

వస్సున్ననిపిలిచి, పిల్లవాని మాడుకు కాస్త ఆముదం వేసి సాకచొక్కా పిల్లవాడికి తొడిగించి కొత్తకారు వదలని చీర ఒకటి దానికి కట్టబెట్టి, ఇంతఅన్నం, ఇంతకూరా వేసి కడుపునిండా భోజనం పెట్టి పెండ్లికూతురిలాగా సాగ నంపింది. అది పట్టరాని సంతోషంతో అమ్మగారూ! మీరు చాలా దయగలవారండీ అని కృతజ్ఞతా వాక్యా లతో వెళ్ళిపోయింది

౨

నరసింహం తెలుగు మాత్రం బాగా చదువుకున్నాడు. వారిది అల్యూమినియం వ్యాపారం. బజారులో పెద్దకొట్టు వున్నది. చిల్లరగా, టోకుగా కూడా అమ్ముతూ వుంటారు. అన్నదమ్ములలో పంచుకున్న యాభై వేల రూపాయల ...సి పదిహేను వేలరూపాయిల నగదున్నూ, ఈయన హయాములో పాతిక వేల కిమ్మతు చేసే స్థిరాస్తి, ఇంకా కొంతడబ్బునూ అభివృద్ధి చేశాడు. వడ్డీవ్యాపారం కూడా కొద్దిగా వున్నది. వారి పెద్దమ్మాయి శాంత తొమ్మిది సంవత్సరాలది. రెండోపిల్ల పద్మిని, మూడోపిల్ల రత్నం, ఇప్పుడు పుట్టినపిల్ల హేమలత. రెండోపిల్ల వయస్సు ఏడు సంవత్సరాలు, మూడోపిల్ల వయస్సు నాలుగు సంవత్స రాలు. పెద్దపిల్లలిద్దరూ బళ్ళోకి పోయి చదువుకుంటూ

వున్నారు. వాళ్ళు ప్రతి సంవత్సరం క్లాసు తప్పకుండా పరీక్ష అవడం చూచి తండ్రి ఆడముండలకు ఇంత తెలివి తేటలు ఎక్కడనుంచి వచ్చినవి అంటూ వుంటాడు. రెండోపిల్ల చక్కగా సినిమా పాటలూ అవీ పాడుతుంది. మంచి గాత్రం.

భార్యకు మగపిల్లలంటే ఎంతప్రేమో భర్తకుకూడా అంతప్రేమ వున్నది, గాని మగవాడనడంచేత ఆడవాళ్ళలాగా ఈ విషయంలో పైకి పొంగడు. చిన్నపిల్ల హేమలతకు సంవత్సరం దాటింది, తప్పటడుగులు వేస్తున్నది. ఒకనాడు నరసింహం కోర్టువద్దకు వెళ్ళడానికి ప్రయాణం అవుతూ వున్నాడు. చంటిపిల్ల "నాన్న, నాన్న" అంటూ కాళ్లకు చుట్టవేసుకున్నది. ఆయనపని తొందరవల్లనో ఎత్తుకోడానికి ఇష్టంలేకనో ఏమోగానీ, ఎత్తుకోలేదు. పిల్ల ఏడ్వడం మొదలు పెట్టింది.

తల్లిచూచి "కాస్త ఎత్తుకుందురూ! కాళ్లకు చుట్టుకొని అదలా అరచకాడుతూ వుంటే" అన్నది.

"ఇప్పు డెక్కడ ? కోర్టువద్దకు పోవద్దూ" అన్నాడు నరసింహం.

"అబ్బ! ఇంతలోకే ఏమి వందలు సంపాదిస్తారు ! పాపం బిడ్డ అలా గిలగిలా తన్నుకుంటూవుంటే చూస్తూ వూరుకుంటారు! పిల్లల తరవాతనే సంపాదన. మనం

సంపాదించేదంతా ఎవరికోసం! పిల్లలకోసమే గదూ! ఈ యిళ్లు వాకిళ్లూ, ఈ భాగ్యభోగ్యాలూ, ఈ ధన ధాన్యాలూ, అన్నీ వాళ్ళకోసమేగదూ! పొరిగింటి పరిస్థితి చూడండి! భార్యను కూర్చోబెట్టి వ్యాపారా న్నన్నా మానుకుని పిల్లలను ఎలా ఆడిస్తాడో” అన్నది సీతమ్మ భర్తకళ్ళల్లోకి చూస్తూ.

“నువ్వుగూడా ఆయనభార్యలాగే మగపిల్లలను కనక పొయ్యావూ! నేను గూడా అలాగే ఆడించే వాడిని” అన్నాడు కాళ్లకు చుట్టుకున్న పిల్లను నెట్టి ఒక అడుగు ముందుకు వేసి నరసింహాం.

“అయ్యో అంతమాత్రం తెలివా ఈ మొఖానికి” అన్నది సీతమ్మ.

“పోనీ, ఆమె నడిగి తెలుసుకోలేక పొయ్యావూ? ఇప్పటికైనా మించి పోయిం దేమున్నది” అంటూ నడిచి పొయ్యాడు నరసింహాం.

“ఇటువంటి మాటలకు మాత్రం వున్నారు” అంటూ పిల్లను చంకన వేసుకుని సముదాయించింది సీతమ్మ.

నరసింహాం కూతుళ్ళను అసలు ఎత్తుకోడు. ఎప్పుడైనా వాళ్ళు దగ్గిరికివస్తే కసురుకుంటాడు. భార్యా బలవంతం మీద ఏ సంవత్సరానికో ఒక తడవ ఎత్తుకున్నాడా అంటే శమ కేదో ఇంద్రపదవి లభించినట్టు వాళ్ళుసంతోషంతో

పొంగి పోతారు. దగ్గిరికి పోతే ఎత్తుకోకుండా వున్నాడా అంటే వాళ్ళు ఆసించిన ఏదో గొప్ప పదవిని కోల్పోయి నట్లు ఆ లేతహృదయాలు తపించి పోతవి. ఎంత ఏడ్చినా, ఎంత కిందబడి తన్నుకున్నా, ఆయన దగ్గిరికి తియ్యడు. ఆఖరుకు తల్లి వచ్చి సముదాయించవలసిందే.

ఒకనాడు నరసింహం అప్పుడే కొట్టువద్దనుంచి ఇంటికి వచ్చాడు. "ఏమండీ! పద్మిని రెండు రోజులనుంచీ మూసినకన్ను తెరవకుండా పడి వున్నది. వంటిమీద గింజ వేస్తే పేలగింజలాగా వేగిపోతూ వున్నది! కూడూ నీళ్లూ లేవు. ఎవరినన్నా పిలిపించి చెయ్యి చూపించి రెండు మాత్రిలు ఇప్పించండి" అన్నది సీతమ్మ.

"దాని కెందుకే మాత్రిలు ? దండగచేటు! అట్లా చూస్తూ వుండు. మూడోనాటికల్లా లేచి కూర్చుంటుంది. ఆడముండకూ, నాగజముడుకూ చా వెక్కడిది ? నువ్వు అన్నం పెట్టకుండా వుండు, నీళ్ళు పొయ్యగాకు, ఎక్కడన్నా పారవెయ్యి, పరవా లేదు. జీవం పోసుకుంటుంది. ఏట్లో పారవెయ్యి, ఎదురు తిరిగి వస్తుంది!" అన్నాడు నరసింహం.

"మంచివాళ్ళండీ మీరు! పాపం అ దట్లా బాధ పడుతూ వుంటే జాలైనా లేకుండా అట్లా మాట్లాడ తారు" అన్నది సీతమ్మ. తర్వాత రెండు రోజులకు పిల్లకు జ్వరం దానంతట అదే తగ్గింది.

వ్య త్యా సా లు

పిల్లకు రెండో ఏడు దాటే వరకల్లా సీతమ్మ మళ్లా గర్భం దాల్చింది. ఈ దఫా ఏ దేముడికీగానీ మొక్కుకో లేదు. ఆమె పుత్రవాంఛ చివికి జీర్ణమై విసుగు గలిగించటం చేత ఈ సారి ఏ ఆశా పెట్టుకో లేదు. నవమాసాలూ నిండిన వెనుక సీతమ్మ ఒకరోజున మగశిశువును కన్నది. శుభవార్త మంత్రసానివల్ల వినగానే సీతమ్మ ముఖం పున్నమనాటి చంద్రునివలె వికసించింది. తన అదృష్ట రేఖ కళ్లముందు మెరుపువలె తళుక్కున మెరసినట్ట యింది. ఏదో ఎప్పుడూ లేని నూతనశక్తి ఆమెలో ఏర్పడినట్టు కనుపించింది. తనజన్మ సార్థక మయిం దని సంతోషించింది. తన నోములపంట ఫలించిం దని అను కున్నది. తనబహుకాల వాంఛితము నెరవేరినందుకు భగవంతునికి అనేక నమస్కారాలు చేసింది.

ఈ శుభవార్త కొట్టువద్ద వున్న నరసింహాం విన్నాడు. పేదకు పెన్నిధి లభించినట్టు ఉబ్బి గంతులు వేశాడు. లెఖ్ఖ పెడుతూ వున్న రూపాయలు అక్కడ పారవేసి అమితోత్సాహంతో రెండుమళ్ళ పంచదార కూలివాని చేత ఇంటికి పట్టించుకుని వెళ్ళి అందరికీ పుత్రోత్సాహం పంచి పెట్టాడు. ఆయన్ను చూచి ముత్తయిదులు "అంతా నీ అచ్చే నాయనా నీ కొడుకు" అన్నారు. "ఏదో లేండమ్మా! ఈ నాటికి కాస్తంత నలుసును వేశాడు భగవంతుడు మీ చలవవల్ల! బిచ్చపువాడై బతికి

నివ్వండి" అని చిరునవ్వుతో అన్నాడు నరసింహాం. "మరేమీ పరవా లేదు. నూరేళ్ళూ సుఖంగా వర్ధిల్లు తాడు నీ కొడుకు" అని ఒక శతవృద్ధురాలు పట్టుకున్న కర్రను వణికిస్తూ అన్నది. "మీ పెద్దవాళ్ల దయ ఉండాలి అవ్వా!" అని ఆమెకు దోసెడు పంచదార మళ్లా పెట్టాడు నరసింహాం. మంత్రసాని శిశువుకు నీళ్లు పోస్తూ వుండగా నరసింహాం చూచి మురిసిపొయ్యాడు. ఆ తెల్ల వారి నరసింహాం భార్య వున్న గదిలోకి వెళ్లి, "వళ్లు తేలి కగా వున్నదా" అని ప్రశ్నించి మంచిచెడ్డలు తెలుసు కుని, "మగపిల్లవాడిని కన్నాననే గర్వంచేత నాతో ఇక సరీగా మాట్లాడవు కామాలు" అని నవ్వుతూ అన్నాడు. "మీ ఎగతాళి చాల్లెండి! అబ్బాయిని చూడండి" అని చేతుల మీదకు శిశువును తీసుకుని వెలుతురులో భర్తకు చూపించింది సీత. "చూడు, నువ్వు అంతగా శ్రమ పడ్డందుకు నీ శ్రమ వృధాగా పోనివ్వనులే సుమా. ఇరవై వెసవర్లకు తక్కువ లేకుండా చంద్రహారం ఒకటి చేయించి యిస్తాను సరేనా" అని భార్య ముఖంవంక నవ్వుతూ వున్న కళ్ళతో చూస్తూ అన్నాడు నరసింహాం. సీతమ్మ ఆ శుష్కించిన ముఖంలో నుంచి వెన్నెలను తిరస్క రించే లేత నవ్వు నవ్వింది.

లేక లేక మగశిశువు కలిగినందుకు వాళ్ళ కొక బంగారుకొండ వరిగిన ట్లుండడంచేత నరసింహాం కొట్టు

వద్దకు సరీగా పోకుండా పిల్లవాని మంచం దగ్గరే కాలం గడుపుతూ వున్నాడు. ఆడపిల్ల లంటే ఇదివరకే వెగటు వేసింది. ఈ కుర్రవాడు పుట్టడంతోనే వాళ్ల ఆలనా పాలనా లేకుండా, రాత్రిం బగళ్ళూ తల్లి దండ్రు లిద్దరూ కుర్రవానితోనే కాలం గడుపుతూ వున్నారు. కుర్రవాడికి మూడో నెల వచ్చింది. వంటినిండా బంగారపు తొడుపు దిగవేసి నట్టు మెడలో గొలుసు, చేతులకు రెండు వరసలు, మొళ్ళో మామిడి పిం దెల మొలతాడు—వీటితో కుర్రవాడిని అప్పుడే అలంక రించారు. కుర్రవాడు "ఊ ఆ" అంటూ వుంటే, తల్లి దండ్రు లిద్దరూ వాడు సర్వశాస్త్రాలూ వల్లె వేస్తున్నట్టు ఉబ్బిపొయ్యేవాళ్ళు. ఇది అయిదోకాన్పు అవడంచేత కుర్ర వాడు దృఢంగా లేక, ఎప్పుడూ పాలు కక్కుతూ వుండ డం, కాసినిపాలు ఎక్కువతాగితే జీర్ణించుకోలేక కడుపు వుబ్బడం, ఇట్లా జరుగుతూ వుండడంచేత వైద్యుణ్ణి పెట్టి మం దిప్పించటం వల్ల కటికికారంతో పస్తులు చేస్తూ తల్లి చిక్కి శల్యమయి పోయింది. "ఏమేవ్, అపథ్యం చేసేవు సుమా! జాగ్రత్తగా నడుచుకో! అందులో మగపిల వాడు" అన్నాడు నరసింహం. "నాకు తెలియదాండి, నా బంగారు తండ్రి కోసం ఎటువంటి కష్టమైనా పడ తాను" అన్నది సీతమ్మ. మూడో మాసంలోనే నామ కరణం చెయ్యాలని ఏ పేరుపెట్టేది తర్కించారు.

"మా తండ్రి పేరు పెడదాము" అన్నాడు నరసింహాం.

"అబ్బే! ఆ పాతపేరు ఏం బాగుంటుం దండీ! ఏదయినా క్రొత్తపేరు చూచి పెడదాము" అన్నది సీత.

"ఏ పేరు పెడదాం చెప్పు?" అన్నాడు భర్త.

"మీ రే ఆలోచించండి. ఆడదానికీ నాకేమి మంచి పేర్లు తెలుస్తవి" అన్నది భార్య.

"మోహనుడని పెడదామా?" అన్నాడు భర్త.

"అది ఏ మంత మంచిపేరు?" అన్నది భార్య.

"ప్రభాకరరావు అని పెడదామా?" అన్నాడు భర్త.

"మా అక్క కొడుకు పేరు అదే. పాతపేర్లు వద్దనిముందే చెప్పాను కాదూ" అన్నది భార్య.

"హృషీకేశు డని పెడదామా మరి?" అన్నాడు భర్త.

"ఆ పేరు ఎవరికి నోరు తిరుగుతుంది?" అన్నది భార్య.

"సరే నీకు నచ్చిన పేరు చెప్పడం నావల్ల కాదు" అన్నాడు భర్త.

"ఇంకా నాలుగు పేర్లు చెప్పండి. అందులో నాకు నచ్చింది చెపుతాను" అన్నది భార్య.

"సరే నీకు నచ్చిన పేరుకు ముందు నేను చెప్పడం ఎందుకు? నీ యిష్టమే గాని నా యిష్టం లేదన్నమాట! కష్టపడి కన్నందుకు అంతబాధ్యత చూపక పోతే ఎలాగు మరి" అన్నాడు చలోక్తిగా భర్త.

## వ్యత్యాసాలు

సీతమ్మ నవ్వి "అది కాదండీ, పేర్లు పెట్టడం మీ మగవాళ్లకు సరిగా తెలియదండీ, అందువల్ల చెప్పమం టున్నాను" అన్నది.

"కరుణపాణి, సుగుణసాగరుడు," అని భర్త చెపుతూ వుండగా భార్య అడ్డు వచ్చి "ఆ పేరు బాగున్న దండీ. అబ్బాయికి సుగుణసాగరు డని పెడదాము" అన్నది సీత వికసించిన ముఖంతో.

"నేను చెప్పిన పేర్లలో నాకు ఏదైనా ఇష్టమేగా! రాణీ గారి ఇష్టమేగా ఇప్పుడు కావలసింది? సరే, ఆ పేరే పెడదాం" అన్నాడు భర్త.

ఒకనాడు నరసింహం భోజనం చేస్తూ వున్నాడు. భార్యా వడ్డనపనిలో వున్నది. కుర్రవాడు ఏడుస్తూ వున్నాడు. అప్పుడు మూడో పిల్ల రత్నం ఏడ్చేకుర్రవాడిని చంకన వేసుకుని నత్తి మాటలతో "అమ్మోయ్ అబ్బాయి ఏలుత్తున్నాలు" అంటూ తండ్రికి వడ్డన చేస్తున్న తల్లి వద్దకు తీసుకు వచ్చింది. తల్లి చూచి తత్తరపాటుతో "అయ్యో! అయ్యో! కిందపడవేస్తే ఇంకేమున్నది! పసి గుడ్డుగదా. వాడి పాణానికి ఏమాత్రం చిన్న దెబ్బ అయినా చాలదూ! వాడిని ఎత్తుకునే మాత్రపు ముండ వటే నువ్వూ!" అని పళ్లు కొరుక్కుంటూ చేతిలో వున్న గరిటతో నెత్తి అదిరిపొయ్యేటట్టు దెబ్బకొట్టి చంకలో బిడ్డను తీసుకున్నది.

ముద్ద కలిపి నోట్లో వేసుకోబోతూ వున్న నరసింహం అదిచూచి, చేతులో ముద్ద అట్లాగే విస్తరిలో వదిలివేసి కొంప మునిగిపోయినట్టు చరుగ్గనలేచి "ఓసీ ముండా! వాడి ప్రాణానికి నువ్వెక్కడ తయారయినావే! కుక్క తిన్నట్టు ఇంత తిని ఒకచోట పడి వుండక మొద్దుముండా! వాడిజోలికి పోవుగదా! పోవుగదా!" అని ఆ ఎంగిలి చేత్తో అయిదు వేళ్ళూ పొంగేటట్టు పిల్ల వీపుమీద ఒక్క చరుపు చరిచాడు. అప్పుడాపిల్ల తల్లీ దండ్రీ కొట్టిన దెబ్బలు భరించలేక పిడుగుపడ్డట్టు కెవ్వున కేక వేసి కిందబడి తన్నుకుంటూ ఏడవడం మొదలు పెట్టింది. అప్పుడు పెద్ద పిల్ల శాంత వచ్చి ఏడుస్తున్న రత్నాన్ని ఎత్తుకువెళ్ళి ఓదార్చేవరకు గంట పైగా పట్టింది. నరసింహం తృప్తిగా భోజనంచేసి బేవుమని తేపుకుంటూ భార్యావద్ద ఉన్న కుర్రవాడిని తీసుకుని "చూడు ఎలా నలిపి వేసిందో వెధవముండ! నాయన వొళ్లంతా కందింది" అన్నాడు. "కందడం గాదండీ! ఇందాక బాగాతోమి నీళ్ళు పోశాను. అలాగే వుంటుంది" అన్నది సీతమ్మ.

## 3

కుర్రవాడికి సంవత్సరం నిండింది. ఎన్నోరకాలదుస్తులూ టోపీలూ తెప్పించి, గంట కొకటి మారుస్తూ వాణ్ణి కింద

వ్యాఖ్యాసాలు

ఒకనాడు తండ్రి కారప్పూస పొట్లం తెచ్చి హేమకు కాసిని కాగితంలో పోసి యిచ్చి తతిమ్మా పొట్లం కుర్రి వాడికి ఇచ్చాడు. కుర్రివాడు అది చూచి మొత్తం నాకే కావా లంటూ చేతిలో పొట్లం కిందకు గిరవాటువేసి నేలమీద పడి తన్నుకోవడం ప్రారంభించాడు. అది చూచి హేమ తండ్రి అడక్కముందే "నాకు వద్దులే, నాన్నా, అబ్బాయికి ఇవ్వు" అని తనకు ఇచ్చిన గింజ లన్నీ తండ్రికి ఇచ్చింది. తండ్రి నేలమీద గింజలు ఏరి అవీ ఇవీ కలిపి కుర్రివాడి కిచ్చాడు. కుర్రి వాడు ఏడుపు మానివేశాడు. "చూడండీ వాడంటే దానికి యెంత ప్రేమో. అది తినే గింజలు కూడా వాడికి ఇచ్చివేసింది" అని ఇంట్లో ఏదో పని చేసుకుంటూ వున్న సీతమ్మ అన్నది. "రేపు వాళ్ళను సంరక్షించేది వీడే నని వాళ్ళకు మాత్రం తెలియదా ఏమిటి?" అన్నాడు నరసింహం.

రెండో ఏడు వచ్చింది. కుర్రివాడు బాగా నడుస్తూ వున్నాడు. ఒకరోజున వాళ్ళ వాకిటి ముందుగా మేళా లతో ఊరేగుతూ కొందరు కొన్ని మిఠాయి పళ్ళాలు పట్టుకుని వెళ్ళుతూ వుండగా వీధి అరుగుపైన తండ్రివళ్ళో కూర్చున్న సుగుణసాగరుడు చూచి అందులో ఒక పళ్ళెం వంక చెయ్యి చూపించి ఆ మిఠాయి తనకు కావా లన్నాడు. "నాయనా! మనం బజారికి పోయి కొనుక్కుం

దాం” అన్నాడు నరసింహం. ఆ మాట ఏమీ వినిపించుకోకుండా కిందబడి నేలంతా దొర్లి గింతలు పెడుతూ ఏడవడం ప్రారంభించాడు కుర్రవాడు. “ఏడవ వద్దు” అని జేబులో వున్న అర్ధరూపాయి తీసి కుర్రవాడి చేతులో పెట్టి ‘ఇప్పుడే కొనిపెడతాను ఏడవబోకు. మా తండ్రివి గదూ! మా అమ్మవుగదూ! ఊరుకో నాయనా!” అని బతిమలాడాడు నరసింహం. వాడు లెక్క చెయ్యక చేతులో పెట్టిన అర్ధరూపాయి విసురు పుచ్చుకుని పారవేసి కింద పొర్లాడుతూ పూర్వం కంటే అధికంగా ఏడుస్తున్నాడు. ఆ ఏడుపు చూచి నరసింహం గాభరా పడ్డాడు. దడ పుట్టుకు చక్కా వచ్చింది. వణికి పోయ్యాడు. వాడిని ఓదార్చే మార్గం ఏమీ కనుపించ లేదు. ఎత్తుకోబోతే చంకకు రావడం లేదు. ఎట్లాగో బలవంతాన చంకన వేసుకుని కొంత దూరం పోయిన ఆ మేళం వద్దకు వెళ్ళి సిగ్గు విడిచి “మా అబ్బాయి ఏడుస్తున్నాడు. ఏది యిచ్చినా ఊరుకోవడం లేదు. మీ దగ్గిరదే వాడికి కావాలట. కాస్త మిఠాయి పెట్టి వాడి ఏడుపు పోగొట్టండి” అని అడిగాడు నరసింహం.

ఒక పేరంటాలు వాడు చూపించిన పళ్ళెంలో మిఠాయి కాస్త తీసి పెట్టబోయింది. వాడది తీసుకోకుండా చేత్తో కొట్టివేసి పళ్లెం మిఠాయి మొత్తం కావాలన్నాడు. వాడెట్లయినా ఇక ఊరుకోడని ఎంచి

"అమ్మా! ఖరీదు ఇస్తాము గానీ ఆ పళ్లెం మొత్తం మాకివ్వాండి, ఎంత అయితే అంత ఇస్తాను. వీడిక ఊరుకునే టట్టు లేడు" అన్నాడు నరసింహం.

ఆ మాట అందులో ఒకాయన విని, "మంచి మర్యాద గానే వున్నది! కుర్రవాడు ఏడుస్తున్నాడుగదా అని కాస్త పెట్టవస్తే పళ్లెం మొత్తం ఖరీదుకు ఇవ్వమంటున్నావు! ఇది దుకాణం అనుకున్నావా ఏమిటి? పాపం, ఒక పళ్లెమే కోరావు! మీ అబ్బాయి మాయందు దయవుంచి మొత్తం పళ్ళాలు కోరుకో లేదు. కొంప ముంచి కోరుకున్నట్లయితే ఈ మొత్తం మీ ఇంట్లో పెట్టి మేము చేతులు ఝాడించుకుంటూ వెళ్లవలసి వచ్చేది. చాలుచాల్లే పద వయ్యా! కుర్రవాడికి భయం చెప్పడం చేత గాక మీరబెట్టుకుని ఇట్లా అడిగితే ఏమన్నా అనుకుంటా రనిగూడా అనుకోకుండా అడుగుతూ వున్నావు. వీపు చిట్లగొట్టితే అట్లా ఏడుస్తాడా? నే చూస్తూ వుండగా చురుకు ముట్టించు, ఎందుకు వూరుకోడో చూస్తాను" అని గుక్క తిరక్కుండా అనివేశాడు.

పాపం నరసింహం ఇంతముఖం చేసుకుని ఏడుస్తున్న కుర్రవాడితో కాళ్ళీడ్చుకుంటూ ఇల్లు చేరాడు.

కొన్నాళ్ళు గడచినవి. ఒకనాటి అర్ధరాత్రి తండ్రి పక్కలో పండుకున్న కుర్రవాడు ఎందుకో ఏడవడం ప్రారంభించాడు. అదివిని తల్లీదండ్రి లేచి సముదాయించ

పొయ్యారు. ఏడుప్పు మానలేదు. ఏమి కావాలి నాయనా అంటే చెప్పడు. పక్కమీద ఏదైనా కుట్టిం దేమో నని దీపం పెట్టి చూచారు. ఏమీ కనుపించలేదు. పిల్లవాడి ఏడుపు ఎక్కువ అవుతూ వున్నది. ఇన్ని రూపాయిలు తెచ్చి ముందు పోశారు. వాటిని కాళ్ళతో తన్ని వేశాడు. ఆటవస్తువు లన్నీ చూపించారు. కాదని తల కాయ తిప్పి వెర్రి ఏడ్పు ఏడవడం ప్రారంభించాడు. అది చూచి తల్లి భయంతో "అయ్యో ! కుర్రవాడు ఇంత ఏడ్పు ఎప్పుడూ ఏడవ లేదు. వళ్ళంతా చిరుచెమటలు పట్టుతూ వున్నది. అయినా అర్ధరాత్రి సమయంలో ఏడ వడం ఏమిటి ? మన ముద్దూ ముచ్చటా చూడలేక ఎవ్వరో ఏదో చేశారు" అని బావురు మని ఏడవడం ప్రారంభించింది. అంతకుముందే గుండె చెదిరిపోయిన నర సింహం కళ్లనీళ్ళు పెట్టుకున్నాడు. ఈ సందడికి ఇరుగు పొరుగువాళ్ళు నిద్ర మేలుకుని వీళ్ళింటికి వచ్చారు. అందరూ ఈ మాటా ఆమాటా మాట్లాడ్డంలో ఆరొందకు ఆ సందు జన మంతా ఆ అర్ధరాత్రిసమయంలో వీళ్లింటికి వచ్చారు. బాగుచేసే వాళ్లను పిలవం డని ఒకళ్ళూ, ప్రయోగం చేస్తే ఇట్లాగే ఏడుస్తా రని మరిఒకళ్ళూ, కడుపునొప్పేమో డాక్టరిని పిలవం డని ఇంకొకళ్ళూ, తలోమాటా అంటు న్నారు. ఇట్లావుండగా ఆ జనంలో నుంచి ఒకామెవచ్చి "మీరందరూ అరవగాకండి, నేను అడుగుతాను" అని

"అబ్బాయీ! ఇటు చూడు, మా సుగుణ మంచివాడు కాదూ చెప్పమ్మా చెప్పు! నీ కేంగావాలి? డబ్బులా, పకోడీలా, కారప్పూసా, చక్కెరాలా" అని ఇంకా ఏవేవో చెప్పబోతూ వుంటే కుర్రివాడు ఏడుపు మాని "నాకు చక్కెరాలు కావాలి" అన్నాడు. పోయినప్రాణం వచ్చినట్లు సంతోషించి తండ్రిఒక రూపాయి ఆ వచ్చిన జనంలో ఒకరి చేతిలో పెట్టి చక్కెరాలు తీసుకుని త్వరగా రమ్మని తరిమాడు. "ఒరి నా తండ్రీ! వెధవ చక్కెరాల కోసమే ఇందాకటినుంచి అట్లా ఏడుస్తున్నావటరా! ముందుగా చెప్పకపొయ్యావు నాయనా! ఇందాకనే తెప్పించేవాళ్ళము వళ్లంతా అలసిపోయింది నా తండ్రీ!" అన్నది సీతమ్మ.

ఇంతలోకే చక్కెరాలు తేబోయిన మనిషి కొట్లు వాళ్ళను లేపుకుని పాతిక చక్కెరాలు తీసుక వచ్చాడు. అవన్నీ కుర్రివాడి ముందు పోతురాజుకు కుంభం పోసినట్లు పోశారు. "నువ్వు మమ్మల్ని రక్షించావమ్మా? ఆ వుపాయం మాకు తెలియలేదు. ఏడుస్తుంటే ఎందుకు ఏడుస్తున్నాడా అని గాభరాలో మునిగి పొయ్యాము" అన్నాడు నరసింహం. తర్వాత ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపొయ్యారు.

కుర్రివాడికి మూడో ఏడు వచ్చింది. వాళ్ళ అక్కావాళ్ళ పుస్తకాలు చించడం, పలకలు పగల కొట్టడం, అడిగితే ఇవ్వకపోతే మీదపడి రక్కడం, ఇట్లా నానా

అల్లరి చేస్తున్నాడు. వాడు ఎలా చేసినా తల్లీ తండ్రీ ఏమీ అనరు. పాపం ఆ పిల్లలు గూడా స్త్రీ జాతికి సహజంగా పుట్టుకలోనుంచే శాంతగుణం ఓర్పూ కలిగి వుండడంచేత వాడు చేసిన దానికి ఏమీ తిరుగా చెయ్యరు. పైగా వాళ్లు తిరిగి కుర్రవాడిని ఏమీకూడా అనరు. చిన్న పిల్ల హేమ తల్లి పెట్టకపోయినా తాను పెట్టుకొని అయినా రోజుకు ముమ్మాటూ అన్నం తిని ఏలాటి జబ్బూ లేకుండా మంచి దృఢంగా ఆరోగ్యంగా వున్నది. కుర్రవాడు చిరుతిండికి అలవాటుపడి అన్నం తినే అలవాటు తప్పిపోయి నందున కతాజితు అన్నం తింటేజీర్ణించుకోలేక ఆరోగ్యం చెడి బక్కచిక్కివున్నాడు. తండ్రి "ఆడముండకు అంత జీర్ణశక్తీ, అంత ఆరోగ్యమూ దేముడు పెట్టకపోతే వీడికి పెట్టకూడదూ" అని అప్పు డప్పుడూ అంటూ వుంటాడు. కొట్టువద్ద నగదు పెట్టె వద్దకు కూతుళ్ళు ఎప్పుడైనా వెళ్ళి కూర్చుంటే తండ్రి వద్దని కసురుకుంటాడు. కుర్రవాడు అస్తమానం పెట్టె వద్దనే కూర్చుంటాడు. తండ్రి ఏమీ అనక వాడి భావి కాల వ్యాపారాభివృద్ధి మార్గానికి అది సూచనగా గ్రహించి తనలో తాను ముసి ముసి నవ్వులు నవ్వుకుని మురిసి పోతాడు. పెట్టె తెరచి రెండు గుప్పెళ్లనిండా ఎప్పుడూ చిల్లరగానీ రూపాయిలు గానీ తీసుకుంటాడు. ఎవరైనా కదిలించా రంటే చాలు రెండు గుప్పెళ్ళలో

డబ్బా గవ్వల్లాగా నెగజల్లి కిందబడి తన్నుకుంటాడు. ఊ అన్నా అపరాధమే, ఆ అన్నా అపరాధమే. అందు వల్ల తండ్రి వా డెట్లా చేసినా ఏమీ అనడు.

నరసింహం కొట్లోకి వచ్చినవాళ్లతో "మావా డివ్వాళ్ళ ఏంచేశా డనుకున్నారు? నేను ఎంత ఇవ్వమంటే అంత పెట్టె తెరిచి డబ్బులు ఇచ్చాడండోయ్. అప్పుడే బేడలూ, పావలాలూ గుర్తు పట్టాడు. ఏం తెలివి తేట లనుకున్నారు మావాడివి" అనీ "తల్లి అన్నంపెడుతుంటే అడిగినంత నెయ్యి వెయ్యలే దని దవడ కేసి బాదాడం డోయ్ తల్లిని. మావాడికి ఎంతకోపం అనుకున్నారు."ఆరో జట్లా చేశాడు. ఈ రో జిట్లా చేశాడు అని కొడుకు తెలివి తేటలను పొగుడుతూ ఎప్పుడూ అదే సోదిగా చెపుతూవుంటాడు.

ఒకరోజున అప్పుడే బ్యాంకినుంచి వచ్చిన అయిదు రూపాయిల నోట్లకట్ట లిప్పి తండ్రిలెక్కపెడుతూవున్నాడు. కుర్రవాడు అందులో రెండుకాగితాలు తీసుకునివెళ్లి దగ్గిరలో ఆడుకుంటూ వున్నాడు. తండ్రి అదిచూచి "ఆ కాగితాలతో ఆడుకుంటున్నాడు. తరవాతతీసుకోవచ్చులే" అని తనపనిమీద తాను వున్నాడు. పదినిమిషాలకు కుర్రవాడి ఏడుపు విని చేస్తున్న పని వదిలి నరసింహం కుర్రవాడి దగ్గిరికివెళ్ళాడు. ఒక అయిదురూపాయిలనోటు ముక్కలు ముక్కలుగా చించి వెదచల్లివున్నది. రెండో నోటు మడత పడి అందులో కొత్తకాగితం అవడంచేత, చినగ నందుకు

కుర్రవాడు ఏడుస్తూ వున్నాడు. నోటు చినిగిపోయినందుకు ఏమీ అనుకోక కుర్రవాడి అరచేతులు ఎర్రగా కందివుండడం చూచి తండ్రి నొచ్చుకుంటూ ముఖం చిట్లించుకుని "ఏం అంత పెళపెళలాడుతూ తాటాకుల్లాగా కాగితాలు తయారు చెయ్యకపోతే మెత్తగా మందం తగ్గించి చేస్తే వాళ్ళ సొమ్మేంపోతుంది? అంతా విపరీతం!" అని గొణుక్కుంటూ కుర్రవాణ్ణి ఎత్తుకున్నాడు.

## ౪

పెద్దపిల్ల రజస్వల అయి దాదాపు సంవత్సరం కావస్తున్నా తండ్రి పెండ్లిమాట ఇంకా తలపెట్టనందున సీతమ్మ భర్తతో ఒకనాడు ఇట్లా అన్నది. "ఏమండీ! పిల్ల పెండ్లి విషయం అంటే మాట్లాడరు. పెద్దమనిషి అయినందుకే తలవంపులుగా వున్నది. ఇంకా ఎంత కాలమని ఆపుతారు. ఇంత డబ్బు వుండీకూడా పిల్ల అట్లా ఈడేరి ఇంటపడి వుంటే చూస్తూ ఊరుకుంటారు! దాని శ్రద్ధ మీకు కాకపోతే మరి ఎవరికి? తోడిపిల్లలు అక్కరకూడా అయ్యి బిడ్డలను కూడా కంటున్నారు. వేళకు వచ్చి మాత్రం భోజనం చేసి పోతారు. ఇటువంటి సంగతులు మీకు ఏమీ పట్టవు. సంబంధాలుకూడా వస్తూవుండే! ఏదో మంచి సంబంధం చూచి ముడిపెట్టి

వెయ్యండి. వచ్చేది మాఘమాసం. పెండ్లిచేసే ఏర్పాటు చెయ్యండి”

ఆ మాటలకు నరసింహాం “దాని పెండ్లికి ఇప్పుడేమి తొందర వచ్చింది ? రజస్వల అయిన పిల్ల ఎంతకాలం వున్నా తప్పు లేదు. లోకమంతా ఆలాగే నడుస్తూ వున్నది. ఇప్పుడే చేద్దామా అంటే నాలుగువేలూ, అయిదువేలూ కట్నాలు అడుగుతూ వున్నారు. చూస్తూ చూస్తూ అంత డబ్బు ఎలా పారబోసేది? ఆడపిల్లలు పుట్టినందున వచ్చే చిక్కే ఇది. పైగా వాళ్లను అష్ట కష్టాలు పడి పెంచి పెద్దవాళ్లను చేసింది గాకుండా ఇదొక వృథా తగులు బాటు అన్నాడు.

“ఆడపిల్ల లంటే మీ కింత ఇది ఎందుకు ? ఆడపిల్లలు మాత్రం ఊరికే వచ్చారా? ఏ చెట్టుకిందన్నా రాలితే ఏరుకవచ్చామా? మగపిల్ల లయితే చూచేటట్టూ ఆడపిల్ల లయితే చూడ నట్టూనా? వాళ్లు తవ్వి తల కెత్తిం దేమిటి, వీళ్లు ఎత్తని దేమిటి? ఎక్కడో బైటపిల్లలను తీసుకుని వచ్చి పెంచి నట్లు మాట్లాడతారు! కడుపున పుట్టిన బిడ్డ లని గూడా కాస్తన్నా మీకు ఇది లేదు. డబ్బు ప్రధానంగా చూస్తారు గానీ, కన్నబిడ్డ లని అయినా చూడరు” అన్నది చురచుర చూస్తూ సీతమ్మ.

“సంపాదించ చేతగాక పోయినా డబ్బంటే నీకంత

తిరస్కారంగా వున్నది! ఒక కానీ సంపాదించి చూసే దానిలో ఎంత కష్టం ఉందో దాని విలువ నీ కప్పుడు తెలుస్తుంది. చేతులారా కష్టపడి సంపాదించినవాడికి చిల్ల పెంకుల్లాగా ఖర్చు పెట్టబోతే కష్టమే. నిజంగా మగ పిల్లవాడికీ ఆడపిల్లకూ సంబంధం ఎక్కడ? ఆడపిల్ల పుట్టిన దగ్గరనుంచీ చింతే. పైగా అత్త సరిగా చూడక పోయినా, మగడు ఏలకపోయినా, తిరిగి మళ్లీ పీక్ల నెత్తినే విరుచుకుని పడుతుంది. ఆడపిల్లను గురించి డబ్బు దండుగే గాకుండా బతికినంతకాలం అనేకచింతలు పడాలి. ఇక అల్లుడుగారు వున్నారంటే అత్తగారిని ఏలే వక ప్రభువు. ఆయన పండక్కూ పబ్బాలకూ విధించే పన్నులను సక్రమంగా చెల్లిస్తూ ఆయన ఏలుబడిలో దాసోహం అంటూ కిక్కురు మనకుండా నడుచుకోవాలి. లేక ఏలినవారి ఆజ్ఞను ఉల్లంఘిస్తే వారు విధిం చిన పన్నుకు ఇబ్బడిగా వసూలు చేసేదాకా వాళ్ల గడప తొక్కడు. ఆడపిల్లల్లో ఇటువంటివి అనేక చిక్కులు వున్నవి. ఇక మగపిల్లవాడు అంటే రాజా. వాడి పెండ్లికి నాలు గయిదు వేలు తిరిగి వస్తవి. పెద్ద వాడయిన దగ్గరనుంచీ సంపాదించి పోస్తాడు. కనుక్కు న్నందుకు తల్లిదండ్రులను సుఖ పెడతాడు. పిల్లలను గని వంశవృద్ధి చేస్తాడు" అన్నాడు నరసింహం.

"అట్లా అని పెండ్లి చెయ్యడమే అసలు మాని

వెయ్యండి. నాదేం పోయింది! ఇంట్లో వుండే ఆడదాన్ని నాకేమి? కీర్తి వచ్చినా మీకే, అపకీర్తి వచ్చినా మీకే. డబ్బు చేతులారా సంపాదించక పోతే ఆకాశంనుంచి ఊడి పడుతుందా? ఆడపిల్లలను కనుక్కున్న వాళ్లందరూ వాళ్లకు ఖర్చు పెట్టే డబ్బు చేతులారా సంపాదించింది కాదు కామాలు" అన్నది సీతమ్మ.

"వృధాగా మాట్లాడ వద్దు. నే నేమీ పెండ్లి చెయ్య ననడం లేదు. ఈ సంవత్సరం ఆగి తే రెండో పిల్ల కూడా అక్కరకు వస్తుంది, అప్పుడు ఇద్దరి పెండ్లిండ్లూ ఒకసారి చేస్తే ఖర్చుల్లో కొంత తగ్గుతుంది. అప్పటి కేవో చూచి కట్నాలు తక్కువగా వున్న సంబంధాలు చెయ్యవచ్చు" అన్నాడు నరసింహం.

కుర్రవాడికి అయిదో ఏడు వచ్చింది. కొంత డబ్బు ఖర్చుపెట్టి కారుమీద మేళతాళాలతో ఊరేగించి పంతులకు కట్నాలూ, కానుకలూ, యిచ్చి అక్షరా భ్యాసం చేయించారు.

సీతమ్మ మళ్ళా గర్భవతి అయి ఇంకొక మగశిశువును కన్నది. వాళ్ల సంతోషానికి మేర లేదు. "ఏ వరస పెడితే ఆ వరసే ఏమేవ్" అని నరసింహం భార్యతో సరస మాడాడు. మామూలుప్రకారం మూడో నెలన విద్యాసాగ రుడు అని నామకరణం చేశారు. నాలుగో పిల్ల హేమను

తల్లిదండ్రులు బడికి పంపించకపోయినా ఇరుగుపొరుగు పిల్లలతో కలిసి బడికి పోవడం మొదలు పెట్టింది. సుగుణ సాగరుణ్ణి బడికి పంపి సంవత్సరం దాటినా ఓనమాలైనా సరిగా రాలేదు. మొన్న మొన్న మొదలు పెట్టిన హేమకు అక్షరాలన్నీ వచ్చినవి. వెళ్ళమని అనకుండానే ఎంతో శ్రద్ధగా ప్రతినిత్యం బడికి పోతుంది. కుర్రవాడు అలా కాదు, బడికి పో నని మారాం చెయ్యడం, తండ్రి బుజ్జగించి పావలో అర్థో చేతులో పెట్టి రోజూ బడివద్దకు తాను తీసుక వెళ్లి వప్పగింత పెట్టి రావడం, ఇలా జరుగుతూ వున్నది.

సుగుణసాగరుడికి తొమ్మిదో ఏడు వచ్చింది. రెండో క్లాసులో ప్రవేశించాడు. హేమ నాలుగో క్లాసులో ప్రవేశించింది. సుగుణసాగరుడికి వయస్సు వచ్చిన కొద్దీ ఇంట్లో, గూళ్లల్లో, పెట్టిన చిల్లరా, కొట్టువద్ద పెట్టెలో డబ్బూ తరుగుపోతూ వచ్చింది. డబ్బు నరసింహం ఒక్కడే వాడడం చేత గుమాస్తాలు మొదలైన వాళ్ల మీద అనుమానపడే అవకాశం లేనందున, మొదట మొదట తనదే పొరపాటని సరి పెట్టుకుంటూ వచ్చాడు. కుర్రవాడు పొద్దున బడికిపోతే మధ్యాహ్నం ఇంటికి అన్నానికైనా రాకుండా ఒక్కొకనాడు రాత్రికి రావడం మొదలు పెట్టాడు. మధ్యాహ్నంఅన్నానికిరాలే దేమని తల్లిదండ్రులు అడిగితే నాకు ఆకలిగాలేక రాలేదనో, వాళ్ళ తాతగారి

ఇల్లు ఆ గ్రామమే అవడంచేత తాతగారింట్లో తిన్నా ననో ఏవో సాకులు చెప్పేవాడు. ఒకరోజున పంతులు కొట్లోకి వెళ్లి "ఏ మండీ నరసింహంగారూ! మీ అబ్బాయి నాలుగు రోజులనుంచీ బడికి రావడం లేదు. ఎందుచేత?" అని అడిగాడు. ఆ మాటకు ఆయన ఆశ్చర్యంతో "రాక పోవడం ఏమి టండీ! ప్రతిరోజూ పలకా, పుస్తకాల్నూ, తీసుకుని వస్తూనే ఉన్నాడు" అన్నాడు. "అసలే ఖండ పాకం. అందులో ఇది వకటా! అసలు రావడం లేదు. అ దేమిటో కనుక్కోండి" అని పంతులు వెళ్లిపోయ్యాడు.

తరవాత నరసింహం ఆరాలు తియ్యగా పలకా, పుస్తకాలూ, వాళ్ళతాతగారి ఇంట్లో పెడితే తల్లిదండ్రికి చెపుతా రని మరి ఒకళ్ళ ఇంట్లో పెట్టి ఈ సంగతి మావాళ్ళకు తెలియనివ్వవద్దని వాళ్ళను బతిమలాడుకుని వాడి ఇష్టం వచ్చినట్టు తిరుగుతూ వున్నట్టు తెలియవచ్చింది. కుర్రవాణ్ణి తల్లి "నీకు ఇదేమి బుద్ధిరా నాయనా! హాయిగా వేళకు ఇంత అన్నం తిని మంచి బట్టలు వేసుకుని రాజులాగా బడికి పోయి చదువుకోక ఇలా తిరగడ మేమిటిరా. నువ్వు అడిగినంత డబ్బూ మీ నాన్న ఇస్తూ వుండె. బంగారం లాగా బడికి పోయి చదువుకో వచ్చునే. మీ నాన్న కొడతారు. అలా ఎప్పుడూ చెయ్యకు నాయనా!" అని అనేకసార్లు బతిమలాడి కుర్రవాడికి చెప్పేది. చెప్పినప్పుడు విని తలకాయ వూపేవాడు. తల్లి దండ్రీ కోపపడ్డ ఏ రెండు

రోజులో బాగా బడికి పోతూ వేళకు ఇంటికి అన్నానికి వచ్చేవాడు. తరవాత మళ్ళీ మామూలే.

ఒకరోజున కొట్లో పదిరూపాయలు తరుగు పోయినవి. ఇట్లా ఎన్నోసార్లు ఇదివరకు తరుగు పోయినవి. ఇక ఆరా తియ్యకపోతే కొంప కూలుతుంది. ఇవ్వాళ్ళ పది అయినవి, రేపు నూరు అవుతవి. ఇక చూస్తూ వూరుకుంటే వీల్లేదు అని నరసింహం అనుకున్నాడు. ఆరోజు గడిచింది. ఆ తెల్లవారి కుర్రవాడు ఇంటికి రావడం మానివేసినందున అనుమానపడి కొట్లో గుమాస్తాను వెంట వేసుకుని ఊరంతా వెదకటం ప్రారంభించాడు. ఆయన చూడవలసిన చోట్లల్లా చూచాడు. ఎక్కడా కనుపించలేదు. విసుగు పుట్టింది. ఊరువెలపల వున్న సత్రాలూ, దేవాలయాలూ, కూడా చూచి మరీ పోదామని అక్కడికి వెళ్లాడు. సత్రాలు చూచారు. అక్కడా లేదు. దేవాలయంలోకి వెళ్లారు. అక్కడ నలుగురు కుర్రవాళ్లతో చీట్లాడుతూ వున్న కొడుకును కళ్లారా చూచాడు నరసింహం. ఆయనకు ఎక్కడలేని కోపం వచ్చింది. అందులో తిరిగి తిరిగీ విసుగుపుట్టి ఉన్నాడేమో వెంటనే అక్కడకు పోయి కుర్రవాణ్ణి ఒకబాదు బాది రెక్కపట్టుకుని "ఓరి దొంగవెధవా! నువ్వు బళ్లోకని వచ్చి ఈ పనా చేస్తున్నది? అయ్యో, ఈ యీడు కప్పుడే నీకు జూదమా? ఇన్నేళ్లు వచ్చినవి, నాకా చీట్ల

పేర్లయినా తెలియవు. నువ్విప్పుడే ఇంతవాడి వయ్యావా? ఇంటికిపద, నిన్నేం చేస్తానో" అని ఇంటికి తీసుక వచ్చాడు. తతిమ్మా ముగ్గురు కుర్రవాళ్లూ చీట్లక్కడ పారవేసి పరిగెత్తి పొయ్యారు.

సుగుణసాగరుడి జేబు తండిరి చూచేసరికి నాలుగు రూపాయల చిల్లర వున్నది. ఆయన అనుమానం స్థిరపడి "ఈ పైకం నీ కెక్కడిది" అని అడిగాడు. వాడు తలవంచుకుని ఏమీ చెప్పలేదు. "నిజం చెప్పు. కొట్లో పదిరూపాయలు ఎత్తుక వెళ్ళింది నిజమేనా?" అని దండించి అడిగాడు. వాడు అంతా ఒప్పుకున్నాడు. ఆయన కోపం పట్టలేక "పూర్వాన్నించి చేస్తున్న దొంగవు నువ్వేనా!" అని మరివక దెబ్బ వేశాడు. కుర్రవాడు పుట్టి దాదాపు పది సంవత్సరాలు చెల్లుగా వాడి ఒంటిమీద దెబ్బపడ్డరో జదే. గృహకృత్యాలు నిర్వర్తించుకుంటున్న తల్లి కుర్రవాడి ఏడుపు విని వచ్చి సహించలేక "కొట్టారా ఏ మండీ! కుర్రతనం, వాడి కేమి తెలుసు? పెద్దైతే వాడికే బుద్ధి వస్తుంది. ఆలా చెయ్యబోకురా నాయనా! ఆ పాడు సావాసాలు చెయ్యకు" అని కుర్రవాడిని ఇంట్లోకి తీసుకు వెళ్ళింది.

ఆరోజు సాయంత్రం నరసింహం కుర్రవాడి చేష్టలన్నీ తలపోసుకుంటూ ఇంటి అరుగుమీద కూర్చున్నాడు.

అప్పుడే బళ్ళోనుంచి పలకా పుస్తకాలతో వస్తున్న హేమ తండ్రితో "నాన్నా! నేను అయిదో తరగతి ఫస్టుగా ప్యాసయ్యా నని మా పంతులమ్మగారు నాకీ పుస్తకాన్ని బహుమానం చేశారు" అని సంతోషాన విప్పారిన ముఖంతో పుస్తకాన్ని తండ్రికి చూపించింది. తండ్రి తనలో "ఆడముండకు ఎందుకు ఇంత తెలివి? ఏం వ్రాగ్గేలుతుందా? దీనితో చదవ వేసిన సుగుణగాడు రెండో తరగతి లోనే పడి ఏడుస్తుంటే ఇది అప్పిడే అయిదో తరగతి కూడా ప్యాసయిం దట. ఇంత తెలివి వాడికి వుండరాదూ? ప్రతినిత్యం బడికి తప్పకుండా పోతుంది. ఏమీ అల్లరి చెయ్యదు. ఎప్పుడైనా వకకానీ యిస్తే తీసుకుంటుంది. ఇవ్వకపోతే ఏడిపించదు. ఈ సుగుణ సంపత్తి సరిగా బళ్ళోకి పోక నానా అల్లరీ చేస్తూ చేతికి అందినంత డబ్బూ ఫుంజీలకు ఫుంజీలు ఎగర కొడుతూ వున్న ఆ సుగుణగాడికి వుండరాదూ? బతికి పోతాడు!" అని ఏ వేవో అనుకున్నాడు.

పెద్ద పిల్ల శాంతకూ, రెండోపిల్ల పద్మినికీ చెరి రెండు వేలూ కట్నా లిచ్చి ఇద్దరికీ శ్లాఘ్యంగా వివాహాలు చేసి రివాజు ప్రకారం ఇచ్చేవన్నీ యిచ్చివేసి అత్తవారి ఇండ్లకు వాళ్ళను పంపివేశాడు తండ్రి.

మావాడు తెచ్చాడు కామాలు తీసుక వెళ్లండి" అని నూరు రూపాయలు ఇచ్చాడు. కొడుకును ఎందుకు తెచ్చావని అడిగిందాకా ఆయన మనస్సు నిలవలేదు. పొద్దుటినుంచీ సుగుణసాగరుడు కొట్టువద్దకు రానందున ఇంటివద్ద వుంటాడని వెళ్లాడు. అక్కడ లేడు. భార్యను అడిగాడు. "వాడు రాత్రిగూడా ఇంటికి రాలేదు. చెప్ప కుండా సావాసగాళ్లతో కలిసి నాటకాలనీ, సినిమాలనీ, పొరుగూళ్ళకు వెళ్ళడం మామూలేగా" అన్నది సీతమ్మ. "ఇంకేం, నూరురూపాయలూ కొట్టుక వెళ్ళాడు. అవి కాసినీ అయిపోందే ఇంటికి రాడు!" అని సంగతంతా ఆమెతో చెప్పాడు.

ఆ మరుసటిదినం నరసింహాం వ్యాపారంమీద బెజవాడ వెళ్లాడు. పని అంతా పూర్తి అయ్యేవరకు సాయంత్రం ఆరు గంట లయింది. అప్పుడు రైలుబండి లేదు. అందు వల్ల గాంధీపార్కుకు వెళ్లాడు. అప్పుడు కొద్ది కొద్దిగా చీకట్లు వ్యాపిస్తూ వున్నవి, గానీ ఇంకా బాగా చీకటి పడ లేదు. చల్లటి మందమారుతం వికసించిన పుష్పాల సౌరభాన్ని తీసుక వచ్చి అక్కడ కూర్చున్న జనానికి హాయి గలిగిస్తూ వున్నది. రావి చెట్టుపైన పక్షులు ఉద యానే ఆహారానికై పోయి అప్పుడే గూళ్ళు చేరుకుని తమ బిడ్డలను కలుసుకుంటూ హర్షధ్వానులు చేస్తున్నవి. నరసింహాం చుట్ట కాల్చుకునే టందుకు అక్కడ అరుగుపై

కూర్చున్నవారిని "అగ్గిపెట్టె ఉన్నదా"అని అడిగాడు. వాళ్ళు లేదన్నారు. కొంత దూరంలో ఒక చెట్టుచాటున ఎవ్వరో ఇద్దరు మాట్లాడుతూ వున్నట్టు మసక మసకగా కనుపించగా, వారి దగ్గిర అగ్గిపెట్టె ఉన్న దేమో నని అడిగే టందుకు వెళ్ళాడు. గుప్పున బ్రాందీవాసన కొట్టింది. ఇంకే మున్నది! తన కొడుకు సుగుణ సాగరుణ్ణి, చక్కగా అలంకరించుకున్న ఒక స్త్రీనీ, వారి ముందు ఒక సీసా ఒక గ్లాసూ చూచాడు. తన కళ్లు నమ్మలేక పోయినవి. తన కొడుకు ఇట్టి దుష్ప్రవర్తనకు లోనవుతా డని ఎప్పుడూ ఆయన అనుకో లేదు. అది కల లాగా అనిపించింది. ముందు అందంగా కనుపించిన ఆ స్త్రీ చూడగా చూడగా మృత్యుదేవత వలెనూ, ఎంతో ప్రేమతో తన ప్రాణంవలె చూచు కున్న కొడుకు తనపాలిటి యముడివలెనూ కనుపించారు. తల గిర్రున తిరిగిన ట్టయింది. అప్పుడు ఏమీ అనే టందుకూ, ఏమీ చేసేటందుకూ తోచలేదు. అట్లాగే రాతి బొమ్మలాగా నిలవబడి పొయ్యాడు. సుగుణసాగరుడు తండ్రిని చూచి కట్టె బారిపొయ్యాడు. ముఖం వివర్ణమై పోయింది. గుండె బహు తీవ్రంగా కొట్టుకో సాగింది. తలకాయ భూమిలోకి వంచుకున్నాడు. అంతవరకూ సంతోషంగా వుండి ఆయన్ను చూడగానే అతనిలో

గలిగిన మార్పుకు అతని కేమన్నా ఆయన అవుతా డేమో నని గ్రహించి ఆ స్త్రీ లేచి వెళ్లిపోయింది.

ఉండీ ఉండీ నరసింహం కోపం అంతా ఒక్కమారే పైకి పొంగింది. ఇక పట్టలేక పొయ్యాడు. చెయ్యి అప్రియత్నంగా పైకి లేచింది. ఈడ్చి ఈడ్చి రెండు బాదులు బాది తన కోపాన్ని కొంత చల్లార్చుకున్నాడు. "దొంగతనంగా నూరురూపాయలు తెచ్చి ఈపనా నువ్వు చేస్తున్నది! ఈ యీడు కప్పుడే ఇవేమి బుద్ధులు? నా కడుపున చెడ పుట్టావు! ఆ రాక్షసి నీ కెక్కడ దాప రించింది! బాగుపడేవాడి లక్షణాలు ముందే తెలుస్తవి. ఇంటికి పద, ని న్నేంచేస్తానో!" అని చీవాట్లు వేసి జేబులో చెయ్యి పెట్టి చూచాడు. పది రూపాయల కాగితాలు నాలుగూ, కొంత చిల్లరా చేతికి చిక్కింది. ఇంకేమీ అనకుండా వెంట తీసుకుని రైలుస్టేషనుకు వెళ్ళాడు.

ఇల్లు చేరిన తరవాత సుగుణసాగరుణ్ణి బైటకు కదల కుండా తల్లీ దండ్రీ కట్టు దిట్టాలు ఏర్పరచారు. పెండ్లి చేస్తే వాడి ప్రవర్తనలో మార్పు ఏదన్నా కలుగుతుం దేమో నని ఒక సంబంధం చూచి, అయిదువేల కట్నం మీాద మహా వైభవంగా అయిదు రోజుల పెండ్లి చేసి, వెంటనే పిల్లను తీసుకు వచ్చారు.

పెండ్లిచేసినా వాడిలో మార్పు ఏమీా కలగ లేదు. వీలైనప్పు డల్లా అందినవరకు కొట్టుకుని వెళ్ళడం, అవి

అయ్యేవరకు తిరిగి రావడం, ఇట్లా జరుగుతూ వున్నది. రెండు సంవత్సరాలు గడిచినవి. తన కొడుకు ఎంత డబ్బు దుబారా చేసినా నరసింహం ఊరుకుంటున్నాడు గానీ, తన కూతుళ్ళు కాపరానికి వెళ్ళిన ఇంతకాలానికీ చెల్లుగా ఒక్క పిల్లనైనా తీసుకుని వచ్చి చేతులారా ఇంత చీర పెట్టిన పాపాన్ని పోలేదు. ఆ సంవత్సరం రెండో కొడుకు విద్యాసాగరుడి పెండ్లి కూడా ఆడంబరంగా చేశాడు. ఆడపిల్లలు నలుగురూ తమ భర్తలతో సహా వచ్చి తమ సోదరునికి తమకుతోచిన కట్నాలూ, కానుకలూ, చదివించి అటు నిద్రలూ ఇటు నిద్రలూ అయ్యేవరకూ వుండి సంతోషంగా కాలం గడిపి తరవాత ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపొయ్యారు.

౬

నాలు గయిదు నెలలు తేడాగా ఇద్దరు కోడళ్ళూ కాపరానికి వచ్చారు. సుగుణసాగరునిభార్య రూపవతి అయినా అతని మామూలు ఏమీ మానలేదు. నాలుగు రోజులు ఇంటివద్ద వుండడం, పదిరోజులు ఎక్కడో గడిపి రావడం. తల్లి దండ్రులకు చెప్పీ చెప్పీ విసుకుపుట్టి ఎట్లయినా చావ నిమ్మని ఇక చెప్పడం మానివేశారు. విద్యాసాగరుని భార్య అంత రూపవతి కాకపోయినా అతడు భార్య వచ్చిన దగ్గిరనుంచీ అధిక ప్రేమతో కొట్టు

వద్దకు కూడా సరీగా పోకుండా ఆమెను ఘడియ గూడా విడిచిపెట్టి వుండక ఆమె చెప్పినట్టు నడుచుకుంటూ వున్నాడు. అందువల్ల తల్లి దండ్రులమీద అదివరకు అతనికి వున్న అభిమానం అంతరించి పోయింది.

వచ్చిన ఏ రెండు మూడు నెలలు అనుకూలంగా వున్నారో తోడికోడళ్లిద్దరు. తరవాత కారణం లేకుండానే ఆమె మూతి అటూ, ఈమె మూతి ఇటూ ముడుచుకు చక్కా పోయినవి. ఆమె కంపు ఈమెకూ సరిపడదు. ఈమెపొడ ఆమెకూ గిట్టదు. ఇంటి పనులలో వంతులు వేసుకుని ఈ దిక్కుమాలిన బండచాకిరీ అస్తమానం ఎవరు చేస్తా రని ఒకామే, దానిని కూర్చోపెట్టి చెయ్యాలని నాకేం ఖర్మం పట్టిం దని ఒకామే, ఏ పనీ ముట్టుకోకుండా ఎవరి గదుల్లో వాళ్లు కూర్చోవడం మొదలు పెట్టారు.కోడళ్లు వచ్చాక సుఖపడదా మని గంపె డాశతో వున్న సీతమ్మకు ఇప్పుడు కోడళ్ళకుకూడా వండిపెట్టవలసి వచ్చింది; పూర్వంకంటే రెట్టింపు చాకిరీ ఆమె నెత్తిన విరుచుకు పడ్డది. కోడళ్ళిద్దరూ ఏకాస్త చిన్న తేడానో పట్టుకుని తెగిందాకా సాగదీసి సాగదీసి ప్రతి రోజూ పోట్లాడుతూ వుంటారు. ఆ తగాదా తీర్చలేక సీతమ్మ చచ్చిపోతూ వున్నది. ఎలుకమీద పెట్టి వకతె అంటే, పిల్లిమీద పెట్టి రెండో ఆమె వెంటనే జవాబిసుంది. అక్కడనుంచి నువ్వు నన్నన్నావనీ నువ్వు నన్నన్నావనీ,

పోట్లాట ప్రారంభం అవుతుంది. తిట్లూ దీవెనలూ శాపనార్థాలతో పెద్ద గల్లంతు అవుతుంది. అక్కడనుంచి ఇరుగు పొరుగు అమ్మలక్కలు చేరి లొట్టలు వేసుకుంటూ అటు బారెడూ, ఇటు బారెడూ వేసి దాన్ని ఇంకా పెద్దది చేస్తారు. అది తీర్చలేక సీతమ్మకు హాత మారుతూ వున్నది. ఎటు చూచినా నిష్ఠురమే. ఎవ్వరిని ఊరుకో మన్నా కోపమే. నరసింహం కొట్టువద్దనుంచి భోజనానికి ఇంటికి వచ్చినప్పుడు ఆయన ఉన్న కాస్సేపు ఏమి వూరు కుంటారో ఆయన అటు వెళ్లగానే మళ్ళీ కథ ప్రారంభం అవుతుంది.

మధ్యాహ్నం తీరుబడి కాలంలో ఇరుగు పొరుగు అమ్మ లక్కలు నలుగురూ వీళ్ళింటికి చేరి ఎల్లిమీద మల్లీ, మల్లిమీద ఎల్లీ, పడిందని ఏవేవో వృధా ప్రసంగాలు చేస్తూ వుంటారు. సీతమ్మ పెద్దకోడలు విమల, భాగ్య వంతుల పిల్ల, నాలిముచ్చు. రెండో కోడలు సుశీల, సామాన్య కుటుంబీకుల పిల్ల తొందర మనిషి.

ఒకనాడు ఇరుగు పొరుగు పుల్లమ్మా, ఎల్లమ్మా నలు గురూ కూర్చుని ఊళ్లో సంగతు లన్నీ ఎదపోసుకోవడం మొదలు పెట్టారు. వాళ్ల పుట్టింటివాళ్లు ఎంత సారె యిచ్చి కూతురిని అత్తవారింటికి పంపా రంటే, ఓసెమ్మా, మొన్న పెసరవారి కోడలికి ఇచ్చి పంపినంత సారె ఎవ్వరూ ఇవ్వ లే దని ఒకామె, ఇట్లా ఎక్కడెక్కడి సంగతులూ రా

మొదలు పెట్టినవి. విమల ఆ మాట అందుకుని "మా పుట్టింటివాళ్ళు ఇచ్చే వన్నీ సరీగా ఇస్తే నేను భూమ్మీద నిలవకనే పోదును" అన్నది.

ఆ మాటకు సుశీల లేచి "ఒసేయ్, నన్నే గదే నువ్వనేది? నా వ్రాసు నీ కెందు కే! నా పుట్టింటి వాళ్ళు ఎట్లా యిస్తే నీ కెందు కే? అసలు నా పుట్టింటి వాళ్ళ పేరు నువ్వెందు కెత్తాలి? నీ పుట్టింటి వాళ్ళు ఆరిపొయ్యారా! బుగ్గయి పొయ్యారా! ఈ దఫా వాళ్ళ పేరు ఎత్తు, నోట్లో గడ్డి పెట్టిస్తా. నీ పుట్టింటి వాళ్ళు డబ్బు కలవా ళ్లని ఎగిరిపడ బోకు. రెక్కలు కట్టుకుని ఆకాశంమీద ఎగరబోకు. కొన్నాళ్ళు భూమ్మీద నిలు. అట్లా పొంగిపడతా వెం దుకు? పొంగిం దల్లా పొయ్యిపాలే!" అని చేతులు జాడిస్తూ పెద్ద గొంతుకతో అన్నది.

వెంటనే విమల శివ మెత్తినట్టు లేచి "ఏ మమ్మా! రమణమ్మ పిన్నీ, క్షేమమ్మ వదినే! నే నిప్పుడు ఒకదాని పేరెత్తా నటమ్మా! దాని ఉలుకు అది బయట వేసుకుని ఎట్లా పడిపోతూ వున్నదో చూడండమ్మా! ఒసేయ్, నా పుట్టింటివాళ్లు ఎందుకు ఆరిపోతారే? నీ పుట్టింటి వాళ్లు నాశన మవుతారు! నీ పుట్టింటివాళ్లు దుమ్మయి పోవాలి! నీ పుట్టింటివాళ్ళు నేలమట్టమయి, జిల్లేళ్ళు మొలిసి పోవాలి! మొగుణ్ణి ఎట్లాబడితే అట్లా ఆడిస్తున్నా నని అదిరిపడబోకు. ఎవరన్నా వింటే నోట్లో గడ్డి పెడతా

రని సిగ్గన్నా లేకుండా నేనే గనక మొగుడి బుజాలమీద ఎక్కా నని నిక్కి చావబోకు!" అని చేతులు విసురుతూ రైలు కూసినట్టు పెద్దగొంతుతో అరిచింది.

అందుకు సుశీల "నే నెందుకు చస్తానే! నువ్వు చావు. మీ నాయన చస్తాడు! మీ అమ్మ చస్తుంది! మీ అక్కలూ, మీ చెల్లెళ్లూ, మీ అన్నలూ, మీతమ్ముళ్లూ చచ్చి పిలవ పేరులేకుండా పోతారు!" అన్నది ఆడ ఏనుగు ఘీ పెట్టినట్టు ఘీ పెడుతూ

కథ భూపాలరాగం మీద మంచి రక్తి కడుతూ వున్నది. అత్త ఇదంతా విని ఇంకా ముదిరి పోతుందని, "ఊరుకో సుశీలా, ఎవరు వక్కమాటలో వూరుకున్నా పోతుంది. మీ రట్లా కవర్లాడుకుంటూ వుంటే చూచే వాళ్లు నవ్వి పోతారు" అన్నది.

అందుకు సుశీల "అదిగో చూచారమ్మా. పెద్ద కోడలిని వెనక వేసుక వస్తున్నది. నన్ను ఊరుకో మని చెప్పక పోతే ఆమెగారితో చెప్పరాదూ. నేనే నమ్మా అందరికీ లోకువ! ఎవరువత్తినా నన్నే. అది నన్నట్లా తిట్టి పోస్తూ వుంటే ఇందాకటి నుంచీ చూస్తూ ఊరుకున్నావు గానీ, ఎందుకే దాన్నట్లా తిడతావు అని కాస్తన్నా చెప్ప లేక పొయ్యావు! మా పుట్టింటి వాళ్లే భాగ్యవంతు లైతే అందరూ నన్ను బాగానే చూచే వాళ్లు. నా కెవరున్నారు అడిగేందుకు? దాపులో అయ్యా

"చెప్పు, ఆ రామారావు ఎవడు? నువ్వెందు కట్లా వ్రాయవలసి వచ్చింది? వాడి దగ్గరైనా ఈ రూపాయలు వచ్చే విధం వున్నదా? అయిందేమో అయిపోయింది. ఇప్పుడైనా నిజం చెప్పు" అని కొడుకు ముఖంవంక చూడకుండా పెడముఖం పెట్టి అడిగాడు నరసింహాం.

అందుకు వాడు బెజవాడలో తన కొక వేశ్య వున్నదనిన్నీ, ఒకరోజున ఆ వేశ్య అన్న రామారావు కొన్ని బంగారం వస్తువులు తీసుకుని అమ్మడానికి తనను కూడా వెంట రమ్మని కొంత దూరం తీసుకవెళ్లి, అప్పుడు తనకు పదివేలరూపాయలు కావా లనిన్నీ,ఇంకా కొన్ని రోజులు ఆగితే బంగారానికి ధర పెరుగుతుం దనిన్నీ, అప్పుడు అమ్మితే చాలా ఎక్కువ డబ్బు వస్తుం దనిన్నీ, నే నొక్కణ్ణే నోటువ్రాస్తే అంతడబ్బూ ఇవ్వరు, ఆ వస్తువు లన్నీ నీ దగ్గర వుంచుకుని తనతోపాటు నోటుమీద సంతకం చెయ్యవలసిం దనిన్నీ కోరినందున అతనిమాటలు తాను నమ్మి ఆ వస్తువులు తీసుకుని ఆ రూపాయలు ఇప్పించి నట్టున్నూ ఎన్నాళ్లకూ వాడు కనపడనందున ఆ వస్తువులు అమ్మి బాకీ ఇచ్చివేద్దా మని అమ్మజూపగా అవి గిల్టునగలు అయినట్టున్నూ, తాను చింతిస్తూ వేశ్య దగ్గిరికి వచ్చి అడగ్గా, అదంతా నాకేమీ తెలియ దని చెప్పిన దనిన్నీ నిజం చెప్పివేశాడు.

"ఓరి దుర్గుణ సాగరుడా! సుగుణసాగరు డన్న పేరు

నీవంటి మీద పడి చెడిపోయింది! ఛీ, నీ ముఖం చూడ రాదు! వెళ్ళిపో!" అని నాలుగు తిట్టి తన దురదృష్టానికి చింతిస్తూ, వాడుదావా చేస్తే ఖర్చులు కూడా తగులుత వని దమ్మిడీలతో కూడా చెల్లించివేసి నోటును తెచ్చు కున్నాడు. నరసింహం వెంటనే అన్ని పత్రికల్లో తన కొడుకు సుగుణసాగరుడు మతి స్తిమితం లేకుండా వున్నం దున తన పేరుతో గానీ అతని పేరుతో గానీ అతనిద్వారా ఈ రోజు మొదలుకుని ఏలాటిబాకీ ఇవ్వరాదనీ, అట్లా ఇస్తే తనకేమీ సంబంధం లే దనీ ప్రకటించి వేశాడు.

౭

ఒక నాడు సూర్యోదయానికి ముందు నరసింహం చుట్ట కాల్చుకుంటూ, వీధి అరుగుమీదకు వెళ్లాడు. వాళ్ళ గోడకు ఏదో పెన్సలుతో వ్రాసిన కాగితం ఒకటి అంటించి వున్నది, దాన్ని చదివి చిన్నపోయ్యాడు. వాళ్ళ పెద్ద కోడలు విమలపై వ్రాసిన వెలిజా బది. ఎవరైనా చూస్తే అప్రతిష్టని ఆ కాగితాన్ని తీసుకుని, చిన్న చిన్న ముక్కలుగా చించి పారవేశాడు. తన వంశంలో ఎప్పుడూ లేని ఇట్టి కళంకానికి చాలా చింతిం చాడు. అగ్నితో తన శరీరం దహించుక పోయినట్టు బాధ పడ్డాడు. తన కోడలిని పుట్టింటికి పంపివేద్దా మను

కున్నాడు. ఆ పిల్ల దగ్గిర అటువంటి స్వభావం ఏమీ తనకు కనిపించ నందున, కళ్ళారా చూడంది ఏ పనీ చెయ్యరా దని ప్రస్తుతం ఆగాడు.

పూర్వం నరసింహం ఇంటివద్ద వున్నప్పుడు తోడి కోడళ్లు పోట్లాడ్డం మానివేసే వాళ్ళు. ఇప్పుడు ఆయన వున్నా సరే, జడుపులేకుండా బండి సాగిస్తున్నారు. ఆ నాడు సుశీల పెట్టెలో ఒక రూపాయి తక్కువైన దట. కథకు వినాయక ప్రార్థన చేసి గజ్జ కట్టి ఇక మొత్తుకున్న ది. "నా సొమ్ము తిని బాగు పడతారా అంటే, ఇట్లా దొంగ సొమ్ము ఎన్నాళ్ళు తింటా రంటే, నా సొమ్ము తిన్న వాళ్ళు ముదనష్టమై పోతా రంటే, ఇటువంటి దొంగ చచ్చిన వాళ్ళల్లో ఇంకేం మనాయిస్తారంటే," ఇంకా ఏవేవో అంటూ మందరస్థాయిలోనుంచి తారస్థాయిని అందుకున్న ది.

వెంటనే విమల "ఎందుకే అట్లా పిచ్చటిల్లి పోతున్నావు! నువ్వూ నీ సొమ్మూ ఎక్కడ దాన మయిందీ ఎవరికి తెలుసే! వృథాగా నోరు పారవేసుకున్నా వంటే చెప్పు తీసుకుని కొట్టేస్తా!" అని తన భాగం తప్పులు పోకుండా చదివి బాగా అభినయించింది.

ఆ మాటలకు సుశీలకు కోపం ప్రతిరక్త నాళానికీ వ్యాపించింది. జుట్టుముడి విడి పోయింది, మహిషాసుర మర్దని వలె, "ఎట్లా చెప్పు తీసుక కొట్టేస్తావో రా!" అని

రయ్యామని పమిటచెంగు నడుముకు బిగించి తోడి కోడలి మీదికి పోవడానికి సిద్ధమయింది.

ఇట్టి తరుణంలో ప్రసవం అయ్యేందుకు తీసుక వచ్చిన వాళ్ల ఆడబిడ్డ పద్మిని, ఇదంతా చూచి వాళ్లు కలియ బడతా రనుకుని "ఎందు కమ్మా! మీ రట్లా వృధాగా పోట్లాడు కుంటారు?" అని విమల మీదికి పోతూ వున్న సుశీలను ఆపుదా మని ఆమెకు అడ్డం పోయింది. సుశీల కోప తీవ్రం చేత ఒళ్లు తెలియకుండా ఉన్న దేమో, ఈమెను లెక్క చెయ్యకుండా, విదులు కున్నందున పాపం పద్మిని, నవమాసాలూ నిండి బలహీనంతో ఉన్న దేమో, ఆమె తాకుడుకు ఆగలేక కింద చతికిల పడ్డది.

అది చూచి సీతమ్మ "అయ్యో! అయ్యో!! ఇంకే మున్నది! నా బిడ్డను చేతులారా చంపింది. నవమా సాలూ నిండి ఇవ్వాళ్లో రేపో ప్రసవం కావడానికి సిద్ధంగా వున్న పిల్లను పడతొయ్యడానికి నీ చేతు లెట్లా వచ్చినయ్యే గొడ్డుమోతుదానా!" అని ఏవేవో అంటూ వున్నది. తోడికోడలి మీదికి కుస్తీకి తయారైన సుశీల అత్త అంటూ వున్న మాటలను విని ఇదివరకే రేగిన కోపం రెట్టింపై చిందులు తొక్కుతూ తోడికోడలివైపు మాట్లాడుతుం దని అత్తమీద అదివరకే మనసులో కక్ష వుండడం చేత, ఈనిన ఆడపులిపై రాయి వేస్తే దూకినట్లు అత్త మీదకు దూకి, "నన్ను గొడ్డుమోతుదాన్నం

టావా? నీ పెద్దకోడలంటే బెల్లంతో సమానమా!"
అని ఫెళ్ళున సీతమ్మను దవడకు వేసి బాదింది.

అప్పుడు సీతమ్మ కెవ్వున కేక వేసి, "చచ్చానురో నాయనో! దీని నోరుబడ దిక్కుమాలిన సంబంధం తెచ్చి పెట్టుకున్నాను. దీని వంశం ఇదీ పాడైపోను! ఆఖరుకు కోడలిదానిచేతకూడా తన్నులు తినవలసి వచ్చింది! అని పెద్దపెట్టున ఏడవడం ప్రారంభించింది" అంతకు కాస్తముందు కొట్టువద్ద నుంచి ఇంటికి వచ్చి అదంతా వింటూ వున్న నరసింహం కోపంతో కోడలిని, "భడవాముండా! అంత వళ్ళుపై తెలియడం లేదూ! పొగరెక్కి దాన్ని కొడతావా!"అని చెయ్యి పైకెత్తాడు.

అప్పుడు ఆమె "చంపుతున్నాడు రో దేముడా! నా ప్రాణాలు ఎగిరిపోతున్నవో నాయనా! పెళ్ళాన్ని వెనక వేసుకుని వచ్చి నా గొంతు పిసుకు తున్నాడో తండ్రీ!" అని పెడబొబ్బలు పెడుతూ, శోకాలు తీస్తూ, పెద్ద గల్లంతు చేస్తూ ఉన్నది. భార్య అట్లా శోకాలు పెట్టడం విని గదిలో వున్న విద్యాసాగరునికి ప్రాణాలు ఎగిరిపోయిన ట్లయినవి. అందులో ప్రేమ కుదిరినముద్దుల పెళ్లాం, ప్రళయకాల గర్జనలవలె ఆమె కేకలు వినిపించి నవి. శరీరం కంప మెత్తి పోయింది. అప్రియత్నంగా బయటికి వచ్చాడు. తన ఒళ్ళునే మరచి పొయ్యాడు. అప్పుడు ఏమి మాట్లాడు తున్నదీ తనకు తెలియ లేదు.

"ఏం దాన్ని కొడతావా? ఏదీ కొట్టూ చూస్తాను. దెబ్బ పడ్డదా నీ మర్యాద దక్కదు." అని గుద్దెర్రి చేస్తూ, తండ్రిపైకి పొయ్యాడు.

ఆ మాటలు విన్న నరసింహానికి మిన్ను విరిగి మీద పడ్డట్టయింది. పెళ్లాన్ని వెనక వేసుక వచ్చి కొడుకు తన పైనల్లా తిరగ పడతాడని కలలోనైనా అనుకో లేదు. ప్రపంచం తిరగపడ్డట్టు కనిపించింది. ఎత్తిన చెయ్యి కిందకు దించాడు. "ఛీ గాడిదల్లారా! నా యింట్లో ఒక్క ఘడి యయినా ఉండే టందుకు వీల్లేదు! తక్షణం వెళ్లి పోండి. రామరామా! ఎప్పుడూ ఎరగని కొంపలో నానా అల్లరీ, నానా ఆగమూ! దుర్మార్గులు పుట్టారు లెక్కకు! ఏం సుఖం" అని అక్కడి నుంచి కదిలి అరుగు పైన కూర్చున్నాడు.

గదిలో నుంచి వచ్చి కొడుకు అన్నమాటలూ అతని తీవ్రం చూస్తే సీతమ్మ తండ్రిమీద కలియబడతా డని ఎంచి "ఇంకే ముంది నాయనో! పెళ్లాన్ని వెనక వేసుకుని తండ్రిని కొట్టడానికి వస్తున్నాడు. ఇదేమి పాడురో జులురా దేముడా. మా బతు కిట్లా అల్లరిపాలయ్యే రాత పట్టిందో బాబూ. కొడుకులో కొడుకులో అని తన్నుకున్నాను. మమ్మల్ని నడివీధిలో పెట్టే కొడుకులు పుట్టారో నాయనా" అని శోకాలు పెట్టింది.

నరసింహానికి పెద్దకొడుకు డబ్బు దుబారా చెయ్యడం

వాడి దుశ్చేష్టలూ, చిన్నకొడుకు డబ్బు చేపడుతున్నా డన్న అనుమానం, తోడికోడ ళ్లెప్పుడూ జుట్లూ జుట్లూ పట్టుకోవడం, వీటివల్ల వాళ్ళను ఇదివరికే ఎవ రంతట వాళ్ళను ఉంచా లను కున్నాడు. ఆయనకు ఈ దెబ్బతో వాళ్ళంటే రోత వేసి, ఇద్దరు కొడుకులనూ ఇంట్లో నుంచి వెళ్ళగొట్టి వేశాడు.

౮

నరసింహానికి పూర్వం ఉన్న వుత్సాహమూ, కుదురు బాటూ, పోయి జీవితంలో ఒకవిధమైన అశాంతి ఏర్ప డ్డది. ఇద్దరు కొడుకులూ దుష్టులై, పెద్దకొడుకు అందిన వరకూ డబ్బును పాడు చెయ్యటంవల్లా, చిన్నకొడుకు భార్య దుర్బోధలు విని డబ్బు చేపట్టడం వల్లా, సంసారం కూడా చితికిపోయింది. వీళ్ళ కాపరం ఇట్లా చిందూ బిందూ కావడంవల్ల, బాకీదార్లుకూడా బాధపెట్ట జొచ్చారు. ఎట్లాగో సమాధానం చెప్పి ఆపివేస్తు న్నాడు నరసింహం. ఆర్థిక విషయ మయిన దిగులుతో, కొడుకుల దిగులుతో, మనిషి చిక్కి సగ మయ్యాడు. అందులో వృద్ధాప్యం కూడా రావడంవల్ల, కూర్చున్న దగ్గిర నుంచీ లేవలేని స్థితిలో వున్నాడు. ఎప్పుడూ చెప్పరాని మనోవ్యథ అనుభవిస్తూ వుంటాడు. ఎప్పుడూ

ఏదో పరధ్యానంగా వున్నట్టుంటాడు. క్రమేణా పూర్వం వున్న వ్యాపారం గూడా తగ్గి పోయింది. అంత కంటే ముందు ఆయనకు దాని మీాద శ్రద్ధ గూడా తగ్గి పోయింది. కొట్టు ఒకరోజు తీస్తే ఒకరోజు తియ్యడు. ఇట్టి స్థితిలో కొడుకు లిద్దరూ ఏకమై, వాటాలు పంచి పెట్టవలసిం దని పెద్దమనుష్యులను తండ్రిదగ్గిరికి పంపారు. ఆ వచ్చిన వాళ్లతో నరసింహం "ఉన్న కాస్త ఎలుకలు తొలిచినట్టు వాళ్లే తొలిచి వేశారు. ఇవ్వవలసిన బాకీలు వున్నవి. రావలసిన బాకీలు కొన్ని వున్నవి. లోకులకు ఇవ్వవలసింది పోగా, ఏదన్నా కాస్త మిగిలి తే నా అనంతరం వాళ్లకు చెందవలసిందే గాని, నేను బతికి వున్నంత వరకూ ఒక కానీ గూడా పంచి పెట్టను" అని ఖండి తంగా చెప్పి వేశాడు.

కొద్ది రోజులకు కొడుకుల దగ్గిరనుంచీ లాయరు నోటీసు వచ్చింది. తర్వాత కొద్ది దినాలకు దావా నోటీసులు గూడా వచ్చినవి. నరసింహం దగ్గిర ప్రస్తుతం డబ్బు లేదు. వ్యాజ్యానికి కొంత అప్పు చెయ్యవలసి వచ్చింది. కోర్టువారు ఉన్న ఆ స్తిని మూడు వంతులు చేసి, భూములూ అవీ వాళ్ల స్వాధీనం చేసి వేశారు. రావలసిన బాకీలలో, ఇవ్వవలసినవి పోను మిగిలిన ఆరు వేలనూ ఇద్దరు కొడుకులకూ చెరి రెండు వేలూ రొక్ఖ పూర్వకంగా ఇవ్వవలసిందిగా కోర్టువారు తీర్పు చెప్పారు.

రావలసిన బాకీలలో మునిగిపోకుండా వచ్చే బాకీలని కోర్టువారు నిర్ణయించిన వాట్లలో, నరసింహానికి సగం బాకీలు మాత్రమే వసూ లయినవి. అందువల్ల, వాళ్లకు ఇవ్వవలసిన చెరి రెండువేలూ ఇవ్వలేక పోయ్యాడు. వాళ్ళకు రావలసిన డబ్బూ, వాళ్ళకు అయిన ఖర్చులూ, వచ్చే మార్గం ఏదీ లేనందున, తండ్రి హిస్సావచ్చిన ఆ స్తినిగూడా, ఇద్దరు కొడుకులూ తల్లిదండ్రులను కట్టుగుడ్డలతో ఇంట్లోనుంచి వెళ్ళగొట్టించి కోర్టు ద్వారా ఇల్లునుగూడా స్వాధీన పర్చుకున్నారు. వాళ్లిద్దరూ ఇంట్లోనుంచి వెళ్లుతూ వుంటే, వాళ్ల పెంపుడు పిల్లి "మ్యావు మ్యావు" మంటూ దాని చింతను తెలియజేస్తూ వెళ్లవద్దన్నట్టు కాళ్ళకు అడ్డడ్డాలు వచ్చింది.

ఆ రోజున సీతమ్మ దుఃఖానికి మేరలేదు. నరసింహాం ఏమీ చింతించ లేదు. వారి పాట్లను ఇరుగు పొరుగువారు చూచి, చాలా విచారపడి, వాళ్ళను బతిమ లాడి ఆ రోజుకు ఒకరి యింట్లో ఉంచుకుని, ఇంత ఆతిథ్య మిచ్చి గౌరవించారు. ఆ మరునాడు సీతమ్మ "పెద్దమ్మాయి గారింటికి వెళ్ళుదాము" అన్నది భర్తతో. ఈ స్తితిలో ఆడపిల్లల యిళ్లకు పోవడం, ఆయనకు మనస్కరించక "నా కొక పూర్వస్నేహితు డున్నాడు. వాళ్ల యింటికి పోయి నాలుగు రోజులు గడుపుదాము. తరవాత ఎట్లా అయితే అట్లా అవుతుంది" అన్నాడు నరసింహాం.

ఇద్దరూ రైలుస్టేషను వద్దకు వెళ్లారు. ఇల్లు వదిలినా ఏమీ చింతించని నరసింహం జన్మస్థానం వదల వలసి వచ్చి నందుకు ఆయన కళ్ల వెంట అశ్రుకణాలు రాలినవి. గ్రామం వాళ్ల వియోగానికి దుఃఖిస్తున్నదా అన్నట్టు సన్నజల్లు పడ్డది. రైలు కూతవేసి వాళ్లను ఆహ్వానించింది. ఇద్దరూ రైలెక్కారు. వాళ్లెక్కిన పెట్టెలో కూర్చుని వున్న ఒకవ్యక్తి సమీపించి, వాళ్ల చిన్నబోయిన ముఖాలను చూచి, "ఎక్కడికి వెళ్లుతున్నారు? ఏమిటి అట్లా వున్నారు?" అని అడిగాడు. ఆ వ్యక్తి వాళ్ళ రెండో అల్లుడు శ్రీధరరావు. ఆయన వాళ్ళ కష్టాలు విని చాలా చింతించి, "మీ కేమీ పరవా లేదు. మా యింటికి రాండి. మీ కే లోటూ జరగకుండా పువ్వులలో పెట్టి పూజిస్తా. మీ రేమీ చింతించ వద్దు" అన్నాడు.

"ఇప్పుడు కాదు. మరి ఒకతూరి వస్తాము. అందులో టికట్లు కూడా కొన్నాము," అన్నాడు నరసింహం.

"టిక్కెట్లు కొంటే పరవా లేదు. ఆ స్టేషనులో దిగి మా గ్రామానికి మళ్లీ టికట్లు కొని తెస్తాను. నే నిప్పుడు ఇంటికే వెళ్లుతున్నాను. నాతో కూడా తప్పక రావలసింది. రాజమండ్రికి నాకు పని తగలడం, వస్తూ వుండగా నే నెక్కిన పెట్టెలోనే మీరూ ఎక్కడం, అంతా సమకూరింది. లేక పోతే మీ రెక్కడ చిక్కులు పడే వాళ్లో పాపం!" అన్నాడు జాలిగా శ్రీధరరావు.

అల్లుడు అటు చూస్తున్నప్పుడు సీతమ్మ భర్తతో, "చూడండీ, అబ్బాయి మనల్ని చూచి ఎలా జాలిపడుతున్నాడో" అన్నది. ఆయన ఏమీ మాట్లాడ లేదు. రైలు చీరాల స్టేషనులో ఆగింది. ముగ్గురూ దిగి పోయ్యారు.

శ్రీధరరావు ముగ్గురు తోడిఅల్లుళ్ళకూ అత్త మామల స్థితిగతులు వ్రాశాడు. వాళ్ళు వెంటనే భార్యలతో, చీరాలకు వచ్చారు. వాళ్లను చూచి ఎటువంటి వాళ్లు ఎటువంటి స్థితికి వచ్చారని కూతుళ్లూ, అల్లుళ్ళూ, చాలా చింత పడ్డారు. మా ఇంటికి రమ్మంటే మా ఇంటికి రమ్మనీ, మేము తీసుక వెళ్ళుతా మంటే మేము తీసుక వెళ్ళుతా మనీ, వంతులు పడ జొచ్చారు. అప్పుడు పెద్ద అల్లుడు రఘుపతి "అట్లా కాదు తలా ఒకరి దగ్గిరా నెల నెల వంతున ఉండే ఏర్పాటు చేసుకుందాము" అన్నాడు. ఆ మాట అందరికీ నచ్చింది. నరసింహం అందుకు ఇష్టపడ లేదు. ఏ పుణ్యక్షేత్రమో వెళ్ళి, అక్కడ కాలం గడుపుతా మన్నాడు. "మా యిళ్ళ దగ్గిర వుండే టందుకు మీకు ఇష్టం లేకపోతే, కొంత డబ్బిస్తాను వర్తకం పెట్టుకోండి" అన్నాడు శ్రీధరరావు. తల్లి దండ్రులు దేశాల పాలై పోతా రనగా విని,కూతుళ్ళు భోరు మని ఏడ్చారు.

"ఇక నేను వర్తకం అవీ చెయ్యదలుచుకోలేదు. అంతా తెలుసుకున్నాను. ప్రపంచం అంతా వట్టి మోసం,

దగ్గరగా నాకు కనబడుతూ వున్నది. ఒక నీతీ నియమం లేదు. నా జీవితంలో రెండు అన్యాయాలను గుర్తించాను. ప్రపంచ మంటే ఏమిటో యిప్పుడు బాగా నాకు అర్థ మయింది. ఒకటి అందరికీ కావలిసింది ఆ డబ్బే. ఒక తండ్రీలేదు, ఒక తల్లీలేదు, ఒక కొడుకూ లేడు, డబ్బే ప్రధానం. దాన్నిబట్టి ఎంతటి దారుణ కృత్యా లయినా చేస్తారు. కోటి రూపాయలు సంపాదించి ఇంట్లో రాసులు పోసుకున్న వాడైనా, ఆకలికి కూడు లేక మల మల మాడే నిరుపేదలను సయితం దోయ చూస్తాడు. మా తల్లులు చూడండి! మా మీద ఎంత అనురాగాన్ని చూపించి పరితపిస్తున్నారో! రెండు; మీసాలూ, గడ్డాలూ, మొలిచే గొప్ప వాళ్లమని విర్ర వీగుతూ పురుషులు స్త్రీ జాతిని నీచంగా చూస్తారు. ఏమీ తెలియని వ్యర్థుడయినా బాగా చదివి మంచి విజ్ఞానం కలిగి ఉత్తమురా లనిపించుకున్న స్త్రీని సయితం తేలికగా చూస్తాడు. తోడి మానవజాతని అయినా చూడకుండా మెత్తని వాళ్ళను చూస్తే మగవాళ్ళు నెత్తిపై కెక్కి సవారి చేస్తారు. ప్రపంచంలో ఏమన్నా కాస్త దయా దాక్షిణ్యాలూ ఉంటే అవి వాళ్ళ దగ్గిరే ఉన్నవని చెప్పొచ్చు. నేను మాత్రం మంచి వాడినా ? ఆ రెండు తప్పులూ నేను గూడా చేశానని ఇప్పుడు తెలుసు కున్నాను. పశ్చాత్తాప పడుతూ

వున్నాను. కూతుళ్ళని తీసివేసి కొడుకులని నెత్తిన ఎక్కించుకుని ఇప్పుడింత ఫలితం పొందాను. ఎందులో యే హెచ్చుతగ్గులూ లేకుండా అంతా సమానం అయితేనే గాని ఈ దుర్మార్గాలు నశించవు. ఇప్పుడు నాకు కలుగుతూ వున్న ఉద్రేకానికి లోకం మీదికి పరిగెత్తాలని వున్నది. అయితే ఈ వృద్ధాప్యంలో ఈ కదలలేని స్థితిలో, నేనేమీ చెయ్యలేనని నాకు తెలుసు. అందుకనే వచ్చే జన్మలో అయినా నన్ను అందుకై పుట్టించమని ఈశ్వరుని ప్రార్థిస్తూ, కాలం గడపాలని వున్నది" అన్నాడు నరసింహం.

ఆయనలో కలిగిన మార్పుకు అల్లుళ్ళు ఆశ్చర్యపడ్డారు. ఇక వాళ్ళు వెళ్ళిపోతారని నిశ్చయించి కూతుళ్లు తల్లితండ్రులను కావిలించుకుని అదేపనిగా ఏడవడం ప్రారంభించారు. "ఎందుకు తల్లీ ! అట్లా ఏడుస్తారు ? సుఖం, దుఃఖం, అనుభవించాను. మంచీ చెడ్డా చూశాను. న్యాయాన్యాయాలు తెలుసుకున్నాను. పెద్దవాణ్ణయ్యాను. ఈశ్వర సేవకంటే నాకింకేం గావాలి తల్లీ!" అన్నాడు నరసింహం.

అదంతా చూచి రఘుపతి అన్నాడు. "మీ వియోగాన్ని సహించ లేక వాళ్లట్లా ఏడుస్తూ వుంటే వాళ్లను కాదని మీరు వెళ్లడం అంత మంచిది కాదనుకుంటాను. మీరు ఎక్కడికో పోయి ఈశ్వర ప్రార్థన చేసుకునే

దానికంటే, ఇక్కడ వుండే మీ రట్లా గడపవచ్చును. మీరు మాయిళ్ల దగ్గిరికి వచ్చి ఉండడానికి సందేహిస్తే, మేము ఒకచోట మీకు ఇల్లు యేర్పాటు చేస్తాము. డబ్బు పంపుతూ ఉంటాము. సుఖంగా మీరు అందులో కాలం గడపండి".

ఆమాట అందరూ బాగున్నదన్నారు. పద్మిని ఏడుపు మాని "మళ్లీ ఇక్కడ నుంచి ఇంకో చోటికి పోవడ మెందుకు? ఈ వూళ్లోనే యిల్లు కొనాలి" అన్నది. కూతుళ్ల దుఃఖాన్ని చూడలేక, అల్లుళ్ల మాటలు తోసి వేయ లేక వాళ్ల మాటలను అంగీకరించి నరసింహం "ఊళ్లో ఎక్కడా యిల్లు కొనవద్దు. ఈ గ్రామం వెలుపల ప్రశాంతమైన స్థలాన్ని చూచి తాటాకులతో చిన్న పాకావేస్తే చాలు, మీ మాటలు తోసి వెయ్యా లేక అందులో కాలం వెళ్ళబుచ్చుతాము" అన్నాడు. అందరూ ఆనందించారు.

వెంటనే సలుగురూ నాలుగు కాస్తలు వేసుకుని ఊరికి కొంతదూరంలో ఒక వెయ్యిరూపాయలకు ఒక చిన్న జీడిమామిడితోట కొని ప్రస్తుతం రెల్లు తెప్పించి మట్టిగోడలతో మూడుగదులకుటీరం నిర్మించి అందులో వాళ్లను ప్రవేశపెట్టారు. ఒక్కొక్కళ్లూ నెల,కుపదిరూపాయల చొప్పున ప్రతినెలా ఒకటో తారీఖుకు తప్పక పంపుతూ వున్నారు. ఆ తోటలో తీపినీళ్ల బావి ఒకటి

వున్నది. చెట్లపై చిలుకలూ, గోరువంకలూ, పావు రాలూ వాలి వాటి ముద్దు పలుకులతో వాళ్లను ఆనం దింపచేస్తూ వుంటవి. ఆ ముసలిదంపతు లిద్దరూ పూర్వం కంటే ఎక్కువ ఆనందంగా, ప్రశాంతమైన జీవితాన్ని గడుపుతూ, వాళ్ల కాలాన్ని ఈశ్వరప్రార్థనకై వినియో గిస్తున్నారు. వాళ్ల కుటీరం మార్గానికి కొంత దాపులో వున్నది; వచ్చే అతిథీ అభ్యాగతికీ ప్రతినెలా వచ్చే రూపాయలకు మించని వ్యయంతో భోజనాది సత్కా రాలు చేస్తున్నారు. అల్లుళ్లూ ఆడపిల్లలూ నెలకొక సారైనా వచ్చి చూచి పోతూవుంటారు.

# పరివర్తనం

## ౧

సాయంత్రం ఆరుగంట లయింది. ప్రపంచంలో జరుగుతూవున్న అస్పృశ్యతామహాపరాధాన్ని సహించలేక జగన్నియంత అయిన ఈశ్వరుడు ముఖం చిట్లించుకున్నాడా అన్నట్లు, ఆకాశం అంతా బీటలు వారవున్నది. రౌద్రస్ఫూర్తి చేత కన్నులు ఎర్రజేసెనా అన్నట్లు, పశ్చిమ దిశ ఎర్రబారింది. "స్వామి కోపాన్ని తీర్చడం అంటే ఎంతసేపు. కీలకం అంతా మా చేతుల్లోనే వున్నది" అన్నట్లు, పూజారి బాపనయ్యలు తాళం చేతులు బుజాలమీద వేసుకుని తొందర తొందరగా అప్పుడే గుడి తలుపులు తెరవడానికి వెళ్ళుతూ వున్నారు. మీకూ, మాకూ వున్న అడ్డుకాస్తా తొలగించి మమ్మల్ని రక్షిస్తే, దేముడు నిమిషంలో శాంతిస్తాడని గ్రామం లోకి చెప్పబోతూ వున్నట్లు మాలగూడెం నుంచి కొందరు హరిజన భిక్షుగాళ్లు అప్పుడే చందా కబళాని కని గ్రామంలోకి వడి వడిగా వెళ్ళుతూ వున్నారు.

సూరదాసు తన యింటి తలవాకిట్లోకి అంతవరకూ రెండు మూడు పర్యాయాలు వచ్చిచూచాడు. ఆవులు వచ్చేజాడా ఏమీ కనిపించ లేదు. చీకటి పడబోతూ

వున్నది. రోజూ పెందలకాడే ఇంటికి వచ్చే ఆవులు ఇంకా రాకపోవడానికి కారణం ఏమిటా అని ఆలోచిస్తూ మనసు నిలవక భార్యను పిలిచి "ఇంకా రావడం లేదు నేను వెళ్లివస్తాను" అని చెప్పి బయలుదేరాడు. ఇల్లు దాటి పొలంలో పడ్డాడు. దారికి రెండు వైపులా దట్టంగా పెరిగి పచ్చగా పైరు కనపడుతూ వున్నది. పక్షులు గూళ్లకు చేరుతూ ఆకాశంమీద కనిపిస్తున్నవి. గాలివడగలూ, దారపుఉండలూ, పట్టుకుని ఇంటికి మళ్లుతూ వున్న కుర్రవాళ్ళు ఒకళ్లిద్దరు అతనికి ఎదురుపడ్డారు. బాటవైపు చూపు దూరానికి పెట్టి చూశాడు సూరదాసు. ఎక్కడో చాలాదూరంలో తెల్లతెల్లగా కనపడ్డది. అవి తన ఆవులనుకున్నాడు. అవీ ఇతనూ నడుస్తున్నందువల్ల త్వరగానే వాటిని చేరుకున్నాడు. అవి ఎవరివో ఎడ్లు, ఇతని ఆవులు మాత్రం కావు. "అరే! ఇంకా రావడం లేదు" అనుకుని తొందర తొందరగా నడవడం ప్రారంభించాడు. నలుగురయిదుగురు స్త్రీలు నెత్తిన గడ్డితట్టలతో ఎదురుపడ్డారు. వాళ్లని "పైనఆవులు వస్తున్నయ్యమ్మా"? అని అడిగాడు. "రావడం లేదు" అని వాళ్లు చెప్పారు. దూరాన ఎక్కడో తెల్లతెల్లగా మళ్ళీ కనిపించింది. "అవి మనవని ఎట్లా" అని అనుకుంటూ నడుస్తున్నాడు. అవి సమీపమైనకొద్దీ సూరదాసు అనుమానం తీరిపోతూ వచ్చింది. ఇంకా దాదాపు ఇరవై గజాల దూరాన వుండగానే

"ఏంరా నాగయ్యా! ఇవ్వాళ్ళ ఇంత ఆలస్యం అయింది?" అని కేక వేసి అడిగాడు.
నాగయ్య "చానా తిప్పలు పెట్టేడుండీ! ఆయన మా తగనోడబ్బా!" అన్నాడు బిక్కమొగంతో.

"ఎవర్రా ఆయన! యేమి తిప్పలు పెట్టాడు ఏమిటి?" అని ఆతురతతో అన్నాడు సూరదాసు.

నాగయ్య ఆవులతో సూరదాసును సమీపించి "ఆయన, ఆయన, యర్రెంగా వుంటాడు, చూడుండి ముందు బొర్ర వుంటది. మన పొలానికి కాస్త దూరంలో చేలో తాల్లు వుండయి చూడు. ఆ పొలం ఆయన" అన్నాడు.

"ఓహో అయ్యవారా!" అని ముఖంలో భక్తిని సూచిస్తూ "ఏం జేశా రేమిటి?" అని అన్నాడు సూరదాసు.

"ఏం జేశా రేమి టుండీ. ఆలను చంపుకుతిన్నాడు. ఒక్రిని బాదినట్టు బాదాడు. ఆనోరు లేని జీవాలు అల్లాడ తంటే నాకు ఏడు పొచ్చిందుండీ" అన్నాడు నాగయ్య ఏడుపు ముఖంతో.

"ఆవులను ఎందుకు కొట్టారురా? వారు మంచివారు. అసలు కొట్టరే! వారి కమతగా డేమన్నా కొట్టాడా" అన్నాడు ఆశ్చర్యాన్ని సూచిస్తూ సూరదాసు.

"అబ్బే! లేదుండీ, జీతగా డసలికే లేడు. ఆయనే

నుండీ. దెబ్బలు వినపడి నే దగ్గిరికి వెళ్లేను. ఆవులు గట్టున గడ్డి మేత్తయిగందా అని నేను చేలో నాము కోత్తానికి ఒంగున్నా. ఇంతలోకే ఎప్పుడుపొయ్యి ఆరి పొలంలో పడ్డయ్యో నాకు తెలవదు. దెబ్బలు మోత యిని చేతులో కొడవలి అక్కడ పారేసి లగెత్తుకుని యేందో నని యెల్లానుండి. యింకేముంది ఆలను ఆయ్మైన పట్టుకుని బాత్తుండాడు. తప్పయింది ఒదిలి పెట్టుండి బాబుగోరూ! అని నేను బతిమలాడాను. ఆయనగోరు వదలనంటే వదల నని బందిలిదొడ్లో పెడతా నన్నాడు. నాకు ఏడుపు వచ్చి పెగ్గే ఏడ్చాను గూడా. ఆరికి జాలి పుట్టలేదు. నేను చేలోకి ఆలను వదిలిపెట్టా నని నోటికిరాని తిట్లు తిట్టాడు. వదిలిపెట్టమని ఆయన పాదాలమీద పడాలనుకున్నాను. అంటుకు న్నందుకు వీల్లేదు. అంచేత దగ్గిరికి పొయ్యి బతి మలాడతంటే, ఛీ యెదవా! నన్ను ముట్టుకో వత్తావా అని నన్నొక దెబ్బకూడా కొట్టేడు. నన్ను కొట్టిందానికి నాకేమీ బాదగలగ లేదుండి. ఆలను కొట్టిందానికి నేను ఏడ్చాను. యింతలోకే యెక్కడనుంచో ఒకా యన దేవుడు లాగా వచ్చాడు. నల్లగా పొడుగ్గా వుం టాడు. చేతులముందు యెండి మురుగులు వుం డయ్యి. ఆయనకి చెయ్యెత్తి దన్నం పెట్టొచ్చు. ఏదో లెండి, కురాళ్ళిడు తప్పుచేశాడు. యీ తపాకు కాపాడుండి. బాబయ్యగోరూ, అని ఆరిని బతిమలాడి వదిలిపెట్టించా

డుండీ. ఆయన యెవరో నాకు తెలవదు. మా మంచో డుండి" అని అధికారి ఎదట దోషి మాట్లాడి నట్లు మాట్లాడుతూ నడుస్తున్నాడు భయంతో సూరదాసు ఏమన్నా అంటా డని నాగయ్య.

"మాధవాచార్యులవారు గొప్ప పండితులు, ఉత్త ములు, అంత యిబ్బంది పెట్టరే! వారి చేలోకి ఆవులను పోనివ్వడం ముందు తప్పు నీది. వారిపైరు నష్టం చేయటం వల్ల కోపించి కొట్టడంలో వారి తప్పేముంది?" అన్నాడు సాభిప్రాయంగా సూరదాసు.

"అవును ముందు నాదే తప్పయింది" అన్నాడు నాగయ్య కేసు కొట్టివేయబడ్డ ముద్దాయివలె ముఖం పెట్టి.

ఇంతలో ఇల్లు చేరారు. నాగయ్య నెత్తిమీద నాముమోపు అరుగుమీద పడవేసి, ఆవులను చావట్లోకి తోలుక వెళ్ళాడు. సూరదాసు గూడా చావట్లోకి వెళ్లాడు. రెండు ఆవులూ గాటనిల్చి మేత మెయ్యకుండా అట్లాగే వున్నవి. తమని రక్షించ మన్నట్టు తలలు వంచి సూరదాసు వైపు వచ్చినవి. భార్యా దీపం తీసుకుని రాగా ఆవులను పరీక్షించాడు. వాటి వళ్లు దున్నిన ఎర్రమట్టి నేలలాగా ఉన్నది. నిలువునా నీరై పొయ్యాడు. తన దైవ సమానంగా చూచుకుంటూ, పూజిస్తూ వున్న ఆ గోమాతలు ఆ స్థితిలో వుండటం చూచి కంట తడిపెట్టాడు.

వ్యత్యాసాలు

"ఎవడండీ కొట్టింది? ఆడి చేతులు పడిపోను! విల్లా జెల్లా వున్నోడేనా" అని భార్యా ఏవేవో అనబోతూ వుంటే భార్యా నోరు మూసి "అట్లనబోకు. అయ్యావారు! తప్పంతా మనది. వారిని దూషించటంవల్ల మనకు పాపం వస్తుంది అన్నాడు అమాయికంగా. మామూలు ప్రకారం భార్యా కుండతో వేన్నీళ్లు తెచ్చింది. నాగయ్యా ఆవులను చావట్లోనుంచి ఇవతలకు తీసుకుని వచ్చాడు. సూరదాసు చెంబుతో నీళ్ళు ముంచి, ఆవులను సుబ్రంగా కడిగాడు. కడుగుతూ వుండగా దద్దుర్లు తేలి చేతికి తగిలిన వాతలవల్ల, ఆవుల వంటిమీదపోసిన నీరు కిందికి కారినట్టే సూరదాసు కంటినీరు కూడా విస్తారంగా కారింది. తరవాత పాడిగుడ్డతో చర్మం చిట్లి రక్తం స్రవిస్తున్న చోట్లల్లా అద్ది, వాటికి కొబ్బరి నూనె పూశాడు. ఆరోజతనికి ఆవులను వదిలి ఇంట్లోకి పో బుద్ధి కాలేదు. గంట కాలేదు అప్పుడే రెండుమూడు సార్లు కొబ్బరినూనె మళ్లామళ్ళా రాశాడు. గాట్లో నలిగిన చెత్త తీసివేసి, పొలంనుంచి తెచ్చిన నాము తీసుకుని వచ్చి వేశాడు. వాటి తలలమీద చెయ్యివేసి దువ్వాడు. వాటి రెండుమూతులూ ఇతని పొట్టకు చేర్చి బాధను సూచించినవి. అప్పుడు మరింత దుఃఖపడ్డాడు. అతని కళ్ళవెంట రెండు అశ్రుబిందువులు రాలి వాటి తలల మీద పడినవి. మూతిన చొంగ మొదలయినవి గుడ్డతో

పసిపిల్లలకు తుడిచినట్టు తుడిచాడు. కొద్ది కొద్దిగా మేత తినడం ప్రారంభించినవి. సూరదాసు ఆనందించాడు. రాత్రి తొమ్మిది గంట లయింది.

భార్యా "అన్నం తిందురుగాని రాండి" అని పిలిచింది. "నా కాకలిగా లేదు. నాగయ్యకు పెట్టి నువ్వింత తిను. తర్వాత నేను తింటే తింటాను" అన్నాడు సూరదాసు. భర్తకంటే ముందుతినే ఆచారం పిచ్చమ్మకు లేదు. నాగయ్యకు భోజనం పెట్టి భర్తవద్దకు వచ్చింది. గాట్లో మేతంతా తిని రెండు ఆవులూ పండుకుని చక్కగా నోరు ఆడించుకుంటూ నెమరు వేస్తుంటే సూరదాసు చూచి ప్రసిద్ధగాయకుని గానం విని పొందినంత సంతోషాన్ని పొందాడు. భార్య భోజనానికి రమ్మని తొందర చేయటంవల్లా, ఆవులు కులాసాగా వున్నందువల్లా భోజనానికి లేచాడు.

౨

సూరదాసు మాల దాసరి. యాభైఏళ్ళ నడికారు మనిషి. చామన చాయవాడు. ఎప్పుడూ నవ్వుతూ వుండే ఆ ముఖం, శాంతం అయిన చూపులూ, మాటల ధోరణీ, చూస్తే అతని సత్వగుణాన్ని క్షణ క్షణం తెలియజేస్తూ వుంటవి. వాళ్ళ కుటుంబీకు లందరూ కొద్దో గొప్పో చదువుకున్న వాళ్లు. అతనివద్ద ప్రతిపదార్థం చెప్పగల

పాండిత్యం లేకపోయినా ఏదన్నా పద్యం చదివితే దాని భావాన్ని గ్రహించుకునే తెలివి మాత్రం వున్నది. భగవద్గీత శ్లోకం భావం తెలియక పోయినా తాత్ప ర్యాన్ని బట్టి అర్థం చేసుకునే ఆధ్యాత్మికజ్ఞానం అతని! వున్నది. పెద్ద పెద్ద అక్షరాలతో బొమ్మలతో ముద్రించిన . పెద్ద వెడల్పు అట్ట బయిండ్లుగల, రామాయణం, భాగవతం, భగవద్గీత, ఈ మూడు పుస్తకాలూ వాళ్ళ తాతలనాటి నుంచీ వాళ్ల ఇంట్లో వున్నవి. వాటిని అతడు ఉదయ సాయంత్రాలలో తీరినప్పుడు పారాయణ చేస్తూ వుంటాడు. గూడెంలో వున్న వాళ్లలో ధనవంతుడైన రామస్వామీ, గూడా నికి పెత్తనదారు సోమన్నా, ఇంకా చిన్నా పెద్దా వినే టందుకు అప్పు డప్పుడూ వస్తారు. వాళ్ళు అడిగే అడ్డ దిడ్డపు ప్రశ్నలకు సూరదాసు విసుక్కోకుండా బాగా అర్థ మయ్యేటట్లు విప్పిచెప్పి, వాళ్ళని సంతోష పరుస్తాడు. అతనికి సంగీతజ్ఞానం కూడా కొంత వున్నది. ప్రార్థన కీర్త నలూ, మంచి మంచి తత్వాలూ, ఏవేవో చాలాఅతనికి వ స్తవి.పూర్ణమైన అమాయకుడు. అంటే తెలివితక్కువ వాడని కాదు. ఆ తెలివిలోగూడా లోకులకొంపలు ముంచే తెలివి అతని దగ్గిర ఏమీ లేదన్నమాట. పితార్జిత మైన రేగడ భూమి కొద్దిగా వున్నది. దాని తోనే తృప్తిపడి అందులో కాస్తో కూస్తో వస్తే జీవనం

చేస్తున్నాడు. వాళ్ళ వంశవృత్తి అయిన యాచన నీచమని వదులుకున్నాడు. మగపిల్లవాడూ, ఆడపిల్లా అతని సంతానం. ప్రతినిత్యం వేకువఝామునే కేశవ నామాలతో నిద్ర లేస్తాడు. తన ఇంటివెనక బావివద్ద స్నానం చేసి ఉతికిన ధోవతి కట్టుకుంటాడు. తిరుమణి పెట్టె భార్య అందివ్వగా పీటమీద కూర్చుని నామాలు చక్కగా దిద్దుతూ వుంటే భార్యా చేలాంతరు తీసుకుని పోయి పెరట్లో ఏవో పువ్వులు కాసిని పూజనిమిత్తం కోసుకు వస్తుంది. నామాలు పూర్తిచేసి సూరదాసు "గోవిందా" అనుకుంటూ లేస్తాడు. ప్రార్థనగదికి వెళ్లుతాడు. కొంతసేపు పుష్పాలతో దేవుని పూజిస్తాడు. తంబురా, చిరుతలూ, చేత బుచ్చుకుని తనకుల దైవమైన రాముని గూర్చి, స్వామిపటానికి ఎదురుగా నిలుచుని తనకు వచ్చిన ఏదో కీర్తన పాడుతూ, నృత్యం చేస్తూ, భక్తిలో తన్మయుడౌతాడు. అలా ఒకగంటకు భజన పూర్తిచేసి ఇవతలకు వస్తాడు. సూర్యభగవానుడు మత్తెక్కిన ధనవంతులను నిద్ర లేపటానికి తన కిరణజాలాన్ని ఏ కిటికీ సందులనుంచో ఏ యింటి పెంకుల సందులనుంచో లోకం మీదికి అప్పుడే పంపుతూ వుంటాడు. సూరదాసు కనబడే సూర్యుడికి భక్తితో నమస్కరిస్తాడు. పని వుంటే పొలం వెళ్లుతాడు. లేకపోతే పైన మూడు పుస్తకాల్లో ఒకటి ముందు వేసుకుని పారాయణ చేస్తాడు. పన్నెం

డింటికి భోజనం, తర్వాత విశ్రాంతి, సాయంత్రం నాలుగు గంటలు మొదలు ఆరుగంటలవరకూ గ్రంథపఠనం, రాత్రి ఏడింటికి భోజనం, ఎనిమిదింటికి పడకా, ఇదీ అతని సామాన్య దినచర్య.

ఇక అతని భార్యా పిచ్చమ్మ భర్తతో పాటు నిద్ర లేస్తుంది. భర్త పాదాలకి నమస్కరిస్తుంది. కాల కృత్యాలు నిర్వర్తించుకున్నాక ఉతికిన చీర కట్టుకుంటుంది. నున్నగా తలదువ్వుకుంటుంది. దొడ్లో చెట్లవి ఏవో రెండు పూలు కొప్పులో పెట్టుకుంటుంది. నొసట చేరెడు కుంకుమబొట్టు పెట్టుకుంటుంది. భర్తకు పూజా పరికరా లందిస్తూ వుంటుంది. పూజ అయిన పిమ్మట వంట పనిలోకి దిగుతుంది.

ఒకనాటి సాయంత్రం సూరదాసు భగవద్గీత చదువుతూ వుండగా అక్కడికి సోమన్నా, రామస్వామీ, ఇద్దరూ వచ్చారు. కూర్చోమని చాప పరిచాడు. వాళ్లు కూర్చున్నారు. "నిన్న జరిగిన సంగతి విన్నారా" అని సూరదాసుతో వాళ్ళు అన్నారు. సూరదాసు పుస్తకం మూసి "ఏమిటా సంగతి?" అన్నాడు.

సోమన్న ఇట్లా అన్నాడు. "బజారులో సీతారామస్వామివారి గుడివద్ద నాలుగైదు రోజుల నుంచీ భగవద్గీత పురాణం చెప్తున్నారు. తమరు విన్నారా?"

"అవును. ఈ వూరి వైశ్యులు చెప్పిస్తూ వున్నట్టూ,

మాధవాచార్యులవారు చెప్తుతూ వున్నట్టూ విన్నాను,"
అన్నాడు సూరదాసు.

"నిన్నటిరాత్రి నేనూ మాకోటప్పా పైనించి వస్తూ ఏదో చెప్తున్నారని అక్కడ నిలబడ్డాము. మీరు దీనిని వినరాదు, పో పొండి అని చదువుతూ వున్న మాధవాచార్యులవారు పెద్ద కేకవేశారు. వింటే ఏ మున్నదండీ, కాస్సేపు వినిపోతాము బాబయ్యగారూ అని నేనన్నాను. ఆ జనంలో నుంచి చరుగ్గిన ఒక ఆయన అవాయిచువ్వ లాగా లేచి చెప్తుంటే మీకు బుద్ధిలేదూ! వెళ్ళిపోండి! అని మా మీదికి వచ్చాడు. అప్పుడు నాకు చచ్చినట్ట యింది. మారుమాట్లాడకుండా ఆ పరాభవం మనస్సును దహిస్తూ వుండగా ఇంటికి వచ్చాము. చూచారా మన హీనస్థితి! అక్కడ వినేందుకు వచ్చిన వారిలో కుక్కలను గూడా గొలుసులతో వెంటబెట్టుకుని వచ్చారు కొందరు. కుక్కలనైనా చేరనిచ్చారుగాని మనుష్యులమైన మనలను చేరనివ్వ లేదు. మన బతుకులు జ్ఞానం లేని కుక్కలకంటే హీనమై పోయినవి! బజారులో కుక్కలూ, పందులూ, మొద లయిన ఎన్ని జీవరాసులు తిరుగుతూ ఉండడంలేదు? మనం మాత్రిం వారు నలుగురు కూర్చున్న చోట తిరగరాదు. అక్కడ నిల్చోరాదు. ఈ అన్యాయం ఎప్పుడు తొలిగిపోతుందో అన్నాడు సోమన్న దీనంగా.

"ఇప్పుడు కొత్త ఏమి వచ్చింది సోమన్నగారూ

మొదటినుంచీ జరుగుతూ వున్న విషయమే గదా ఇది ? మనలను వారు కాదనుకున్నప్పుడు అక్కడ నిల్చోవడం మనదే తప్పు" అన్నాడు సూరదాసు.

"మీరెప్పుడూ ఇట్లాగే మనదే తప్పని చెప్తూ ఉంటారు" అన్నాడు సోమన్న.

"మీరు రేపటినుంచీ భగవద్గీత మాకు పురాణంగా చెప్పి వినిపించాలి" అన్నాడు రామస్వామి.

"వినిపించే దేముందీ ? మీ రప్పుడప్పుడూ వింటూనే వున్నారుగదా?" అన్నాడు సూరదాసు.

"అబ్బే ! అట్లా వినడం కాదు. ప్రతినిత్యం రాత్రిళ్లు మీ వీధి అరుగుపైన కూర్చుని పురాణంగా చెప్పాలి" అన్నాడు రామస్వామి.

"అలా చెప్పటం నాచేతకాదు"అన్నాడు సూరదాసు.

"ఈ విషయంలో మనం వెనకాడకుండా మనకు వాళ్ళు చేసిన పరాభవానికి ఇట్లా చేస్తే కుక్క కాటుకు చెప్పుదెబ్బ" అన్నాడు తీవ్రంగా సోమన్న.

"అబ్బే ! అట్లా మనం చెయ్యడం తప్పుగా ఉంటుంది. వారట్లా చేశారని మనంచేస్తే వారికి చాలా కష్టంగా వుంటుంది" అన్నాడు సూరదాసు.

"వారికి కష్టంగా వుంటుం దని మమ్మల్ని తలకాయలు వంచుకుని తిరగ మన్నారా?" అన్నాడు చురుకుగా సోమన్న.

సూరదాసు ఏమీ మాట్లాడలేదు. సోమన్నా, రామస్వామీ, ఇద్దరూ ఎక్కువబలవంతం చెయ్యడం వల్ల "సరే ఇంట్లో చదివేదే బయటకూర్చునే చదువుతాను" అనుకుని సూరదాసు ఆఖరికి ఒప్పుకున్నాడు. ఆ తెల్లవారి శుద్ధ ఏకాదశి. మంచిరోజవటం వల్ల పురాణం ప్రారంభించారు. అయి దారురోజుల కల్లా, చుట్టుపక్కల ఉన్న మాలగూడాలకు సూరదాసు పురాణం చెవుతున్నాడని తెలిసింది. వాళ్ళంతా ఈ శుభవార్త విని సంతోషంతో టెంకాయలూ, పండ్లూ, కర్పూరం, తే మొదలు పెట్టారు. వారం రోజులు జరిగే టప్పటికి ప్రతిరోజూ ఆ బాజా రంతా జనంతో నిండి పోతూ ఉన్నది. అక్కడ పందిరిగూడా వేశారు. సూరదాసు మెడలో పుష్పహారాలు వేసేవారూ, పండ్లు సమర్పించేవారూ, కానుకలు సమర్పించేవారూ, ప్రతిరోజూ అదో వైభవంగా జరగడం ప్రారంభించింది. సూరదాసు ఇట్లా ఆడంబరంగా జరుగుతుందని కల్లో నైనా అనుకో లేదు.

## 3

మాధవాచార్యులవారు గొప్ప పండితులు. వేద వేదాంత పురాణేతిహాసాలను చక్కగా చదివినవారు. ఎర్రగా లావుగా వుంటారు. యాభై ఏళ్ళ పైగా అవనై

ఏళ్ళ లోపుగా వయస్సు వుంటుంది. కొంత ధనం వారి దగ్గిర నిల్వ వున్నదని గ్రామంలో వదంతి. సాలుకు వెయ్యి రూపాయలు వచ్చే స్తిరాస్తి వున్నది. వారికి తాళ్లు చాలా వున్నవి. వాట్లలో కొన్ని గీతకు ఇచ్చి నందువల్లా, ఆకులవల్లా, ఏడాదికి రెండు మూడు వందలు వస్తవి. ఆ వూరి సీతారామస్వామివారి దేవాలయంలో స్థానాచార్య పదవియందున్నారు. సంవత్సరానికి బహుమాన రూపకంగా కొంత ముట్టుతుంది. ఇద్దరు ఆడ పిల్లలూ, ఇద్దరు మగపిల్లలూ, సంతానం. వారి పెద్దబ్బాయి రాధాకృష్ణాచార్యులు బి. ఏ. చదివి గుంటూరులో మిషనరీ స్కూల్లో ఉపాధ్యాయపదవియందున్నారు. నెలకు అరవయి రూపాయలు జీతం.

ఒకనాటి ఉదయం హరిశివయ్యగారు వారి ఇంటికి వచ్చాడు. వీరు ఆచార్యులవారి ఇంటికి అప్పుడప్పుడూ వచ్చి పోతూ వుంటారు. దాదాపు నలభై ఏళ్ళు ఉంటవి. నల్లని ఘట్టి విగ్రహం. మంచి ఆస్తిపరుడు, గొప్ప రైతు. ఆ గ్రామంలో ముప్పాతికవంతు వీరి సంఘమే అవటం వల్ల వీరికి మంచి పలుకుబడి ఉన్నది. పూర్వం ఎప్పుడో కొన్నాళ్ళు వారి దగ్గిర కుమార సంభవం పాఠం చెప్పుకున్నారు. అప్పటినుంచీ వారికీ వీరికీ చాలా పరిచయం ఏర్పడ్డది.

వచ్చినవారిని చూచి మాధవాచార్యులవారు కూర్చో

మని ఇట్లా అన్నారు. "ఏం పొయ్యేకాలం వచ్చిందో గాని చూచారా! సూరదాసుగాడు పాట్లో భగవద్గీత చెపుతూ వున్నా డట"

"అవును నేనుగూడా విన్నాను. మొన్న పురాణం దగ్గిరికి వాళ్ళు వినడానికి వస్తే వెళ్ళగొట్టారు గదా. అందుకు వాళ్ళు ఈ పన్నాగం పన్నా రని అనుకుంటాను" అన్నాడు హరిశివయ్య.

నోటిమీద చెయ్యివేసుకుని "అయ్యయ్యో! మాలవాడు, వాడు ఆ పుస్తకాన్ని ముట్టుకునేందుకైనా ఆఖరుకు దాని పేరు వినేందుకైనా హక్కున్నదా? అయిదో వేదంగదా అది! వాళ్ళట్లా పిచ్చుటిల్లితే బ్రిహ్మత్యాం చేత పుట్టిన మేము ఈ గ్రామంలో నిలవ గలమా? అయ్యో! అంతా అగాయిత్యం! ఎక్కడున్నాడయ్యా ఆ నల్లనివాడు దొంగముండాకొడుకు! రాడేమయ్యా దుష్టజన శిక్షణానికి! అయినా దానిలోది ఒక అక్షరం అయినా తిన్నగా పలకడం చేతవుతుందా వాడికి? చూచారా నేనిక్కడ చెప్పటం, నాకు పోటీగా మాల వెధవ అక్కడ చెప్పటం, ఎంత పరాభవం! ఈ సమయంలో మీరు చూస్తూ ఊరుకుంటేకాదు" అన్నాడు ఆచార్యులవారు.

"నన్నేం చెయ్య మన్నారు" అన్నాడు హరిశివయ్య. "మీ నలుగురూ వాడు చదవ గూడదని పట్టు పట్టాలి.

గ్రామం అంతా మీచేతుల్లో ఉన్నది. ఈ సమయంలో మీరు కాస్త నాకు సహాయం చేస్తే మీ మేలు ఈ జన్మలో మరిచిపోను" అన్నాడు ఆచార్యులవారు.

"చెప్పండి నాచేతనైన సహాయం చేస్తాను" అన్నాడు హరిశివయ్యగారు.

"చదవకూడదని చెప్పటమే గాదు వాళ్ళకు తగ్గ పరాభవం చెయ్యాలి. అప్పుడుగాని నామనస్సు శాంతించదు" అన్నాడు ఆచార్యులవారు.

"ఎట్లా చెయ్యాలని?" అన్నాడు హరిశివయ్యగారు.

"అట్లా అడగండి, చెపుతా, వినండి. వాడు రాత్రి చదువుతూ ఉండగా మనం పోయి అంతజనంలో పుస్తకాన్ని మన వశం చేసుకోవాలి. తల వాచేట్లు చీవాట్లు వెయ్యాలి. ఘట్టి పరాభవం చెయ్యాలి. అట్లా చేస్తే వాడు చచ్చిందాకా ఆ పుస్తకాన్ని మళ్ళీ ముట్టుకోడు. మీ సహాయం వుంటే వాళ్ళేమీ చెయ్య లేరు. అంతవరకు నాకు బాగా తెలుసు, మీ దయవుంటే చాలు" అన్నాడు ఆచార్యులవారు.

హరిశివయ్యగారికి ఇతర కులాలు ఎక్కిరావడమంటే మొదటినుంచీ అసలే గిట్టదు. ఇట్లా అన్నాడు. "మీరంత ఇదిగా మాట్లాడవద్దు స్వామీ! మీరు కోరిన సహాయం నే చేస్తాను. అలగా కులాలను పైకి ఎక్కించుకుంటే రేపు మనమాట వింటారా?"

"ఆఁ అదీ. తెలిసిన వాళ్లకు నేను ఎక్కువగా చెప్పాలా? ఇప్పుడు మనం ఉపేక్షించి ఊరుకున్నా మంటే రేపు నన్ను వేదం పాఠం చెప్ప మంటారు. మన అలుసు కనుక్కొని ఎల్లుండి మన ఇళ్లల్లోకి కూడా వచ్చి కూర్చుంటారు. అప్పుడు మనం ఏమి చెయ్యగలం? లేతలో వున్నప్పుడు తుంచి వేస్తేనే మంచిది. చెట్టు ముదిరితే గొడ్డళ్లు కావాలి" అన్నాడు ఆచార్యులవారు.

"నిజమే, తగ్గపని చెయ్యాలి. ఇవ్వాళ్ల మాదయింది, రేపు మాదవుతుంది. మనం అక్కడికి ఇవ్వాళ్ల పోదాం" అన్నాడు హరిశివయ్యగారు.

"మావాళ్ళ నలుగురితో చెప్పుతాను. మీరు ఎవ్వా రెవ్వరికి చెప్పాలో చెప్పి సిద్ధం చెయ్యండి. తప్పక ఇవ్వాళ్ళ పోవాలి" అన్నాడు వికసించిన ముఖంతో ఆచార్యులవారు.

"ఇక మీరు చెప్ప పని లేదు" అన్నాడు హరిశివయ్య.

రాత్రి ఎనిమిది గంట లయింది. మాలగూడెంలో సూరదాసు ఇంటిముందర పందిట్లో జనం క్రిక్కిరిసి ఉన్నారు. సూరదాసు భగవద్గీత చదువుతూ ఉన్నాడు. ఒక శ్లోకం చదివి పండితులు విద్య, ఉపశమముగల బ్రాహ్మణునీ, గోవునూ, ఏనుగునూ, కుక్కనూ, చండా లునీ, సమానముగా జూతురు, అని శ్లోక తాత్పర్యాన్ని చెపుతూ వున్నాడు, ఇంతలోకే మాధవాచార్యులవారూ,

హారిశివయ్యగారూ, వెంట పదిమందితో అక్కడికి వచ్చారు. ఆచార్యులవారిని సూరదాసు ముందు చూచాడు. ఆశ్చర్యం, భయం ఒక్కమారుగా అతనికి ఉదయించినవి. సిస్తు చెల్లించని రైతు పరివారంతో యముడి లాగా తన ఇంటికి వచ్చిన మునసబును చూచి నట్టయింది అతని పని. లేచినిలవబడి రెండుచేతులూ ఎత్తి నమస్కరించాడు. నోటవేమీ మాట రాలేదు. కట్టె బారిపొయ్యాడు. మెడలో పుష్పమాలలతో ఉన్న సూరదాసుని చూస్తే ఆచార్యులవారికి ఒళ్లు భగ్గున మండి పోయింది. చేత్తో పట్టుకుని పురుగును నులిపినట్లు నులిపి వేద్దామన్నంత ఆగ్రహం జనించింది. ఆ జనాన్ని చూచి జంకాడు గానీ లేకపోతే ఆ కోపానికి సూరదాసు బుర్ర ఒక్కదెబ్బకు పగిలి ఉండేది.

"ఛా వెధవా! ధర్మం తప్పి నడుస్తావా? కళ్లు పై కెక్కినవా నీకు? ఆ పుస్తకాన్ని ముట్టుకున్నేందుకు అర్హుడవేనా? మాంసం తిని, తప్పతాగి అనేక నీచకార్యాలుచేసే గాడిదెవు. మమ్మల్ని ఇంత పరాభవం చెయ్యడానికి పూనుకుంటావా? మిమ్మల్ని హద్దించే వాళ్లు లేరనా ఇంత దుర్మార్గం చెయ్యడం? ఇట్లా చేసి ఈ వూళ్ళో బతకాలనేనా" అని పెద్ద గొంతుతో పందిరి లేచి పొయ్యేటట్టు కేకలు వేసి, చేతులో ఉన్న కర్రతో ఆ పుస్తకాన్ని లాక్కుని "ఈ రోజు మొదలు చేసుకుని ఇటువంటి

పని పెట్టుకున్నావా నీ మర్యాదా దక్కదు. జాగ్రత్తగా బతుకు! ఎవడో పిచ్చి పుల్లాయ అనుకున్నావేమో॰ అన్నాడు తీవ్రంగా ఆచార్యులవారు.

ఇది చూచి కూర్చున్న జనం అంతా గల్లంతుగా లేచారు. అందులో కొందరు కర్రలతో రౌద్రావేశులై ఆచార్యులవారి మీదికి వచ్చారు. ఇక ఊరుకుంటే ముదిరిపోతుం దని సూరదాసు వాళ్ళకు అడ్డం వచ్చి శాంతింప జేసి "తప్పు తప్పు, మీరింత తొందరపడ కూడదు" అని వారిని మందలించి ఆపివేశాడు.

లేకపోతే ఆచార్యులవారి బుర్ర సహస్రవక్కలై ఉండేది. హరిశివయ్యగారు ఏమీ మాట్లాడ లేదు. అందరి పాళ్ళూ ఆచార్యులవారే తీసుకున్నారు.

ఆచార్యులవారు ఇంటికివచ్చి, ఆ గడ్డ తొక్కిన దోషానికి ఓ వందబిందెలు స్నానం చేసి పుస్తకాన్ని పసుపునీళ్ళతో శుద్ధి పరిచి, సంతృప్తి పడ్డాడు. ఆ రాత్రి వారికి చాలా హాయిగా నిద్రపట్టింది.

## ౪

తెల్లవారి సూరదాసు ఇంటికి రామస్వామి మొదలైనవాళ్లు వెళ్ళారు. రాత్రి జరిగిన ప్రతిఘటనాన్ని గురించి ఇట్లా అన్నారు.

వ్యాసాలు

"ఒక్క పరాభవమే అనుకుంటే దానికి వెయ్యి ఇంతలుగా రెండోది గూడా జరిగింది. ఇప్పుడు మనం ఊరుకుంటే రేపు ఇళ్ళల్లోకి వచ్చి గూడా తన్నిపోతారు. తగ్గపనన్నా చెయ్యాలి, లేదా ఈ వూరన్నా వదిలిపెట్టి పోవాలి" అని ఒకరూ, "రాత్రికి మనంగూడా ఆయన ఇంట్లో జొరబడి మన పుస్తకం మనం తెచ్చుకుంటే సరిపోతుంది" అని ఒకరూ, "కాదు దొమ్మీ క్రింద కేసు పెడదాం" అని ఒకరూ, తలోమాటా అన్నారు. రామస్వామి అన్నకుమారుడు జాలయ్య బలిష్ఠమైన మనిషి. కసరతు చేసి కండెలు కట్టిన శరీరం. అతడు రొమ్ము చరుచుకుంటూ "నాకు ఆజ్ఞ ఇవ్వండి. క్షణంలో ఆ బ్రాహ్మణ్ణి కట్టకట్టి బుజాన వేసుకుని ఖూకు వప్ప గిస్తాను" అన్నాడు కురత్రితనంగా సేనముందుకు వచ్చి నిలిచిన వానరవీరుడిలాగా ఆ జనం ముందుకు వచ్చి.

సూరదాసు విని విని అన్నాడు. "మీ రట్లా తీవ్రపడితే ఏమీ ప్రయోజనం లేదు. వారి మీద మనం పగ తీర్చుకోవాలంటే మనగ చెయ్యవలసిన పని వేరే ఉన్నది. వారి మీద మళ్లీ తిరగ బడడం కాదు. మనలో ఉన్న జంతుహింస మొదలైన చెడుగులను మాని సత్ప్రవర్తన గలిగి ఉండాలి. అట్లా ఎప్పుడు ఉండ గలిగామో అప్పుడు మనం వారి మీద పగ సాధించిన వాళ్లమే అవుతూ వున్నాము. దుష్టకార్యాలు చేస్తున్నంతవరకూ

మనం అందరికీ లొంగివుండవలసిందే. అసత్యవర్తను డైన మనుష్యుడు అందరికీ లోబడి వుండవలసిందే గదా. సత్య వర్తనుడు ఎవ్వరికీ లొంగ పనిలేదు. ఇప్పుడు మనం శాంతం వహించటం కంటే చెయ్యవలసిన పని రెండోది లేదు. మనం వారివల్ల పడే ఇబ్బందులన్నీ సహనంతో ఓర్చుకున్న ట్లయితే ప్రస్తుతం కాక పోయినా కొంత కాలానికైనా అంతకు రెండింతలు వారివల్ల మనకు మేలు కలిగి తీరుతుంది. మనం ఏ కార్యం చేసినా అర్హుల మని రుజువు చేసుకోతగ్గ నియమాలను పాటించి ఉండాలి. లేక పోతే ఈ వెర్రి వెర్రి పోకడలవల్ల లాభం లేదు" అన్నాడు శాంతంగా. దానికి జవాబు ఎవ్వరూ చెప్ప లేదు. శాంతించి ఎవ రిళ్లకు వాళ్లు వెళ్లి పోయ్యారు.

ఒకనాడు ఉదయం రాధాకృష్ణాచార్యులవారూ, ఫాదిరీగారూ, కారుమీద మాలగూడెం వచ్చారు. రామస్వామి ఇంటిముందు కారు ఆపి ఇంట్లోకి వెళ్లారు. రామస్వామి వీరి ఇద్దరినీ చూచి ఏం కొంప మునిగిందో నని గాభరా పడుతూ పైకి కనపడనియ్యకుండా నమ స్కారం చేసి కూర్చో బెట్టాడు. రాధాకృష్ణాచార్యుల వారు అన్నాడు. "వీరు ప్రస్తుతం గుంటూరు ఫాదిరీగారు. చాలా మంచివారు. చదువుల బడి లేక ఇబ్బందిపడుతూ ఉన్న మీ గూడెంలో స్కూలు పెట్టించటానికై వచ్చారు. మీబోటి పతిత కులాలను పైకి తెచ్చేందుకు. దొరవారు

కంకణం కట్టుకున్నారు. ఈ అదను పోగొట్టుకోకుండా అందుకు తగ్గ ప్రియత్నం చేసుకోండి."

"చిత్తం. అయ్యగారికి మాయందు అలాంటి దయ వస్తే మేము ఒద్దంటామా" అన్నాడు మందహాసం చేస్తూ రామస్వామి.

"మాకు చాలా పని ఉంది. వెళ్ళుతాము. నలుగురినీ పిలిచి ఆలోచించు. మీకు విస్తారం ఖర్చుగూడా ఉండదు. కొద్దిలో పెద్దు వేసుకుంటే తతిమ్మాది అంతా వీరే భరిస్తారు" అన్నాడు రాధాకృష్ణాచార్యులవారు.

ఆ గూడెంలో రకరకాల జంతువుల అరుపులు అరిచే హరిజనుడు ఒక డున్నాడు. అతడు చెట్టుకింద కూర్చుని చిన్నా పెద్దా నలుగురూ చుట్టుకోగా వాళ్లు కోరిన అరుపులు అరిచి వినిపిస్తున్నాడు. కొంతదూరంలో ఉన్న ఫాదిరీ దొరగారికి గుర్రిపు సకిలింపు వినిపించింది. ఘోడా అంటే పంచప్రాణాలూ విడిచే ఆ దొరగారికి మంచి అరేబియా గుర్రిం సకిలింతలాగా వినబడి కారు ఎక్కడివా డల్లా ఆగి ధ్వని వచ్చిన వైపు చూచాడు. ఆయన అనుకున్నట్లు గుర్రిం ఏమీ కనుపించలేదు. జనం మాత్రిం మూగి కనపడ్డారు. "ఇక్కడ గుర్రిం అరిచింది ఎక్కడ" అని రాధాకృష్ణాచార్యులవారిని అడిగాడు. అందుకు రామస్వామి అందుకుని "గుర్రిం కాదండీ, అయ్యా. మనిషే అలా అరుస్తున్నాడు" అని చెప్పాడు.

మనిషి ఇలా అరవడం దొరగారు అసలే విని లేరు. ఆ మాటలకు చాలా ఆశ్చర్యపడి ఆ మనిషిని పిలిపించాడు. అతడు తనకు వచ్చిన అన్ని జంతువుల అరుపులూ అరిచి తన విద్యానిపుణత్వం అంతా దొర గారి ఎదట చూపించాడు. ఆయన చాలా సంతోషించి ఆ విచిత్ర వ్యక్తి ఆయా జంతు కోశాలతో పుట్టాడేమో నని తలచి, ఏ డాక్టరుచేతనైనా అతని పొట్టను ఎక్సరే పరీక్ష చేయిద్దామనుకున్నాడు. వెంటనే పరుసులోనుంచి ఒక కాగితంతీసి ఆవ్యక్తికి బహుమానం చేశాడు. వాడది చూచుకుంటే రాజుగారి పదిరూపాయిలనోటు అయింది. జన్మలో ఎరగని ఈ బహుమానానికి అతడు సంతోషాతి శయాలతో ఉబ్బిగంతులు వేశాడు.

ఇద్దరూ కారులో కూర్చున్నారు, కారు నడుస్తూ ఉన్నది. "ఈ గూడెంలో క్రైస్తవ మతస్థులు ఇప్పుడు ఎంతమంది ఉన్నారు." అని ఫాదిరీగారు అడిగారు.

"పూర్వం పది పదిహేనుగురు ఉండేవాళ్ళు. సూర దాసు అనే వాడొకడు ఈ గూడెంలో ఉన్నాడు. హిందూమతం అంటే పడిచస్తాడు. చాలావరకు మతం తీసుకున్న వాళ్ళను వాళ్ళ మనస్సులు తిప్పి దీనిలో మళ్ళీ కలిపాడు. ఏమన్నా ఒకరో ఇద్దరో మిగిలి ఉన్నారేమో తెలియదు" అన్నాడు రాధాకృష్ణాచార్యులు.

కారు వచ్చి మాధవాచార్యులవారిఇంటిముందు ఆగింది.

ఇద్దరూ ఇంట్లోకి పొయ్యారు. కుర్చీమీద కూర్చున్న మా ధవాచార్యులవారు లేచి ఫాదిరీగారికి కుర్చీయిచ్చారు. కాఫీ మొదలయినవి ఇచ్చి మర్యాద చేశారు. ఆచార్యులవారు గౌరవ సూచకంగా "మీ రాకవల్ల మా గృహం పావన మైంది" అన్నారు. వారి ఇల్లంతా వారికి చూపించారు. "ఆ బొమ్మ లేమిటి?" అని ఫాదిరీగారు ప్రశ్నించారు. "మా దేవుని విగ్రహాలు, మా పూర్వులు సంపాదించినవి. ఇది పూజా మందిరం" అని చెప్పారు ఆచార్యులవారు. ఫాదిరీగారు ఆ శిల్ప నైపుణ్యానికి చాలా అచ్చెరువు పడ్డారు. మళ్లీ ఇద్దరూ కారు ఎక్కారు. ఆచార్యులవారు కొంతవరకు వారిని సాగ నంపి "ఇక ఉంటా నండి" అని నమస్కారం పెట్టి వెనకకు తిరిగారు.

సూరదాసు ఇంటిపక్కన ఒక వల్లమానిన మర్రిచెట్టు ఉన్నది. ఎప్పుడూ చల్లని నీడలు తేలుతూ ఉంటుంది. ఒకనాటి మధ్యాహ్నం రామస్వామి సోమన్నలు ఆ చెట్టుకింద కూర్చుని ఏదో మాట్లాడుతూ ఉండగా, సూరదాసు భోజనంచేసి చెయ్యి తుడుచుకుంటూ వాకిట్లోకి వచ్చాడు. రామస్వామి ఆయన్ని పిలిచాడు. సూరదాసు వెళ్ళి వాళ్ళ దగ్గిర కూర్చుని "ఏమిటి మాట్లాడు తున్నారు" అన్నాడు.

"నిన్నటిదినం మాధవాచార్యుల వారి కుమారుడు ఫాదిరీగారిని తీసుకవచ్చి మీ గూడెంలో స్కూలు పెట్ట

డానికి వచ్చారు. కొద్దిగా కర్చు ఉంటుంది. భరించుకుని తగ్గ ఏర్పాటు చేసుకోమని చెప్పారు. ఆసంగతే మాట్లాడుతున్నాము. మీ దగ్గిరికి రావా లని వచ్చాము. మీరు భోజనం చేస్తున్నట్టు తెలిసి ఇక్కడ కూర్చున్నాము. ఈ విషయంలో మీ ఉద్దేశం ఏమిటి?" అన్నాడు రామస్వామి.

"మీ రేమన్నా ముందు వారికి మాట ఇచ్చారా?" అన్నాడు సూరదాసు.

"మీ ఇష్టం లేనిదే ముందు మే మేమి చెప్పాతాము? మీరు ఎట్లా అంటే అట్లా నడుద్దాం" అన్నాడు సోమన్న.

"ఉచితంగా స్కూలు ఏర్పాటు చేస్తా మంటే మీకు భ్రిమ కలిగి ఉండవచ్చు. గానీ దానిలో గొప్ప రహస్యం ఉన్నది. వాళ్లు స్కూళ్లు పెట్టడం మనలను రక్షించే టందుకు కాదు. వారి మతప్రచారణ కోసం అంటే నమ్మండి. వారు స్కూల్లో ముఖ్యాతికవంతు చెప్పే చదువే క్రియిస్తవ మతాన్ని గురించి. ఈ సంగతి తెలియని వాళ్లు వారి దాతృత్వానికి అచ్చెరువు పడవలసిందే. కుర్రవానికి బెల్లంలో పొదిగి ఇచ్చిన మాత్రివలె చదువు అనే మిషతో ఏమీ ఎరగని పసికూనలను వలలో వేసుకుని మతపరిచారం చేస్తున్నారు. లేతమనస్సుల్లో నాటుకో చేసిన విషయం ఎక్కువ ఫలితం ఇస్తుందని నమ్మకంతో వాళ్లట్లా చేస్తున్నారు. హిందూమత ప్రాశస్త్యాన్ని మీ కదివరకే చెప్పి ఉన్నాను. ఖండాంత

రాలనుంచి క్రియిస్తవమతంలో పుట్టిన తెల్ల వాళ్లు సైతం మన హిందూ దేశానికి వచ్చి, మహర్షుల వద్ద నేటికి పాదదాస్యం చేస్తున్నారు. ఇటువంటి ఉత్తమ మతం మనదయి నప్పుడు వేరేదానికి ఎదురు చూడడం ఎంతటి వెర్రి! ఈ ఫాదిరీలూ, ఈ వాళ్ళమతం, ఎప్పటి కైనా మన హిందూదేశం విడిచిపోవచ్చు. ఇప్పుడు ఉద్యోగాల కని ఆశపడి పోయి అందులో కలిసిన వారి స్థితి అప్పు డేమవుతుంది. మనపిల్లలను ఇదివరకు పంపుతూ వున్న ఎలిమెంటరీ స్కూలుకే పంపుదాము. వారి బడి మనకు వద్దు" అన్నాడు సూరదాసు.

"ఈ కథ అంతా మాకేమి తెలుసు? స్కూలుపెడ తా మంటే మన మంచికే అనుకున్నాము. రేపు వచ్చి నప్పుడు మాకు అవసరంలే దని చెప్పివేస్తాను" అన్నాడు రామస్వామి.

"అట్లయితే ఆచార్యులవారి అబ్బాయి వారి వెంట తిరుగుతున్నాడు ఎందు కండీ?" అన్నాడు సోమన్న.

"ఒకరి సంగతి మనకెందుకు? వారిని ఎంచే మాత్రపు వాళ్లమా మనం" అన్నాడు సూరదాసు.

## ౫

రాత్రి చేసిన పరాభవానికి శాంతించక తెల్లవారి మాధవాచార్యులవారూ, హరిశివయ్యగారూ, కలిసి ఆ గ్రామంలో ఉన్న ముఖ్యమైన వాళ్ళను పిలిపించి పాపం ఆ అమాయకపు బీదజనం పైన ఉన్నవి రెండూ, లేనివి రెండూ నేరాలు చెప్పి వాళ్ళకు ఏమీ పనులు ఇవ్వకుండా చేశారు. కొందరు ధనవంతులు వాళ్ళ కమతగాళ్ళను పనిలో నుంచి అప్పుడే తొలిగించి వేశారు. ఎవ్వరికీ ఏ పనులూ చెప్పటం లేదు. ఆఖరికి గూడెంలో నుంచి వచ్చిన బిచ్చగానికైనా పట్టెడు అన్నం వెయ్యడం లేదు. రెండు రోజులు జరిగేటప్పటికి మాలపల్లెలో బీదజనం ఆకలికి మలమలా మాడిపోతూ ఉన్నారు. పిల్లల ఘోష చూడలేక తల్లులు తవుడురొట్టెలు సయితం చేసి ఇచ్చారు. ఈ దుస్థితికి నేనే కారణమని సూరదాసు చాలా వగచాడు. తన ఇంట్లో అప్పటికి గడమంచె మీద మూతికట్టిన నాలుగు బస్తాల ధాన్యం బీదలకు కొలిచి వేశాడు. రామస్వామివల్ల కొంత సహాయం వాళ్ళకు చేయించాడు.

"ఇట్టి సమయంలో మతంలో చేరి ఉన్నట్లైతే వాళ్ళ వల్ల కొంత ఆదరణ జరిగేది. మతాన్ని వదులుకుని వీళ్ళను నమ్ముకుని ఉండడంచేత మన కింత అనాదరణ

గలిగింది. బీదజనం పైన జాలన్నా లేకుండా నమస్కరిం-చిన కొద్దీ చేతులు నరికి వేస్తున్నారు. ఈ బాధలు ఎందాకా అని పడతాం? పోయి మతంలో చేరితే వాళ్లే ఇంత ఆదరిస్తారు" అని కొందరు మోటు కేలి సూర దాసుతో అన్నారు.

"శాంతించండి. తొందరపడితే ఏమీ ప్రయోజనం లేదు. ఇంత మాత్రానికే మతంలో కలుస్తా మనడం చాలా అవివేకమైన మాట. మీ కుటుంబంలో కల హించుకుని ఆ కోపాన మరిఒకరి పంచన చేరితే ఆఇంటి వాళ్ళవల్ల మీకు ఎంత లాభం కలుగుతుందో, మీ కోపాన్ని చంపివేసుకుని మీ యింట్లోనే వున్నట్లయితే ఎంత లాభం కలుగుతుందో బాగా ఆలోచించండి. గ్రామస్థు లందరూ మన సోదరు లంటివారు. మనలో మనం కలహించుకుని రేపు మళ్లీ ఒకటి కావచ్చు. ఒకరికి కోపం వచ్చినప్పుడు మరి ఒకరు శాంతించడం ఉత్తమ మైన మార్గం" అని చెప్పి సూరదాసు వాళ్ల మనస్సులను తిప్పి వేశాడు. ఇటు చూస్తే గూడెంలో పడుతున్న బాధలూ, అటుచూస్తే గ్రామం వీళ్ళపైన కట్టిన తీవ్రమైన సమ్మె, చూస్తే సూరదాసుకు ఏమీ తోచక కంగారు పడ్డాడు. "గ్రామస్థులవద్దకు వెళ్లి వారి పాదాల మీాద రక్షించ మని పడదామా" అనుకున్నాడు. పడినా

వినరని అతనిమనస్సుకు తోచింది. ఆఖరికి ఒక ఆలోచన అతనికి తట్టింది.

వెంటనే రామస్వామి సోమన్నలను తీసుకుని కృష్ణ శాస్త్రిగారి ఇంటికి వెళ్లాడు. కృష్ణశాస్త్రి పూర్వం నుంచీ కాంగ్రెసులో పని చేసి ఉప్పు సత్యాగ్రహంలో జైలుకు వెళ్లాడు. ఆ సంస్థ మీాద మంచి అభిమానం కలవాడు. ఉన్నత మైన ఆశయాలు గల యువకుడు, తీవ్రజాతీయ వాది.

ఆ వచ్చిన ముగ్గురినీ లోనికి తీసుకుని వెళ్లి తుంగచాప పరిచి కూర్చోమన్నాడు కృష్ణశాస్త్రి. "ఎందుకు లెండి బాబుగారూ! ఇక్కడ కూర్చుంటాము" అన్నాడు సూరదాసు. కృష్ణశాస్త్రి సూరదాసు బుజం మీాద చెయ్యి వేసి "సందేహించ వద్దు. పరవా లేదు. కూర్చో" అని చాపమీాద కూర్చో పెట్టాడు. ఆ కర స్పర్శకు సూరదాసు నివ్వెరపొయ్యాడు. రామస్వామి, సోమన్న, గూడా కూర్చున్నారు. "ఏమి పని మీాద వచ్చారు" అని ప్రసన్న వదనంతో కృష్ణశాస్త్రి అడిగాడు. వాళ్లు మొదటినుంచీ జరిగిన సంగతంతా చెప్పి, "ఈ సమయంలో మా కేదన్నాదారి చూపించి రక్షించాలి. బీదజనం బతికేటట్టు లేదు. అల్లాడి ఆకులు మేస్తున్నారు" అని దీనవదనంతో కళ్ల వెంట నీళ్లు తెచ్చుకుని సూరదాసు అన్నాడు. ఆ మాటలు విని అతని దైన్య

స్థితి చూచి కృష్ణశాస్త్రికి కళ్లవెంట గిరుక్రిన నీళ్లు తిరిగి నవి. ప్రసన్నవదనం విషణ్ణ వదనంలోకి మారింది. గ్రామం వీళ్లకు చేసిన అక్రమానికి గ్రామం పైన ఆయనకు కలిగిన తీవ్రకోపాన్ని వీళ్లకు కనపడకుండా చేసి ఇట్లా అన్నాడు, "మీరు ఓర్పుపట్టండి నా చేత నైనంత సహాయం మీకు చేస్తాను. ఈ మధ్య నేను గ్రామం లో లేను. జిల్లాబోర్డు ఓట్ల ప్రచారానికై ఇతర గ్రామాలు వెళ్లాను. రాత్రే వచ్చాను. నేను ఉన్నట్లయితే ఇంత ప్రమాదం జరగనిచ్చేవాడిని కాను. మీ రిక వెళ్లిపోండి. తరవాత నేను మీ ఇంటికి వచ్చి మాట్లాడతాను" అన్నాడు.

"భగవంతుడు మిమ్మల్ని చూపించాడు. మీ దగ్గి రికి వచ్చాం. మమ్మల్ని రక్షించేభారం మీదే" అని ముగ్గురూ లేచి నమస్కారాలు చేసి వెళ్లిపొయ్యారు.

తరవాత కృష్ణశాస్త్రి ఆలోచనా నిమగ్నుడయ్యాడు. వాళ్లకూ వీళ్లకూ రాజీ చేద్దా మనుకున్నాడు. ముదిరి పోయింది, లాభంలేదు. అయినా చెపితే వినే సహృద యులు గ్రామంలో కనుపించనందున ఆ ప్రయత్నం మానుకున్నాడు. ఇంకా వాళ్ళకు ఏ విధాన సహాయం చెయ్యగలనా అని దీర్ఘంగా ఆలోచించాడు. అతనికి చక్కని ఊహ ఒకటి తట్టింది. గడియారం చూచాడు.

పన్నెండుగంటల పదినిమిషాలు అయింది. అప్పటికి ఇంకా ఆయన భోజనం చెయ్యలేదు. భోజనం పెట్టుక కూర్చుంటే బండి అందదని స్టేషనుకు పోయి రైలెక్కి గుంటూరు చేరాడు.

జిల్లా హరిజనోద్ధరణ నిధికి వెళ్లి, సంగతంతా వాళ్లకు చెప్పి యాభై రాట్నాలూ, రెండు గోతాల ఏకులూ, కొంతడబ్బూ, పదిమంది వాలంటీర్లనూ, తీసుకుని సాయంత్రం అయిదుగంటల బండికి స్వగ్రామం చేరాడు. పదిమంది వాలంటీర్లు ఖద్దరుదుస్తులతో గ్రామంలో ప్రవేశించేటప్పటికి గ్రామానికి వింతశోభ కలిగింది. కృష్ణశాస్త్రి ఈ హడావుడిలో గుంటూరులో భోజనం మాటే మరిచాడు. ఇల్లు చేరేటప్పటికి సాయంత్రం ఆరుగంటల పైగా అయింది. అప్పుడే గూడెంలోకి పోవా లనుకున్నాడు. పగలల్లా భోజనం లేదు గాన నీరసంగా ఉండటం చేత ఈ రాత్రి పొయ్యి చేసేది ఏమీలే దని ఉదయానే పోనడానికి నిశ్చయించాడు. రాత్రికి వాలంటీర్లతో కలిసి సంతోషంగా భోజనం చేశాడు.

అందరూ కలిసి తెల్లవారి గూడెంలోకి పొయ్యారు. వచ్చినవారిని చూచి సూరదాసు తొందరతొందరగా చాపలు పరిచాడు. వారు కూర్చున్న వెనక రామస్వామీ, సోమన్న మొదలయినవాళ్లని పిలిపించాడు. అందరితో కృష్ణశాస్త్రి ఇట్లా అన్నాడు. "మీ దరిద్రం నేటితో తీరి

పోతుంది. మీరు ఇకనుంచి మిమ్మల్ని దరికిరా నివ్వక అసహ్యించుకుని బానిసలవలె చూచేవారివద్ద నీచమైన సేవకావృత్తిని చెయ్య నవసరం లేదు. స్వేచ్ఛా జీవనం చెయ్యవచ్చు. ఇదిగో, వీరందరూ మీ సేవ చెయ్య డానికై వచ్చారు. రాట్నాలూ వాటికి తగ్గపరికరాలూ అన్నీ వచ్చినవి. మీలో కూలి పని మీద జీవించే ప్రతి వ్యక్తికీ ప్రస్తుతం తలా ఒక రాట్నం చొప్పున ఇస్తాము. ఏకులు ఇస్తాము. నూలు వడకాలి. సాఫీగా దారం తీసే టంతవరకూ వీరు దగ్గిర వుండి నేర్పుతారు. నాలు గయిదు రోజుల వరకూ రోజు ఒకటింటికి అణా బేడ కంటే ఎక్కువ గిట్టదు. ఇవి కొత్త నమూనాగా చేసిన రాట్నాలు. వీటి మీద బాగా వడకడం కుదిరిన తరవాత రోజుకు అయిదు అణాలు, ఆరు అణాలు గూడా సంపాదించ వచ్చు. ఒక్కొక్క రాట్నం రూపాయిన్నర. రాట్నాన్ని బాకీగా ముందు మీకు ఇస్తాము. వీటి ఖరీదు ఒక్క మారు గాకుండా కొద్ది కొద్దిగా దఫాల వారీగా మీ ఇష్టం మీద చెల్లువేసు కుంటాము. మీరు ఒకచోటికి పోకుండా కావలసిన ఏకులు సప్లయి చేసి వడికిన వారలు ఖరీదు గట్టి మేమే తీసుకుంటాము. ఇందులో మీకు ఏ మాత్రం ప్రయాస గానీ, ఇబ్బందిగానీ లేదు. హాయిగా నీడపట్టున ఇంట్లో కూర్చుని చేసే పని. ఇంకా కొంత కాలం జరిగిన తరవాత మగ్గాలు గూడా పెట్టే ఏర్పాటు

చేస్తాను. అప్పుడు మనిషి ఒకటింటికి రోజుకు అర్ధ రూపాయి మొదలుకుని, రూపాయి వరకూ సంపాదించ వచ్చు. ఇప్పుడు రాట్నం ఒకటింటికి ముందుగా పది రూపాయలకు మించని పెట్టుబడి రొఖ్ఖ పూర్వకంగా ఇస్తాము. అవి దఫాల వారీగా తీర్చుకోవచ్చు, అని చెప్పాడు.

ఈ మాటలకు సూరదాసు మొదలైన వాళ్లకు అమావాస్య రాత్రి చంద్రోదయం అయినట్టయింది. వారి ముఖాలు వికసించినవి. సంతోష సాగరంలో ఈదు లాడారు. నిర్మల హృదయుడైన సూరదాసు ఆనంద బాష్పాలు కూడా రాల్చాడు. దీనజనోద్ధారుడై, సత్య స్వరూపుడై, సహస్రదయా కిరణాలతో వెలుగొందుతూ ఉన్న ఆ విశ్వమోహనుని దివ్య తేజస్సు ఈ తన ఆర్తిబిడ్డల పైన ప్రసరించింది అని అందరూ కృతజ్ఞతా పూర్వకంగా అంగీకరించారు.

ఇంటింటికీ పోయి ఇంటికిరెండు మూడు రాట్నాల వంతున జనసంఖ్యను బట్టి ఇచ్చారు. పాతిక రాట్నాలు తక్కువైనవి. వాలంటీరును గుంటూరు పంపి వెంటనే ఆ రాట్నాలు కూడా కృష్ణశాస్త్రి తెప్పించాడు. వాళ్లు రాట్నానికి పదిరూపాయిలు బాకీ తీసుకునే టందుకు తీర్చ గలమో లేమో అని భయపడి రాట్నం ఒకటింటికి చాలామంది మూడునాలుగు రూపాయిల కంటే ఎక్కువ

అప్పు తీసుకోలేదు. ఈ పదిరోజులు చెల్లుగా గూడెం అంతా కడుపు నిండా అన్నంతిని కంటినిండా నిద్రపోయిన రోజదే. ఆ రోజునే ఇంటింటికీ వెళ్ళి వాలంటీర్లు ఏకులువడి కేటందుకు ప్రారంభం చేశారు. అందరూ ఉత్సాహంతో రాట్నాలు తిప్పారు. వారం రోజులు గడిచినవి. అందరూ ధారాళంగా దారం తీస్తున్నారు. రాట్నం వున్నప్రతి మనిషీ ఇంట్లో కామధేనువును కట్టివేసు కున్నట్లయింది. ఒళ్ళుకదలకుండా సాయంత్రం వరకూ కూర్చుంటే ప్రతి రోజూ వాళ్ళు అడిగినంత డబ్బుఇస్తున్నది. పిల్లలతో సహా ఇంటిల్లి పాదీ అందరికీ పనిగలిగింది. పూర్వం కూలికిపోతే ఎర్రని అగ్గిలో ఉదయం మొదలుకుని సాయంత్రం వరకూ మాడి ఎముకలు విరిగే చాకిరిచేసి మనిషి ఒకటింటికి పావలాడబ్బులు తెచ్చుకునే టప్పటికి చాలాకష్ట మయ్యేది. అదిన్నీ నెలకు ఏ పదిరోజులో పనిదొరికేది. అందులో బండపని చెయ్యగల ఓపికగల వాళ్ళకే దొరికేది. ఇప్పుడు అట్లాకాదు. కాలుబయట పెట్టలేని ముసలివాళ్లు కూడా నీడపట్టున హాయిగా కూర్చుని, సునాయాసంగా రోజుకు పావలా వంతున సంపాదిస్తున్నారు. ఆదినుంచీ వాళ్ళనెత్తి పై కెక్కి తాండవిస్తూ వున్న ఆ దరిద్రదేవత, ఆ ఇనప గజ్జలతల్లి, నేడు పేద జనపెన్నిధానం అయిన రాట్నపు ధ్వనికి బెదిరి అంతులేకుండా పారిపోయింది.

౬

మాధవాచార్యులవారి పందిట్లో పెద్ద వేపచెట్టు వున్నది. దానిమీాద పక్షులు గూడుకట్టుకుని చాలా కాలంనుంచీ కాపరం చేస్తూ వున్నవి. తెల్లవారేటప్పటికి వాటిరెట్టతో నేలను ఖరాబుచేస్తూ వున్నవి. ఊడ్చినా పరిశుభ్రంకావటం లేదు. సున్నపనీళ్ళు చల్లినట్టు వాటి రెట్ట నేలకు అంటుకుని వుండడంచేత,ఇంటివాళ్ళు ఏ గరిట తోనో గీకి ప్రతిరోజూ బాగుచేయవలసి వస్తున్నది. ఇది వారికి చాలాకష్టంగా వున్నది. మాధవాచార్యులవారు ఆ బాధపడలేక గడతో పక్షులను చాలా పర్యాయాలు లేవగొట్టించారు. అవి అప్పటికి లేచిపోయి ఆస్తానం వీడక మళ్ళీ రాత్రికి వచ్చి అక్కడనే కాపరం చేస్తూ వున్నవి.

చాలా రోజుల నుంచీ ఆ పక్షులను పట్టుకోవాలని ఎరుకల వాడొకడు పొంచు వేసుక తిరుగుతూ వున్నాడు. అవి బ్రాహ్మల ఇంట్లో వుండటంచేత పట్టుక వెళ్లనివ్వ రని తెలిసి ఊరుకున్నాడు. వాటిమీాద వాడికి ఆశ మాత్రం పో లేదు. ఏ అర్ధరాత్రో వీలవుతుందేమో నని ప్రయత్నం చేస్తున్నాడు. వాడికి వీలుదొరకటం లేదు. రోజుకు ఒకపర్యాయమైనా ఆ చెట్టు పైన కళ్లు పెట్టి ఆ బాజారునే పోతూ వుంటాడు.

ఒకనాడు వీధినే పోతూ వున్న ఆ ఎరుకలవాణ్ణి

ఆచార్యులవారు లోనికి పిలిచి "మా చెట్టు మీద పక్షు లున్నవి, వాటితో మేము బాధ పడ లేక చస్తున్నాము. పట్టుక వెళ్లుతావా"? అని ప్రశ్నించాడు.

ఆ మాటలకు వాడు వరహాల మూట దొరికినట్టు సంతోషించి "బాబయ్యగోరూ! తమ దయవస్తే ఎంత సేపు" అన్నాడు.

"వాటిని చంపకు, ఎక్కడైనా వదిలిపెట్టు. లేక పోతే మాకు మహాపాతకం తగులుతుంది" అన్నాడు ఆచార్యులవారు.

వాడామాట అర్థం చేసుకోకుండా "లేదుండీ, బాబయ్యగోరూ, నేను చంపనుండీ. చంపి తింటే యేమీ రాదుండీ. ఇయ్యి అడివి గువ్వలు, యిక్కడికి యెట్లా చెదిరి వచ్చినయ్యో తెలవదుండి. వీటిని గుంటూరు తీసుక యెల్లి అమ్ముకుంటా నుండి. దొరలు వీటిని చానా పేమతో కొంటారుండి. మీ దయవల్ల రెండు రూపా యిల డబ్బులు నాకు వత్తాయుండి. పిల్లా జల్లా రెండు రోజులు ఆయిగా మీ పేరు సెప్పుకుని యింత తింటా ముండి" అన్నాడు కపటంలేకుండా ఆ ఎరుకల వాడు.

"అట్లా చెప్పు! డబ్బువచ్చేటట్లైతే ఊరికినే పట్టుక వెళ్లడం నీకు న్యాయమేనట్రా. బ్రాహ్మడిసొమ్ము ఊరికే

తినగూడదు, మహాపాపం" అన్నాడు వికటమైన నవ్వుతో ఆచార్యులవారు.

"లేదుండీ అయ్యగోరూ! నేను అబద్ధం ఆడనుండీ. నిజమే చెప్పేను. అమ్మాడుపొయ్యినతర్వాత సగం తమ కిచ్చుకుంటానుండి. నామాట నమ్మండి" అన్నాడు ఎరుకలవాడు.

ఆచార్యులవారు మెల్లిగా అన్నారు. "ఒరే ఇట్లని ఎవ్వరితో చెప్పకు. చెప్పావా అంటే నీపని పట్టిస్తా. నువ్వు అబద్ధం ఆడవని నాకు తెలుసురా. నువ్వు వాటిని అమ్మినచోట చంపవద్దని మాత్రం చెప్పు. ఈ మాట బాగా జ్ఞాపకముంచుకో. తర్వాత వాళ్ళేమి చేసుకున్నా మనకు పాపం తగలదు. చూడు, ధరరాబట్టి అమ్ముకో. అలవసులవలకు పారవేసుకోబోకు పాపం."

"అయ్యగోరూ, తమ యిట్టప్పెకారం నడుసుకుంటా నుండి. వీటికి చానా దరవొత్తందిసుండి" అన్నాడు ఎరుకలవాడు.

సూరదాసు ఇంటిపెరట్లో పెద్దమామిడిచెట్టూ, రెండు మూడు గులాబిచెట్లూ, నాలుగైదు నిత్యమల్లిచెట్లూ, ఒక ఎర్రగన్నేరుచెట్టూ, పెద్దవావిలాకుచెట్టూ వున్నవి. ఆ సంవత్సరం అతనిదొడ్లో వున్న మామిడిచెట్టు విరియ కాసింది. అమృతసమానమైన ముంతమామిడి. అసలేపెద్ద

కని కెరుడు లావుగల కాయలూ, అందులో అపరిమితంగా కాయడంచేత కొమ్మలువిరిగి పోతయ్యా అన్నట్లున్నవి. ప్రతి సంవత్సరం చిలకలూ ఇతరపక్షులూ మందలు మందలుగా వచ్చి కాయలు కొట్టివేస్తుంటవి. భార్య తోలడానికి ప్రయత్నిస్తుంది. అతడు తోలనివ్వడు. "ఈశ్వర నిర్మితమైన ఆహారాన్ని అన్నిప్రాణులూ అనుభవించవలసిందే" అంటాడు. "నీదీ నాదీ అన్న భేదభావం ఈ మానవులకేగాని ఈశ్వరదృష్టిలో లేదు. ఆయనకు సర్వప్రాణులూ సమమే. పండ్లు ముఖ్యంగా శుకశారికాది ఉత్తమపక్షి సంతతికి ఆహారమై వున్నది. వాటి ఆహారం అవి తింటూ వున్నప్పుడు వాటిని వెళ్ళగొట్టి వాటితో మన పొట్టలు నిండించుకొనడం ఎంతపాపం" అని ఏవేవో నీతులు చెపుతాడు.

ఒకనాడు సాయంత్రం మామిడిపండ్ల గంప నాగయ్యనెత్తినపెట్టి, గ్రామంలోకి బయలుదేరి, మాధవాచార్యుల వారి ఇంటి ముందు ఆగి "అయ్యగారూ!" అని కేక వేశాడు. ఎవరో నని ఆచార్యులవారు వాకిట్లోకి వచ్చారు. నిలవబడి వున్న సూరదాసుని చూచి ఆశ్చర్యం కోపం ఒక్కమారుగా వచ్చినవి. సూరదాసు ఆచార్యుల వారికి నమస్కరించి "మా చెట్టు కాచిందండీ. పెద్దలకు సమర్పించందే ముందు తినరాదని నాలుగు పండ్లు అయ్యవారికి పట్టుక వచ్చానండీ" అని నాగయ్య నెత్తి

మీాద వున్న గంప దించి వారి సమీాపంలో వుంచి, వాళ్ళిద్దరూ వెళ్ళి పొయ్యారు. సూరదాసు అన్నమాటలకు ఆచార్యులవారి చెవులూ, తెచ్చిన మామిడిపండ్లను చూచి కళ్ళూ నమ్మలేక పోయినవి. ఏమీా మాట్లాడలేదు. అయ్యవారికి కోపం తగ్గి ఆశ్చర్యం మాత్రం నిలిచింది. అతని సౌమ్యగుణానికి అచ్చెరువు పడ్డాడు. సంతోషంతో గంప అమాంతంగా ఎత్తి ఇంట్లోకి తీసుక వెళ్ళాడు.

కృష్ణశాస్త్రి గూడానికిచేసిన మహోపకారం ఊరంతా అల్లుకున్నది. ఉదారస్వభావులు సంతోషించారు. కఠిన మనస్సు కలవాళ్లు వాళ్ళకు పరాభవం జరిగినట్లు విలపించారు.

ఒకరోజున మాధవాచార్యులవారు హరిశివయ్యతో ఇట్లా అన్నాడు. "విన్నారా కిష్టిగాడు చేసిన పని! మాల వెధవకాక పోతే, కులాన్ని వదులుకుని వాళ్ళని నెత్తిన బెట్టుక తిరుగుతాడండీ. నరజన్మ ఎత్తాక బుద్ధికాస్త వుండొద్దు? వాడు నానా కూళ్ళు తింటున్నాడని ఇదివరకే విన్నాను. పోనీలే, వాడెట్లా చస్తేమనకే మని ఊరుకుంటే ఇప్పుడింత సంఘద్రోహానికి తలపడ్డాడు. వాణ్ణి నిలువునా కోసినా పాపం లేదు, కులంలో వెలివేయిస్తా చూడండి! వాళ్ళని వాళ్లుచేసిన పనికి ఇంకా తిప్పలు పెట్టాలనుకున్నాను. ఈ పనికిమాలిన వెధవ ఇట్లా చెయ్యక పోతే

నాదెబ్బ అంటే మూడోనాటికి కాళ్ళదగ్గిరికి రప్పించక పొయ్యా ననుకున్నారా? మాలో మాకే ఇట్లాతగల బడుతూ వుంటే వాళ్ళని వంచేదెట్లా? మనం వాళ్ళలో పొయ్యిదూరిన తరవాత మనం అంటే వాళ్ళకు ఒక లెఖ్ఖగా వుంటుందా? వీడికిగూడా తగ్గ పరాభవం చేస్తేనే గాని మళ్ళీవాళ్ళ జోలికి పోకుండా ఊరుకోడు" అన్నాడు.

"ఏం అనుకుంటే ఏమిలాభం లెండి! ఎలాచేసినా స్వాములే చెయ్యాలి. కాదన్నా అవునన్నా తమరే" అన్నాడు జంకు లేకుండా హరి శివయ్యగారు.

"ఆఁ మాకే తెచ్చి పెట్టారూ ముసలం! మాలో ఇటువంటి వాళ్ళుండబట్టే ఉత్తమ మయిన రుషివంశానికి కళంకం వచ్చింది. మా మాటంటే ఎవ్వరికీ గౌరవం లేకుండా పోతూ వున్నది. మాలో మాకు సరీగా వుంటే ఎట్లా చెయ్యాలంటే అట్లా చెయ్యమూ? పో నివ్వండి, వాడి కేదన్నా ఘట్టి పరాభవం చెయ్యాలి. ఏ విధంగా చేద్దాం?" అన్నాడు ఆచార్యులవారు.

"మీరే ఆలోచించండి" అన్నాడు హరిశివయ్య గారు.

"నా కేమీ తోచకనే గదా మిమ్మల్ని అడిగాను" అన్నాడు ఆచార్యులవారు.

"నాకు ఒక్కటే మార్గం కనబడుతూ వున్నది.

మొన్న కృష్ణశాస్త్రి తనకు రెండువందలు ఇవ్వాలనీ, నోటు కాలదోషం పట్టడానికి సిద్ధంగా వున్నదనీ, ఎన్ని సార్లు అడిగినా ఇవ్వడం లేదనీ, బాకీ వచ్చేటట్టు లేదనీ చెప్పి ఇప్పించ మని లక్ష్మయ్యసెట్టి నన్ను బతిమలాడాడు. దాన్ని మీరు ఆర్డరు వేయించు కోండి" అన్నాడు హరి శివయ్యగారు.

ఈ మాటలకు ఆచార్యులవారికి హైకోర్టు కేసు గెలిచిన వాడివలె ముఖం విప్పారుకున్నది. అమితసంతోషంతో ఇట్లా అన్నాడు. "బలే ఆలోచన చెప్పారు. ఆ నోటు ఎంతయినా సరే పారేసి ఇప్పుడే కొంటాను. మీ దయవల్ల వాణ్ణి జైలుకు పంపక పోతే చూడండి! వాడి మదం అంతా ఈ దెబ్బతో అణగిపోవాలి. కిక్కురు మనకుండా మూల కూర్చోవాలి. ఇప్పుడే పోయి సెట్టితో మాట్లాడదాం" అన్నాడు. ఇద్దరూ కలిసి అప్పుడే సెట్టి ఇంటికి బయలు దేరారు.

## ౭

సూరదాసు ప్రపంచంలో వున్న ప్రాణు లన్నిటికీ రూపభేదాలే కాని అందులో వున్న బ్రహ్మపదార్థం ఒకటే నని గ్రహించిన వ్యక్తుల్లో ఒకడు. అతని పూర్వజన్మ సంస్కారఫలం అనండి, ఎట్లాగైనా అనండి, అతనికి ఏ ప్రాణిని

చూచినా మనసులో అప్రయత్నంగా, సహజంగా, ప్రేమా, భక్తీ, ఉదయిస్తవి. హింస అనేది అతని చెవుల పడరాదు. వాళ్ల గూడెంలో పూర్వం పశువధలు ఎన్నో జరిగేవి. అతని హయాములో అవన్నీ మానిపించి వేశాడు. చాలావరికి మద్యపాన మాంసాహారాది దుర్వ్యాత్తులు తొలిగించివేసి, చాలామందిని శాకాహారులుగా చేశాడు. వారానికి ఒకమారు తలంటుస్నానం, ప్రతి నిత్యం ఉతికిన బట్టలు కట్టుకోవడం, ఎక్కడబడితే అక్కడ ఉమ్ములు వెయ్యకుండా ఎప్పటికప్పుడు నేల అలుక్కుని ఇళ్ళూవాకిళ్ళూ పరిశుభ్రంగా వుంచుకోవడం మొదలైనఆరోగ్యసూత్రాలను బోధించి అందరినీశుచిగా వుండేటట్టు చేశాడు. మనల్ని దరిద్ర దేవతాదాసులుగా చేసింది ఈ అంటరానితనమే. మనం ఇతరులవలె బజారులో దుకాణాలుపెట్టి వ్యాపారాలు చేసి ధనం ఆర్జించేటందుకు వీల్లేదు. మనదగ్గిరికి ఎవ్వరూ కొనటానికి రారు. మనం తాకిన వస్తువులు వారు తాకరు. ఈ అంటరానితనాన్ని పోగొట్టుకోడానికి ఏయే సన్మార్గాలలో నడుచుకోవాలో అవన్నీ మనం తెలుసుకో లేకపోతే ఈ బంధాన్ని ఈ దరిద్రాన్నీ వదిలించుకో లేము, అని అప్పుడప్పుడూ గూడెం పరిజలకు బోధిస్తూ వుంటాడు.

ఒకనాడు సూరదాసు ఆచార్యులవారి చెరువుగట్టు మీదుగా పొలానికి పోతూ వున్నాడు. చెరువులో కొంత

మంది పిల్లలు కేరింతలు కొట్టుకుంటూ గాలాలతో చేపలు పడుతూవున్నారు. వాళ్ళు గాలపుకర్రలు నీళ్లల్లో నుంచి విసురున పైకెత్తడం, గాలానికి తగులుకున్న చేప విలవిల తన్నుకుంటూ పైకిరావడం, వాళ్ళు చేపను లాగి నేలమీాద రాశిగా పడవెయ్యడం, ఈ దృశ్యంఅంతా సూరదాసు చూచాడు. అడుగుముందుకు సాగక అట్లాగే నిలవబడి పొయ్యాడు. అవిపడే బాధా, ఆ హింసా చూడ లేక పొయ్యాడు. వెంటనే అప్రయత్నంగా అతనికాళ్ళు కదిలి ఆ కుర్రవాళ్ల దగ్గిరికి తీసుక వెళ్లినవి.

"నాయనలారా! వాటిని అట్లా చంపితే మీా కేమి వస్తుంది? ఆ గాలం వాటినోటికి గుచ్చుకుని ఎంతబాధ పడుతున్నవో చూడండి. ఆ గాలం మీా చేతికి గుచ్చుకుని చూడండి. ఎంతనొప్పి గలుగుతుందో. మీా సంతోషం వాటి మరణానికి కారణం అవుతున్నది. మీారు బుద్ధిమంతులై పాపహేతువైన ఈ పనిని మాని వెయ్యండి," అన్నాడు.

"పోపోవయ్యా! నీదార్నిన. మేం ఎట్లాచేస్తే నీకెందుకు? మేం వెళ్లినాక ఈచేపలన్నీ నువ్వు పట్టుకుని వెళ్లాలనా!" అని వేళాకోళంగా అన్నారు ఆ కుర్రివాళ్ళు. మనల్ని బెదిరించటానికి వచ్చాడ్రా అని ఒకడూ, ఇతనేమి చేస్తాడ్రా అని ఒకడూ, ఇట్లా తలోమాట అన్నారు.

"నే నట్లా చెయ్యను. నే నటువంటి వాడినికాను. ఆచార్యులవారు వచ్చారంటే మిమ్మల్ని కొడతారు. నా వెంటరాండి, మీకు కావలసినన్ని మొక్కజొన్న కండెలూ, దోసకాయలూ, ఇస్తాను," అన్నాడు సూరదాసు.

"వట్టిదేరా" అని ఒకడూ, "మనల్ని మోసంచెయ్యడానికి చూస్తున్నాడా?" అని ఒకడూ, "వెళ్లవద్దురా" అనిఒకడూ, తలోమాటా అన్నారు.

"నేనబద్ధం ఆడను. వినండి నాయనలారా! మీరు వాటిని చంపి తినే దానికన్నా, వాటిని వదిలిరాండి. మీకు కావలసినన్ని దోసకాయలూ, మొక్కజొన్న కండెలూ ఇస్తాను. కడుపు నిండాతినవచ్చు. ఇప్పుడేనాతో రాండి, నామాట నమ్మండి" అన్నాడు సూరదాసు.

"సరే, ఈయన ఇచ్చేదేమిటో చూద్దాంరా" అన్నాడొక కుర్రవాడు. అందరూ సరే నంటే సరేననుకున్నారు. సూరదాసు వెంట బయలుదేరారు. సూరదాసు వాళ్ళని తనచేను వద్దకు తీసుకుని వెళ్లి, "బాబుల్లారా! మీచేతుల్లోని గాలపుకర్రలన్నీ నా కిచ్చివెయ్యండి. మీరు ఈ రోజునుంచీ చేపలు పట్టమని శపథం చెయ్యాలి. మీ తల్లి దండ్రులు ఈ పనికై మిమ్మల్ని పొమ్మంటే మేము ఇటువంటి నీచమైన పనికి పోమని చెప్పండి. మీరు

చిన్నతనానే ఇటువంటి పనికిమాలిన పనులు చేస్తూ వుంటే మీ జీవితం వ్యర్థం అవుతుంది" అని శాంతంగా వాళ్ళకు నచ్చచెప్పాడు. మూరెడు మూరెడు మొక్కజొన్న కండెలూ, పెద్ద పెద్ద దోసపండ్లూ, కనిపించి వాళ్ల లేత మనస్సులను ఆకర్షించినవి. చేతులో వున్న గాలపుకర్రలు ఇచ్చి వేశారు. అతడు చెప్పిన దానికల్లా ఒప్పుకుని తల లెగురవేశారు. సూరదాసు చేలోకి ఆ కుర్రవాళ్ళను తీసుకుని వెళ్లి మోసినన్ని కండెలూ, దోసకాయలూ, మూటలు కట్టి పంపి వేశాడు. వాళ్లు ముఖ్యంలేని బరువుతో, పట్టరాని సంతోషంతో వెళ్లిపోయ్యారు.

మాధవాచార్యులవారి చేలో రెండు జామచెట్లు వున్నవి. ఆ సంవత్సరం పూతాపిందెతో విదులుతూ వున్నవి. ఏటా ఆచార్యులవారికి ఆ చెట్ల మీద పదిరూపాయిల సొమ్ము వస్తుంది. ఇంకా ఆ చెట్లు ఎవ్వరూ కొనలేదు. బేరాలు మాత్రం జరుగుతూ వున్నవి. అట్టి సమయంలో ఇద్దరు హరిజన కుర్రవాళ్ళు బాల్యచాపల్యం చేత చేలో జొరబడి, వాళ్ల ఇష్టం వచ్చినట్టు ముదురు ముదురు పిందెలన్నీ కోసుకుంటూ, కొన్ని కొరికి పారవేస్తూ, "అరేయ్, ఆ మూల పెద్దకాయ వున్నది. ముందు నే చూశాను. అది నాది" అని ఒకడూ, "నావి కాసినే అయినవి కాయలు, నువ్వు చాలా కోశావురా" అని ఒకడూ, "చిన్న చిన్న కాయలు గోలికాయలు

ఆడుకోవచ్చు రోయ్" అని ఒకడూ, ఇట్లా ఒకరితో ఒకరు మైమరిచి మాట్లాడు కుంటూ, ఒకళ్లని మించి ఒకళ్ళు కాయలు కోసుకుంటూ వున్నారు.

ఇట్టి సమయంలో వంకరకర్రి చేత్తో పుచ్చుకుని అయ్యవారు చేలోకి వచ్చారు. ఆ కుర్రవాళ్లు అయ్యగారిని చూచి సింహాన్ని చూచిన లేళ్లవలె బెదిరి కాయలు అక్కడ పారవేసి పరిగెత్తపొయ్యారు. అందులో జొన్న పైరు దట్టంగా ఎదిగి వున్నదేమో దోసచెట్లు కింద బాగా అల్లుకుని వున్నవేమో పరిగెత్తపోతే దోసతీగెలు కాళ్లకు బంధాల్లాగా చుట్టుకుని వాళ్ళను పడవేసినవి. అయ్యగారి పొలంలో బలం తింటూ వున్నందుకు జీతం తిన్న నౌకర్లవలె సొమ్ము తింటూ వున్న విశ్వాసాన అడ్డం తగిలి చెంబంత కంకులతో తలగుడ్డలు చుట్టుకుని బారులు తీరిన సిపాయీలను మరిపిస్తూ జొన్నకర్రిలూ, నేరస్తునకు సంకెళ్లు వేసినట్టు కాళ్ళకు చుట్టుకుని దోస తీగలూ, బంధించి ఆ కుర్రవాళ్ళను ఆయనకు వప్పగించినవి. ఆచార్యులవారు చెట్లకిందపడివున్న కాయలను చూచి లక్షరూపాయిల బాకీ మునిగిపోయిన పిసినిగొట్టు షావుకారులాగా అయ్యాడు. "అయ్యో! అయ్యో! ఎంతసొమ్ము నష్టం! ఈ స్తితిలో వున్న చెట్లను ఎవడైనా కొంటాడా! చిక్కారు!" అని చేతులో వున్న కర్రితో ఫెడేలు మని ఎముకలు చూర్ణం అయ్యేటట్టు చెరివక

బాదూ బాదాడు. వాళ్ళు ఆత్రంతో లేచి పడుతూ లేస్తూ చేనుదాటి పరిగెత్తుతూ వున్నారు.

ఆచార్యులవారు "వెధవల్లారా! సొమ్మంతా నష్టం చేస్తారా" అని ఒళ్ళు తెలియని కోపతీవ్రంచేత చేతిలో కర్ర పైకెత్తాడు. ఇట్టి సమయంలో ఇదంతా చూస్తూ పై చేలోనుంచి వస్తూ వున్న సూరదాసు ఆచార్యుల వారిని సమీపించి, "అయ్యా! అయ్యా! శాంతించండి శాంతించండి" అన్నాడు. సూరదాసుని చూచి ఆచార్యులవారికి మండుతూ వున్న అగ్నిపైన కిరస నాయిలు చల్లినట్టు కోపం ద్విగుణీకృతం అయింది. మన్నూ మిన్నూ ఏమీ ఆయనకు కనిపించలేదు. ఇది మానవలోకమనీ ఇందులో తను వుండి ఇట్లా చేస్తున్నా ననీ మరిచి పొయ్యాడు. "ఛాఛ్ఛా! అవతలికి పో! చెప్ప వచ్చావు" అని సూరదాసుని విదిలించి చేతిలో కర్ర విసిరివేశాడు. అది విష్ణుచక్రం లాగా వెన్నంటి ఒక కుర్రవాడిని నేల కూల్చింది. రెండో కుర్రవాడు పారి పొయ్యాడు.

కుర్రవాడు భూమ్మీద పడిపోవడం ఆచార్యులవారు చూచారు. నిషా దిగినట్టు ఆయన కోపం దిగిపోయింది. ముచ్చెమటలు పోసినవి. శరీరం కంపించింది. కుర్రవాడు దెబ్బతగిలి చనిపొయ్యాడని భావించాడు. తాను చేసిన పొరపాటుకు తీరని పశ్చాత్తాప పడ్డాడు. ఈ రోజుతో

తనకూ ఈ ప్రపంచానికీ సంబంధం తీరిపోయిం దని ఎంచాడు. ఈ లోక మంతా ఆయనకు అంధకార బంధురంగా కనిపించింది. తన బుర్ర తన భావి స్థితిని గూర్చి తలపోస్తూ వున్నది. కుర్రవాడి బంధువు లంతా తన ఇంటిమీాద పడడం, పోలీసులు చేతులకు సంకెళ్లువేసి తీసుకవెళ్ళి కోర్టులో పెట్టడం, జడ్జీ తనకు ఉరిశిక్ష విధించడం, ఇవన్నీ సినిమా తెరల్లాగా ఆయన కళ్ళకు కనిపిస్తూ వున్నవి. తాను ఈ రోజుతో చచ్చిపోయినట్లే భావించి అమితంగా విలపించాడు. అశ్రుపూరితా లయిన నేత్రాలతో ఎదుట వున్న సూరదాసుని దీనంగా చూస్తూ, అతని రెండు చేతులూ పట్టుకుని "సూరదాసూ! ఈ సమయంలో నువ్వే నన్ను రక్షించాలి. నే చేసిన అపరాధాన్ని మరిచిపోవాలి. నీ మేలును జన్మ జన్మాలకూ మరిచిపోను" అన్నాడు వచ్చీరాని హీన స్వరంతో.

"అయ్యా! చింతించవద్దు. నా చేత నైనంతవరకు మీాకు సహాయం చేస్తాను. ఎప్పటి కెట్లా గానున్నదో! అంతా ఈశ్వరాధీనం, భయపడ వద్దు" అని ఆచార్యుల వారికి ధైర్యం చెప్పాడు సూరదాసు.

దూరాన జనం వస్తున్నట్టు కనబడి ఆచార్యులవారు గాభరాతో చేలో దూరాడు. సూరదాసుది అసలే జాలిగుండె. ఆ కుర్రవాని దుస్థితీ ఆచార్యులవారి దీన స్థితీ రెండూ ఏకమై అతనికి చాలా చింత కలుగజేసినవి.

రెండో కుర్రవాడు పొయ్యి, పడిపోయిన కుర్రవాడి తల్లి దండ్రులతో సంగతంతా చెప్పాడు. వడుకుతూ వున్న రాట్నాన్ని వదిలి తల్లి శోకాలు పెట్టడం ప్రారంభించింది. తండ్రి వాడి బుర్రకాయ పగలగొడతానంటూ దుడ్డుకర్ర చేత్తో పుచ్చుకున్నాడు. ఆ గోలకు ఇరుగు పొరుగు వాళ్ళు పోగయ్యారు. ఆ వార్త కాస్తా విన్నారు. ఆచార్యులవారి పూర్వపు పగ వారి మనస్సుల్లో రేకెత్తింది. వారి రక్తాలు తీవ్రమైన వేడిచేత పొంగులాడి పోయినవి. అందరూ కర్రలు తీశారు. వెంటనే బయలుదేరి వడి వడిగా పొలం చేరారు. "వాడేడీ! ఎక్కడికి పొయ్యాడు? వాడి రక్తం కళ్ళచూస్తా" అని కుర్రవాని తండ్రి గర్జించాడు. కుర్రవాని తల్లి ఏడుస్తూ గుండె బాదుకుంటూ కుర్రవాడిదగ్గిర కూర్చున్నది. పడిపోయిన కుర్రవాణ్ణి చూచి అందరికీ తీవ్రోద్రేకాలు కలిగినవి. ఆచార్యులవారు కనిపించలేదు. చేలో వున్నాడేమోనని చేలోకి పరిగెత్తపొయ్యారు. సూరదాసు వాళ్ళందరినీ వారించి "ఎందుకట్లా తొందరపడతారు? కుర్రవాడికి వచ్చిన పరవా ఏమీలేదు. దెబ్బతగిలి మూర్ఛపొయ్యాడు. అంతేకాని ప్రాణాపాయం ఏమీలేదు. నే చెయ్యి చూచాను. నాడి బాగా ఆడుతూనే ఉన్నది. ఆ కుంటలో నీళ్లుకాసిని తీసుకరమ్మని" చెప్పాడు.

ఆ మాటలకు జనం అంతా నిశ్శబ్దం అయింది. తల్లి

ఏడ్పు కొంత మానింది. అక్కడ వున్న దుత్త తీసుకుని పరి గెత్తుకుని పోయి ఒకడు నీళ్లు తెచ్చాడు. సూరదాసు వెంటనే తన కులదైవమైన రాముణ్ణి ప్రార్థించి కాసిని నీళ్లు ఆ కుర్రవాడి ముఖంపై చిలకరించాడు. ప్రభావం గల మహర్షి మంత్రోదకాలు చల్లినట్టు ఆ కుర్రవాడు కళ్ళు విప్పి చూచాడు. కుర్రవాడి ప్రాణం వచ్చిందని తల్లిదండ్రులూ, ఆచార్యులవారికి గణ్ణం తప్పిందని సూర దాసూ. మిక్కిలి సంతోషించారు. పగ తీర్చుకోవడం తప్పిపోయిం దని తతిమ్మా వాళ్ళు నిరుత్సాహపడ్డారు. కాసేపటికి కుర్రవాడు లేచి కూర్చున్నాడు. "నాకన్న తండ్రీ! లేచావా" అని తల్లి ముద్దాడింది. "ఎందుకు మీరంతా వచ్చారు"? అని అడిగాడు కుర్రవాడు. దెబ్బలు తగిలిన చోట్లల్లా తల్లిదండ్రులు అడిగి తెలుసు కున్నారు. ఎప్పటికి నయ మవుతయ్యో అని మళ్లీ కాస్త చింతించారు.

వాళ్లల్లో ఒకడు "ఆ బ్రాహ్మడి ఇంటిమీదికి పొయ్యి పడి పెంకులు దులుపుదాము" అన్నాడు. మరి ఒకడు "డాక్టరువద్ద సర్టిఫికెటు తీసుకుని కేసుపెట్టి ఆయనదుంప తెంపుదాం" అన్నాడు. అందుకు సూరదాసు "ఇంటి మీదపడి నువ్వేమిచేస్తావు? అల్లరిచేసినందున కుర్రవాడి దెబ్బలు నయంగావు. కేసుపెడితే మనవైపున సాక్ష్యం ఎవ్వరూ పలకరు సరిగదా, పైగా కక్షలు పెరిగిపోతవి.

ఇప్పుడు వారివల్ల తప్పున్నది గనక మీరే దన్నా తొందరపడ్డా వారు ప్రస్తుతం ఊరుకుంటారు. అది మన సులో పట్టుకుని దాని సమయంవచ్చినప్పుడు ఇబ్బడి కిబ్బడి చూపిస్తారు. తప్పు తనదని తెలుసుకుని పశ్చాత్తాపపడ్డ మనిషి నువ్వు ప్రతిక్రియ చెయ్యకుండా ఊరుకున్నట్లయితే ఆయన ఎప్పటికైనా నీకు మేలుచేసి తీరతాడు. శాంతంలో గొప్ప ఫలితం వున్నది. అది ప్రస్తుతం కానరాదు. మీ రేమీ గోల చెయ్యకుండా కుర్రవాడిని తీసుకుని ఇళ్ళకు పోండి" అని చెప్పి వాళ్లందరినీ ఇళ్లకు పంపివేసి తాను గూడా వెళ్లిపోయ్యాడు.

చేలో దాక్కున్న అయ్యవారు వీళ్ళు అనుకునే మాట లన్నీ వింటూనే వున్నాడు. ఎక్కడవచ్చి పైనబడి చితక కొడతారో అని ప్రాణాలు అరచేతో పట్టుకుని వున్నాడు. తన్ను రక్షించవలసిందని దేవుణ్ణి అనేక విధాల ప్రార్థిం చాడు. వాళ్ళు చేలోకి వస్తున్నప్పుడు సూరదాసు వారించక పోయినట్లయితే ఈ పాటికి చంపివేసే వాళ్లే నని చాలాసార్లు అనుకున్నాడు. ఈ ఆపద దాటించి తన ప్రాణాలు కాపాడింది సూరదాసే అని పూర్తిగా తెలుసుకున్నాడు. అతని ఉత్తమ గుణానికి ఆశ్చర్య పడ్డాడు. అతనియందు ద్వేషభావం పోయి తనకు తెలియ కుండానే సూరదాసు మీద ఒక విధమైన ప్రేమభావం ఆయన మనస్సులో హత్తుకుని పోయింది. కుర్రవాడు

బతికినట్టూ వాళ్ళ ఇళ్లకు వెళ్లినట్టూ తెలుసుకుని తాను పునర్జన్మ ఎత్తినట్టు తలచాడు. లేచి ఇవతలికి వచ్చి తొంగి చూచాడు. వాళ్లు కనుమేర దూరాన్ని దాటి పొయ్యా రని తెలుసుకుని సంతోషంతో బైటికి వచ్చాడు.

౮

కృష్ణశాస్త్రి తండ్రి ఆనందశాస్త్రిగారు. వాళ్ల వంశ పారంపర్యంతరం వస్తూ వున్న కరిణీకం ఆయనతోనే గతించింది. తండ్రిపోయిన తరవాత ఆ సేవకావృత్తిని తృణీకరించి వదులుకున్నాడు కృష్ణశాస్త్రి. తండ్రి గతించి నాలుగైదేళ్ళు అయింది. ఆయన సంపాదించి ఇచ్చిపోయిన పది ఎకరముల మాగాణి భూమిని ఈయన వితరణగుణం చూరగొన్నది. బీదజనాన్ని చూస్తే ఈయ నకు తగనిజాలి. వాళ్ళడిగినంత దానం చేసేవాడు. విద్యా ర్థులను చాలామందిని పోషించాడు. కాంగ్రెసునందు అభిమానంగల కొన్ని బీద కుటుంబాలను నెత్తినవేసుకుని గడిపాడు. ఈ విధంగా పొలం కాస్తా అయిపోయింది. కాపరం ఉన్న ఇల్లుతప్ప మరే స్థిరాస్తీలేదు. హిందువుల యాజమాన్యంలో నడుస్తూ వున్న ఒక భీమాకంపెనీకి ప్రస్తుతం ఏజంటుగా వున్నాడు. దానివల్ల ఏదన్నా వాస్తవస్తే దానితోనే కుటుంబ పోషణ జరుగుతూ వున్నది.

# ప రి వ ర్త న ం

ఆనాడు కృష్ణశాస్త్రి ఉదయానే స్నానం చేసి చలవ చేసిన ఖద్దరు వస్త్రాలు ధరించి భార్య తీసి ఇచ్చిన గ్లాసు నారింజ రసం తాగి వసారాలో కుర్చీలో కూర్చున్నాడు. ఎదురుగా కనపడుతూ వున్న ద్రాక్షగెలల్లాగా విరియ పూసిన బఠాణీ పువ్వు గుత్తులపై ఆయన దృష్టి నిలిచింది.

మంచుకు తడిసిన ఆకులపై సూర్యకిరణాలు పడి తళ తళ లాడుతూ వున్నవి. ఆకులనుంచి కిందపడుతూవున్న మంచు బిందువులు సూర్యకిరణాలను ప్రతిఫలింప చేసుకుని విద్యుద్దీపాలవలె గోచరిస్తూ వున్నవి.

తలుపు నెట్టుకుని పోస్టుజవాను వచ్చి మీ పేరటికి రిజిష్టరు వున్నదంటూ ఒకకవరు ఇచ్చి రెండురసీదుల మీద సంతకాలు పెట్టించుకుని వెళ్లి పోయ్యాడు. కృష్ణశాస్త్రి కవరు మీద పేరు చూచాడు. వ్రాసినది రమణాచార్యులు అని వున్నది. ఆయనది ఆ గ్రామమే. ఆయన తనకు రిజష్టరీ నోటీసు ఇచ్చేపని ఏమి వచ్చిందో నని కవరు చించి చదివాడు. లక్ష్మయ్యసెట్టివద్ద ఇన్నో తేదీన నోటును ఆర్డరు పొందినట్టున్నూ ఇంత మొత్తం ఈవుత్తరం చూచిన నాలుగు రోజులలోగా తెచ్చి ఇవ్వకపోతే దావా చేసి ఖర్చులతో సహా రాబట్టుకోవడ మౌ నని వ్రాసి ఉన్నది.

ఈయన నోటు ఆర్డరుపొందే అవసరం ఏమివచ్చిందో

నని ఆలోచించాడు. నగదు ఇచ్చి కొనే తాహతు ఆయన దగ్గిర లేదు. పోనీ సెట్టే వసూలు చేసేటందుకు ఆర్డరు వేశా డనుకుందా మంటే ఆయన ఇతరులను నమ్మి ఆర్డరు వెయ్యడు. రమణాచార్యులు మాధవాచార్యులవారి బావమరిది అని చప్పున గుర్తు వచ్చింది. మాధవా చార్యులే ఈయన పేర ఆర్డరు వేయించి గ్రంథం జరిపించ చూస్తున్నా డని తెలుసుకున్నాడు. కథంతా అర్థంచేసు కున్నాడు. ఆయన ఏమీా చలించలేదు.

ఆ సంవత్సరం వడగాలుపులు విస్తారంగా ఉండడం చేత హరి శివయ్యగారి తల్లి ఎనభై ఏళ్ల వృద్ధురాలు గుటుక్కుమన్నది. దహనానికై రివాజు ప్రకారం గూడా నికి కబురు చేశాడు. పంపిన మనిషి తిరిగి వచ్చి "మేము రామని అన్నారు" అని చెప్పాడు. ఆయన మాటను తిర స్కరించి నందుకు వాళ్లపై ఈయనకు కోపం వచ్చింది. వృద్ధురాలు అందులో, మాతృదేవత మేళతాళాలతో తీసుక వెళ్లా లని ఈయన సంకల్పం. కనక తప్పెట్లు కావ లసి వున్నవి. కోపాన్ని చంపుకుని వాళ్లచేత ఎట్లాయినా ఈ కాస్త పనీ చేయించుకుని తల్లికి ఉత్తమలోకాలు గలి గించా లని ఈయన తలంపు అవడంచేత తానే స్వయంగా పోవా లను కున్నాడు. వాళ్ళకూ వీళ్ళకూ ఉన్న కక్షను బట్టి తానుపోతే బెట్టుగా వుండదేమో అనుకున్నాడు. ఎలాగయినా సరే వెళ్లి వాళ్లను తీసుక

రాకపోతే వీల్లేదని తలచి బయలుదేరి గూడానికి వెళ్లి, రమ్మని పిలిచాడు. తప్పెట్లు కావాలనిగూడా చెప్పాడు. వాళ్ళు మాకు వచ్చేందుకు తీరుబడిలేదని చెప్పివేశారు. ఎలాగైనాసరే పని నెరవేర్చుకోవాలని వాళ్ళని బతిమలాడాడు. లాభం లేకపోయింది. డబ్బు ఎక్కువ ఇస్తానన్నాడు. ప్రయోజనం కలగలా. చేసేది లేక వచ్చిన తామసాన్ని దిగమింగుకున్నాడు. ఇంటికి వచ్చి దహనాది క్రియలు స్వయంగానే నిర్వహించుకోవలసి వచ్చింది.

మాధవాచార్యులవారు ఒకనాడు కుర్చీలో పండుకుని భాగవతం చదువుతున్నాడు. ఒక సాహేబువచ్చి సలాం చేసి ఎదురుగా నిలుచున్నాడు. ఆ వచ్చినతణ్ణి చూచి ఆచార్యులవారు పుస్తకం మూసి "కూర్చో మీరా సాహెబూ" అన్నాడు.

సాహెబు కూర్చుని "ఈ సంవత్సరం గూడా మాకే ఇప్పించండి కుంట. ముందుగానే మనవి చేస్తున్నాను" అన్నాడు.

ఆచార్యుల వారికి ఒకచోట మూడు ఎకరములన్నర రేగడ భూమి ఉన్నది. దాన్ని మాగాణి చేసి వరి పండించాలని మూడు ఎకరాలకు గనాలు వేయించి మిగతా అర ఎకరం ఒక వందరూపాయలు ఖర్చుపెట్టి చిన్న చెరువులాగా తీయించి వర్షాకాలపు నీరు అందులో నిలవ చేసి ఆ నీటితో వరి పండిస్తూ వున్నాడు. ఆ చెరువు వల్ల

పంట పండేదిగాకుండా సంవత్సరానికి కొంత సొమ్ము ప్రత్యేకంగా వస్తుంది.

ఆ మాటకు ఆచార్యులవారు అన్నారు. "ఈ సంవత్సరంచాలా ఎక్కువ చేపలు వున్నవి. ఎక్కువ డబ్బు రావాలి మీా రాసాహెబూ! మొన్న నేను చెరువుగట్టు మీాద నిలుచున్నాను. ఎలా తొంగి తొంగి చూస్తున్న వనుకున్నావు బుల్లిముండలు! నిగనిగ లాడుతూ పొడుగ్గా ఎంత అందంగా వున్న వనుకున్నావు! ఇదివరికే ఒకళ్లిద్దరు అడిగారు. నీకు చెప్పందే బేరం ఇవ్వనన్నాను. ఎక్కువ డబ్బుగూడా ఇస్తా నన్నారు. నే నివ్వ లేదు. ఈ సంవత్సరం కాస్త ఎక్కువ రావాలి."

"ఎంతైనా సరేనండి, ఇతరులు అడిగిన కాడికి నాకే ఇవ్వండి" అన్నాడు సాహెబు.

ఈ మాటలన్నీ వింటూ వున్న ఆచార్యులవారి భార్య ఆండాళమ్మ ఇంటి వాకిట్లోకి వచ్చి "ఎందుకండీ వాటి ప్రాణాలు తీయించడం నే వద్దంటున్న కొద్దీ నిరుడు గూడా అమ్మారు" అన్నది.

"ఓసీపిచ్చిదానా! మనం వాటి ప్రాణాలు తీయించడం ఏమిటి? మనం అమ్మకపోయినా ఎవరో దొంగతనంగా పట్టుక వెళ్ళి వాటిని తింటారు, అమృతంలాగా మింగుతారు. ఆఖరికి ఒక్కదాన్నన్నా బతకనియ్యరు.

అప్పుడు వాటిప్రాణాలు ఎట్లాగైనా వాళ్ళు తీసేది నిజమే గదా. ఇప్పుడు మనకు వచ్చే డబ్బు వృథాగా పోగొట్టుకోవడం ఎంత తెలివితక్కువపని! అవి వాళ్ళు ఎట్లాగైనా చంపేవేగనక అమ్మితే మన కేమీ పాపం లేదు. ఇంకొక సంగతి. మన మేమీ వీళ్ళకు వాటిని చంపమని అమ్మటం లేదు. వాళ్ళుపట్టుక వెళ్ళి తినకుండా నీళ్ళల్లోవేసి పెంచుకోగూడదూ? ఇప్పుడు వాటిని అమ్మకపోతే పెద్దవి అయ్యి నీటిలోనుంచి పైకివచ్చి పైరుకాస్తా తినివెయ్యవ్రా" అన్నాడు ఆచార్యులవారు చెవులకుండనాలు ఊగులాడించుకుంటూ.

"అయ్యా! ఈ పది రూపాయిలు బయానాగా తీసుకోండి" అని పదిరూపాయిల కాగితం ఇవ్వపోయ్యాడు సాహెబు. ఆచార్యులవారు తీసుకుని "డబ్బు ఇంతని తేలందే బయానా ఎట్లా తీసుకునేది మీరాసాహెబూ? నే నొకమాట చెపుతాను. ఆ ప్రకారం పో. నిరుడు ముప్పయిరూపాయ లనుకో. ఈ సంవత్సరం జీవాలు ఎక్కువ వున్నవి గనక నలభైరూపాయలు చేసుకో. అదీ నీకనే. మరి ఒకళ్ళకైతే ఈ ధరకు ఇవ్వను" అన్నారు ఆచార్యులవారు.

"కాదండీ, అయ్యా! కొంచం తగ్గించండి. దానివల్ల జీవించేవాళ్ళం. నాలుగు రూపాయలు మిగిలితే మీ పేరు చెప్పుకుని తింటాము" అన్నాడు సాహెబు,

"అందుకనే పాపం తగ్గించి చెప్పాను మీరా సాహెబూ! నీకు అందులో లాభం రావాలి కాని అయ్యా వారికి నాలుగు రూపాయలు ఎక్కువఇస్తే నీకు నష్టమవు తుందా? అయ్యావారికి ఎంత ఎక్కువఇస్తే అంత నీకు జయ మనుకో. నేనన్నాగా లాభంవచ్చింది స్వామీ అని ఇంకా రెండు రూపాయలు సమర్పించక పోతావేమో చూడు! నే నన్నానంటే తిరుగు లేదు. బ్రహ్మవాక్యం చెల్లిపోవలిసిందే! ఏమీ సందేహించబోకు" అన్నాడు ఆచార్యులవారు.

సాహెబు "సరే తమదయ" అంటూ తలగుడ్డ బిగువుగా మళ్ళీ చుట్టుకుంటూ వెళ్ళిపోయ్యాడు.

## ౬

ఒకనాటి సాయంత్రం కృష్ణశాస్త్రి తన ఇంటి వసారాలో కుర్చీలో కూర్చుని పత్రిక చదువుకుంటూ ఉండగా సూరదాసూ రామస్వామీ సోమన్నలు వచ్చి నమస్కారం చేసి ఒక కాగితాన్ని బల్లపైన పెట్టి చాప మీద కూర్చున్నారు.

కృష్ణశాస్త్రి ఆ కాగితాన్ని చూచి విస్మయంతో "ఈ నోటు మీకెట్లా వచ్చింది ? నేను లక్ష్మయ్య సెట్టికి వ్రాసి ఇచ్చిన నోటే ఇది." అన్నాడు.

"మేము కట్టివేసి తెచ్చామండి" అన్నాడు సూరదాసు.

ఆ మాట అర్థంకాక "ఏమి కట్టివెయ్యడం, ఏమి తేవడం?" అన్నాడు తొందరగా కృష్ణశాస్త్రి.

"మాధవాచార్యుల అయ్యవారు బాబుగారిని ఇబ్బంది పెట్టాలని చూస్తున్నాడని విన్నాము. దానికి కారకులం మేమే గదా అని చాలా చింతించాము. మే మీ ఖద్దరు పరిశ్రమలో ప్రవేశించి నెల దాటిందండి. తమ అనుగ్రహంవల్ల కడుపునిండా వేళకు ఇంత అన్నం తిన్నది పోగా, పోయిన నెలకు తలా రెండు రూపాయలూ వెనక పడ్డయ్యండి. మీకొచ్చిన చిక్కు మాకు వచ్చినట్టే. అందువల్ల రాట్నానికి ఇంతని వేసుకున్నామండి. కొద్దిగా తరుగుపోతే ఒకచోట తెచ్చి మొత్తం సొమ్ము అయ్యవారికి కట్టివేసి, నోటు తెచ్చామండి" అన్నాడు సూరదాసు.

ఆ మాటలకు కృష్ణశాస్త్రి అయాచితమైన వాళ్ల ఆదరణకూ, సహజ సద్గుణోపేతమైన వాళ్ల కృతజ్ఞతకూ, నిష్కళంకమైన వాళ్ళ అమాయక ప్రేమకూ, ఆశ్చర్యపడి "సూరదాసూ! మీ రిట్లా చెయ్యటం నాకేమీ బాగుండ లేదు. అసలే పేదవాళ్ళు పాపం! మీరు ఇంత సాహసం చెయ్యడం మీ స్తితికి తగనిపని. నాకు ఏమాత్రం ముందు ఈ విషయం తెలిసినా మిమ్మల్ని ఈ పని

చెయ్యనిచ్చే వాడిని కాను. గ్రామంలో ఎవరికన్నా తెలిస్తే మిమ్మల్ని పీడించి డబ్బు తీసుకున్నానని గబుక్కున వెనకా ముందు చూడకుండా అంటారు. నన్నేమీ చెయ్యడానికి వాడికి చేతగాదు. కావలసివస్తే బాకీకి సరిపోను ఆస్తి కట్టుక వెళ్ళేవాడు" అన్నాడు.

"అయ్యా! తమ రట్లనకూడదు. తమరు మాకు చేసిన సహాయం జన్మ జన్మాలకూ మరిచిపోదగ్గదికాదు. మేము చేసింది చెప్పుకోదగ్గ విశేషం అందులో ఏమీ లేదు. ఏదో ఉడుతా భక్తిగా మీపై మాకు భక్తిఉన్నట్లు వెల్లడి చేసుకున్నాము అంతే"అన్నాడు సోమన్న.

"తమకు తెలియనిస్తే అసలు ఈ పనికి ఒప్పుకోరని తమకు తెలియకుండా చేసినందుకు క్షమించాలి" అన్నాడు రామస్వామి.

"ఆచార్యులవారి దగ్గిరైతే అసలే వీలుపడేదికాదు. నోటు దావాచెయ్యమని ప్లీడరుకు ఇచ్చివచ్చాడు. మేము ఆ ఏవతోనే వుండడంచేత సంగతి వెంటనే తెలుసుకున్నాము. తొందరగా పోయి గుమాస్తాకు రెండు రూపాయిలు ఇచ్చి ప్లీడరుకు సొమ్ము చెల్లించి నోటు తెచ్చాము" అన్నాడు సూరదాసు.

కృష్ణశాస్త్రి నోటు తీసుకుని "నే చేసిన కాస్త పనికి ఎన్నోరెట్లు అధికంగా మళ్లీ వెంటనే నాకుసహాయం చేసినందుకు మీ ఉత్తమగుణాలు మెచ్చుకోదగ్గవి"అన్నాడు.

ఒకనాడు మాధవాచార్యులతో హరిశివయ్య "చూచారా వాళ్ళ కెంత గర్వం బలిసిందో! మొన్న నేను స్వయంగా గూడానికి పోయి పిలిచాను. నా మాట తిరస్కరించివేశారు. ఎక్కువ డబ్బిస్తానన్నా వాళ్ళకు లెఖ్ఖ లేక పోయింది. వాళ్ళని పట్టేందుకు వీల్లేకుండా వున్నది" అన్నాడు.

"ఇంకెందుకు మన మాటలు వింటారండీ? కిష్టిగాడి మహిమ ఇది. వాడు వాళ్ళని మీారబెట్టి వేశాడు. ఇంకా ఈ సంగతి విన్నారా? వీడు ఆ మాలవెధవలను యాచించి నోటు డబ్బు కట్టివేయించాడు. వాళ్ళని అడుక్కునేటంత హీనమైన బతుకు బతకడానికంటే దేనిలో నన్నా పడి కళ్ళు మూసుకో కూడదూ! ఎవడు బతకమని ఏడిచాడు వెధవబతుకు! నే పెట్టుకున్న యత్నం అంతా భగ్నం చేశాడు." అన్నాడు ఆచార్యులవారు.

"ఈ సంగతంతా నే విన్నాను. పెట్టుకున్న ఏర్పాటు చెడిపోయింది" అని ఆయన చెవులో మెల్లిగా ఏదో వూదాడు హరిశివయ్య.

"మీారుచెప్పింది చాలా బాగా వున్నది. ఈ దెబ్బతో వాళ్ల దుంప తెగుతుంది! చూడండి, సూరన్న వట్టి అమాయకుడు గాని వాణ్ణి వదిలివేసి కిష్టిగాడిపేరు తప్పక చేర్చండి" అన్నాడు ఆచార్యులవారు.

ఆ మాటలకు సూరదాసు మీద అభిమానం చూపి నందుకు హరిశివయ్యకు వధకుడు వధ్య పశువును దయ దలచి విడిచి నట్టయింది. "ఏం వాడంటే అంతఅభిమానం గలిగింది మీకు? అసలు పోట్లాటకు కథానాయకుడే వాడై తే. వాణ్ణివదిలితే కర్ణుడు లేనిభారతం లాగా వుంటుంది" అన్నాడు.

"అట్బే కాదు నా మనస్సు ఎందుకోనండీ అట్లా పోయ్యి అన్నాను. వాడిమీద నాకేమి అభిమానం? నిజంగా వాణ్ణించే ఈ తగవంతా వచ్చింది. నాకుమాత్రం తెలియదా" అన్నాడు ఆచార్యులవారు.

వెంటనే గవర్నమెంటుకు ఆకాశరామన్న అర్జీ ఒకటి పోయింది. అది చూచి అధికారి మునసబూ, వెట్టి వాళ్ళూ మొదలైన సిబ్బందితో మాలగూడానికి వచ్చాడు. ఆ సిబ్బంది అంతా రోడ్డునే గూడానికి పోతుంటే, హరిశివయ్య వాళ్ల అరుగుమీద నిలుచుని రెప్పవెయ్యకుండా చూచి ఆనందించాడు. గూడెంలో జనం వాళ్లని చూచి భయపడ్డారు. సూరదాసూ రామస్వామీ మొదలైనవాళ్ళను "మీ మీద చెరువులో తుమ్మలు కొట్టి నందుకు కేసు వచ్చింది. ఏమి జవాబు చెపుతారు" అని అధికారి అడిగాడు. వాళ్ళ ఇళ్ళూ దొడ్లూ అన్నీ సోదా చూచారు. సొత్తు ఏమీ కనిపించ లేదు. వాళ్ళు "మే మే పాపం ఎరగము" అని జవాబు చెప్పారు.

న్యాయాధికారి వాళ్ల దగ్గర స్టేటుమెంట్లు తీసుకున్నాడు. ఆ సిబ్బంది అంతా కృష్ణశాస్త్రి ఇంటికి వెళ్ళింది. "గూడెం జనం కొందరిని ప్రోత్సాహించి చెరువులో తుమ్మలు కొట్టించావని నీ మీద అర్జీ వచ్చింది. ఏమి చెబుతావు" అని న్యాయాధికారి కృష్ణశాస్త్రిగారిని అడిగాడు. "ఇదంతా విరోధాల వల్ల జరిగింది. నే నేమీ ఎరగను" అన్నాడు కృష్ణశాస్త్రి. అదంతా వ్రాసుకున్నాడు న్యాయాధికారి. అక్కడనించి వాళ్లంతా చెరువుకు వెళ్లారు. చెరువులో రెండు తుమ్మలుమాత్రం కొట్టి వున్నవి. కొట్టిన తుమ్మలు అక్కడలేవు. మోళ్ళుమాత్రం కనపడుతూ ఉన్నవి. అదంతా న్యాయాధికారి చూచి వ్రాసుకున్నాడు. ఆ న్యాయాధికారి హరిశివయ్యా వాళ్ల దగ్గిర లంచం తిని ముద్దాయీలు హీన కులస్తులనీ, ఇటు వంటి పని చేసేటందుకు తగుదురనీ, వీళ్ళు నేరం చేశా రని నమ్ముతున్నాననీ, వ్రాసుకుని వెళ్లాడు.

న్యాయాధికారి తమ ఇళ్ళకు వచ్చిపోయిన దగ్గిర నుంచీ సూరదాసూ రామస్వామీ మొదలైనవాళ్ళకు అభాండంవచ్చి నెత్తిన పడ్డందుకు ఖిన్నులై కేసు ఏమి ప్రమాద స్థితికి మారుతుందో నని చాలా భయపడ్డారు. వాళ్లంతా కృష్ణశాస్త్రి ఇంటికివెళ్లి దీనవదనాలతో ఆయ నతో మొరపెట్టుకున్నారు.

ఆయన "ఇదంతా వాళ్ళుచేసిన దుర్మార్గం. ఇంకా

నయం! నరికిన తుమ్మలను మన దొడ్లల్లో వేసి పోలేదు. వేసినట్లయితే కొంప మునిగేది. ఇప్పుడిది ఏమీ కాదు. మీరేమీ భయపడవద్దు. అన్నిటికీ నేనున్నాను" అని ధైర్యం చెప్పాడు.

వాళ్ళంతా ఇంటికి వచ్చారు. వాళ్ళ మనస్సు లేమీ కుదురుగా లేవు. గ్రామమునసబు వాళ్ళని గ్రహం పట్టి నట్టు పట్టి, కేసు మీమీద నిల్చిపోయిందనీ, అధికారి నాతో చెప్పాడనీ, మీ దుంప తెగుతుందనీ, భయపెట్టి కేసు పొయ్యేమార్గం నే చేస్తాననీ, ముందు గుమాస్తా లను కట్టుకోవాలనీ, వాళ్ళ కేదో ఇంత మేత వెయ్యాలనీ, అటువచ్చిపదీ, ఇటువచ్చిపదీ, రాలినవరకు రాలగొట్టు కున్నాడు. వాళ్ళు అమాయకు లవటంచేత అతని మాటలు నమ్మి కేసు పోతే చాలని అడిగినంత డబ్బూ ఇచ్చారు.

అందరికీ నోటీసులు వచ్చినవి. వాళ్ళకు ప్రాణాల్లో ప్రాణాల్లేవు. దిగులుతో కూళ్ళుగూడా తినడం మానివే శారు. వాయిదానాటికి అందరూ గడగడలాడుతూ కచే రీకి వెళ్ళారు. ఒకళ్ళిద్దర్ని విచారించి అధికారి మళ్ళీ వా యిదా వేశాడు. కృష్ణశాస్త్రికి అధికారి పోకడచూస్తే విపరీతంగా తోచింది. ఊరికినే పోతుందనుకున్న కేసుకు అవతల లంచం తిని ఏదో ముద్ర వెయ్యాలని అధికారి చూస్తున్నట్టు గ్రహించాడు. "వీళ్ళు ఏ పాపం ఎరగని

వాళ్లు. అంతా వాళ్లు చేస్తున్న మోసం. వీళ్లని ఈ ఆపద నుంచి కాపాడే దెట్లా" అని దీర్ఘంగా ఆలోచించాడు. ఒక ఆలోచన తట్టింది. వెంటనే గుంటూరు వెళ్లాడు. ఈయన దివ్యజ్ఞాన సమాజసభ్యుడు. డిప్యూటీ కలెక్టరు మహేశంగూడా దివ్యజ్ఞానసమాజసభ్యుడే. విశేషంగా సమాజంలో ఇద్దరూ కలవడంవల్ల కృష్ణశాస్త్రికి కలెక్టరుతో కొంతపరిచయం వున్నది. కృష్ణశాస్త్రి కలెక్టరు గారి ఇంటికి వెళ్లి, ఆయనతో తమ్ముల కేసు విషయం అంతా చెప్పి, వాళ్లు నిర్దోషులు, వాళ్ల కేదన్నా సహాయం చెయ్యమని కోరాడు. ఆయన చాలా సజ్జనుడు. ఆయన దగ్గరనుంచి అధికారికి వెంటనే హుకుం వెళ్లింది. పెద్దపులి తాను తింటూ వున్న సాధుమృగాన్ని సింహాన్ని చూచి వదిలిపెట్టి కాలికి బుద్ధిచెప్పినట్టు అధికారి భయపడి కేసు కొట్టివేశాడు.

## ౧౦

హరిశివయ్యగారి ఇంటికి అయిదారుగజాల దూరంలో వాళ్ల పెద్ద గొడ్లచావడి వున్నది. అందులో ఏభై అరవై పశువులకు తక్కువలేకుండా ఉంటూ వుంటవి. ఒకనాటి తెల్లవారిఝామున ఒక చిరుతపులి చావట్లోకి ప్రవేశించింది. ఆ గ్రామానికి మైలు దూరంలో

కొండ వున్నది. దాని మీదనించి వచ్చిందో మరి ఎక్కడినించి వచ్చిందో వచ్చి లేగదూడను వేసి రక్తం పీలుస్తూ వున్నది. లేగదూడ ఆర్తనాదానికి అక్కడ నిద్రపోతూ వున్న జీతగాడు కంగారుపడుతూ లేచాడు. సన్నగా వెలుగుతూ ఉన్న బుడ్డి దీపం కాంతిలో దూడనుతింటూ పులి కనిపించింది. వాడు గాభరాతో "పులి పులి" అని పెద్దగా అరిచాడు. ఆ కేకలకు పులి బెదిరి సావట్లో ఒక వడ్లకొట్టు వుంటే పైన వడ్లు పోసేటందుకు ఏర్పరిచిన కిటికీలాంటి చిన్న కంత తలుపు తెరిచివుంటే అందుట్లో జొరబడ్డది.

వాడి కేకలకు హరిశివయ్య నిద్ర లేచాడు. సంగతి అంతా విన్నాడు. కాళ్ళు భూమ్మీద ఆనలేదు. దడ పుట్టుక చక్కావచ్చింది. నోట మాట రాలేదు. ఎక్కడ మీదబడి కొరికి పారవేస్తుందో అని భయంతో భార్యా బిడ్డలను లేపుకుని ఇల్లు విడిచి కాలికి బుద్ధిచెప్పాడు. జీతగాడు ఇక అంతే లేదు. ఇంతలోకి తెల్లవారింది. ఈ వార్త గాలికంటే వేగంగా గ్రామంలో వ్యాపించింది. ఎక్కడ ఎవరి ఇంటిమీదికి వచ్చి చంపివేస్తుందో నని ఊరంతా గడగడలాడి పోయింది. అందరూ తలుపులు బిగించుకున్నారు. బజార్లల్లో జనసంచారం ఆగిపోయింది.

ఈ వార్త గూడానికి తెలిసింది. గూడెమంతా కదిలి హరిశివయ్యగారి ఇంటిముందుకు వచ్చింది. లోపలికిపోయి

పై కంత తలుపు వేస్తే పులి చిక్కినట్టే అని వాళ్ళల్లో వాళ్ళు అనుకున్నారు. తలుపుమాట అట్లావుంచు, లోపలికి వెళ్ళేటందుకే ముందు ఎవ్వరికీ ధైర్యం ఆగడంలేదు. ఏమీ తోచక అట్లాగే నిలబడ్డారు. ఇట్లా చూస్తూవుంటే లాభం లేదని ఆ జనంలో నుంచి జాలయ్య ముందుకు వచ్చి నేను వెళ్ళి గొళ్ళెం పెట్టి వస్తానని మొళ్ళో వరలో వుంచిన బాకు చేత్తో పట్టుకుని రివ్వున వెళ్ళి ఇంటికి గొళ్ళెంపెట్టి తిరిగివచ్చి వాళ్ళందరికీ సంతోషం గలిగించాడు. పులిని ఇంట్లో బంధించారని తెలిసి జనం తలుపులు తీసుకుని బయటికి రావడం మొదలు పెట్టారు. కాసేపటికల్లా హరిశివయ్యగారిఇంటి ముందుబజారంతా జనంతో క్రిక్కిరిసిపోయింది.

పులినిఇంట్లోబంధించిన సాహసు డెవడని జనం ఆశ్చర్యపడ్డారు. అదిఇంట్లో గాండ్రిస్తూ వున్నప్పుడల్లా, జనం హడలెత్తి పోతూ వున్నది. గవర్నమెంటుకు తెలియ జేసి తుపాకీలతో చంపించాలని కొందరు వుద్దేశపడ్డారు. ఆ వూరిలో పోలీసు స్టేషను లేనందున నాలుగుమైళ్ళు పోయితీసుకరావాలి. అంతదూరం వెళ్ళివచ్చేలోగా తలుపును బద్దలు గొట్టిగానీ, ఇంటిపై కప్పును ఎగరగొట్టిగానీ, ఎక్కడమీదబడి జనాన్ని కొరుకుతుందోనని మళ్ళీభయపడ్డారు. ఆలస్యానికి జనం ఏమాత్రం ఒప్పుకోవడం లేదు. త్వరగా దాన్ని చంపే వీలు ఏమీ కనుపించలేదు. జనం

త్తరపడు తున్నది. తలా ఒకమాటా మాట్లాడుతూ వున్నారు. ఆ ధ్వని మిన్ను ముట్టుతూ వున్నది.

ఇంతలో జనాన్ని ఒత్తిగించు కుంటూ అంబులూ, విల్లనంబునూ, చేదాల్చిన ఒకవ్యక్తిని జాలయ్యె వెంట బెట్టుకుని తీసుకవస్తూ, "మీరేమీ భయపడ వద్దు. ఇం కొక నిమిషానికల్లా పులిని చంపివేస్తాము. మీ రందరూ సంతోషంగా చూడవచ్చు" అని కేకవేశాడు. ఆ కేకకు జనం అంతా నిశ్శబ్దం అయింది. నూతన వ్యక్తిని జనం వింతగా చూస్తున్నారు. జనాన్ని ఒత్తిగించుకుని ఆ ఇద్ద రూ వస్తుంటే తాటకను చంపటానికి వెళ్లుతూ వున్న రామలక్ష్మణులను మరిపించారు. ఆ నూతనవ్యక్తి పోతన్న, హరిజనుడు, ఆ వూరి గూడెం నివాసి. విలువిద్యలో మంచి నేర్పరి. ఇంట్లో రాట్నం తిప్పుతూ వున్నతనికి జాలయ్యె సంగతంతా చెప్పి విల్లనంబుతో పోతన్నను వెంట బెట్టుక వచ్చాడు.

ఇద్దరూ ఇంటిపై కప్పు మీదికి ఎక్కారు. పెంకులు తొలిగించి కాస్త బెజ్జంచేసి, పోతన్న గురిచూచి పులి నుదురుపైకి ఒక అంబు విడిచాడు. అది ఇల్లు అదిరి పొయ్యేటట్టు గాండ్రిస్తూ రబ్బరు బంతిలాగా పైకెగిరింది. మళ్ళీ రెండో దెబ్బ గురిచూచి గుండెకు వదిలాడు. ఆ దెబ్బతో కిందపడి ప్రాణం వదిలింది పులి. జాలయ్యె "పులి చచ్చిపోయింది" అని సంతోషంతో పెద్ద కేక

పెట్టాడు. జనం అంతా ఆ కేకవిని తమ ప్రాణాలు దక్కినట్టు సంతోషించారు. వాళ్ళిద్దరూ కిందికి దిగి తలుపు తెరిచి లోపల చచ్చిపడివున్న పులిని పట్టి బయటికి తీసుకవచ్చారు. అప్పుడు ఎక్కడనుంచో హరిశివయ్యగారు వచ్చి మా ప్రాణాలు కాపాడా రంటూ సంతోషంతో జాలయ్య పోతన్నలను కౌగలించుకున్నాడు. జనం అంతా మూగింది. పులిని ఇంట్లో వుంచితే జనం పట్టదని బయటికి తీసుకవచ్చి ఎత్తుగావున్న ప్రదేశంమీద పెట్టారు. జనం తండోపతండాలుగా వచ్చి, ఆరోజు పని పాటలు మానివేసి అదో వింతగా చూస్తున్నారు. పొరుగూళ్ళనుంచి గూడా జనం వచ్చి చూచి పోతూ ఉన్నారు. వచ్చిన జనంలో పోతన్ననూ, జాలయ్యనూ పొగడని వాళ్లు మచ్చుకైనా వుండరు.

పసిబిడ్డలతో చూడవచ్చిన తల్లులు "ఏడ్చావంటే అదిగో బూచి కరుస్తుంది!" అని పిల్లలను భయపెడుతూ వున్నారు. హరిశివయ్యగారు ఆ మరునాడు ఇద్దరికీ పెళ్ళికొడుకుల్లాగా భోజనం పెట్టి, పోతన్నకు పదిరూపాయలూ, జాలయ్యకు అయిదు రూపాయలూ ఇచ్చి బహూకరించాడు. పోతన్నకు పులిని చంపినందుకు గవర్నమెంటు వద్దనుంచిగూడా కొంత బహుమానం వచ్చింది.

కృష్ణశాస్త్రి తనను చూడవచ్చిన వనమాలి అనే ఒక స్నేహితుణ్ణి వెంటబెట్టుకుని గూడానికి వెళ్ళాడు.

ఇంటింటికీ తీసుక వెళ్ళి చూపాడు. ఒక ఇంట్లో చెప్పులు కుడుతూ వున్న ముసలివాడిని చూచి వనమాలి అన్నాడు. "ఏం తాతా! నువ్వింకా వీటిని వదల్లేదు."

"అవును నాయనా! మా పాట్లోకల్లా ఇప్పుడు నేనొక్కడినే ఈ పనిచేస్తున్నాను. గ్రామస్థులుగానీ, ఇతరులుగానీ, ఎవరైనా అవసరంపడి మా పాట్లోకి వస్తే వారిని రిక్తగా పంపించలేక వాళ్ళసహాయార్థం అవసరం గడిపేటందుకు నేనీపని చేస్తున్నాను" అన్నాడు ఆ ముసలివాడు.

"చర్మాలు నువ్వే తయారుచేస్తావా" అన్నాడు వనమాలి.

"లేదు బాబూ! పశువులను చంపటం మానివేసిన తర్వాత చర్మాలు ఊనేపని గూడా మానుకున్నాము. సూరదాసు పుణ్యమా అని చీకట్లోనించి తెరపికి వచ్చాము. ఆ దుర్గంధం ఆ అసహ్యంనుంచి దాటాము. పూర్వపు చెడ్డరోజులు పోయి మంచిరోజులు వచ్చినవి. చర్మాలు కావలసిన మట్టుకు ఇతరగ్రామాల్లో తయారు చేసినవి కొని తెస్తాను" అన్నాడు ఆముసలితాత.

"సరే మంచిదేకాని ఆ చర్మాలుగూడా కొనడంలో పశువధను ప్రోత్సాహించి నట్టవుతుందే మరి" అన్నాడు వనమాలి.

"కానివ్వవోయ్, గడపఎక్కినవాళ్లు ఇంట్లోకి రాకుండా

పోతారా! నిదానం మీద అది గూడా తెలుసు కుంటారు" అన్నాడు కృష్ణశాస్త్రి.

"ఎలాబాబూ! ప్రజలకు చర్మం చాలా అవసరం గదా. ఇంకేవిధంగా దొరకాలి? కాళ్ల చెప్పులూ, డబ్బు పెట్టుకునేటందుకు జేబులోకి సంచులూ, అందంగా చేతికి కట్టుకునే టందుకు గడియారపు తోళ్లూ, బిగువుగా వుండేందుకు నడుం పట్టాలూ, ఇవన్నీ జంతువులు చావక పోతే ఎలా వస్తాయి బాబూ? అవి వాడడం తగ్గించు కున్నప్పుడు ఆ పని చేసేవాళ్లే వుండరు. అప్పుడు చర్మం కొనవలసిన అవసరం ఏమీ వుండదు" అన్నాడు ఆ ముసలాయన.

"బలే అసాధ్యుడివి తాతా నువ్వు! ఆఖరికి ప్రజల మీదనే యుక్తిగా ఆ నెపం కాస్త నెట్టివేశావు. చర్మం అవసరం మనిషికి లేకపోలేదు. అయితే ఎలాంటి చర్మం ఉపయోగించుకోవాలంటే చనిపోయిన పశువుల కళేబరాల చర్మాలు నిరభ్యంతరంగా ఉపయోగించుకో వచ్చు. న్యాయం గూడా అలాగే చెపుతూ వుంది. చని పోయిన జంతు చర్మాలే తప్ప ఇతరం మీరు వాడ కూడదు. అలా మీలో ప్రతివాడూ శపథం చెయ్యాలి. వధించిన పశు చర్మాలు మీ రెప్పుడైతే కొనలేదో, అప్పుడు వధకునికి నష్టం వచ్చి ఆ పనియందు వాడు

విముఖుడౌతాడు. హింస చాలావరకు తగ్గిపోతుంది” అన్నాడు వనమాలి.

ఎక్కడ తగ్గడం బాబూ! దానివల్ల జీవించే వర్తకులు మారు బేరాలకి కొంటూ, ముందు తెగే పశువుల చర్మాలకి కూడా బయానా లిస్తూ వున్నారు. వాళ్లకి లాభాలకి లాభాలు ఇచ్చి మళ్లీ వాళ్ళదగ్గిర దొరలు కొంటారట” అన్నాడు తాత.

“వాళ్లే అన్ని విధాలా మన కొంప తీస్తున్నది” అన్నాడు వనమాలి.

ఇద్దరూ తిరిగి ఇంటికి బయలుదేరారు. “ఇళ్లూ, వాకిళ్లూ, శుభ్రంగా వున్నవి. జనం నాగరికతకు తిరిగింది. గూడెం చాలా బాగా వున్నది” అన్నాడు వనమాలి కృష్ణశాస్త్రితో.

“సూరదాసుని ఇందాక చూచావు గదుటా? అతని వల్లనే గూడెం బాగుపడ్డది” అన్నాడు కృష్ణశాస్త్రి.

“అంతేనోయ్,మన మల్లా పైన మెరుగుపెట్టేవాళ్లమే. బంగారం అంటూ ఒకటి వాళ్లు సంపాదించుకున్నాక కదూ మెరు గనేది? చూడు ఆ పెద్ద అరుగుల ఇంట్లో రాట్నం తిప్పుతున్నది ఎర్రగా వాలుజడ వేసి, ఎంత చక్కగా వున్నదోయ్! ఆపిల్ల ఎవరు?” అన్నాడు వనమాలి.

"ఏమోయ్ మాలీ! మోహించినట్టున్నావు. పెళ్లి చేసుకుంటావా, ఏమిటి చెప్పు? ఇప్పుడే ఖాయపరుస్తా. నువ్వు మాలివీ, ఆమె మాలెతా, ఇద్దరికీ భేదం ఏమీ వుండదు" అన్నాడు నవ్వుతూ కృష్ణశాస్త్రి.

"ఒకటి ఉండి ఏడ్చిందోయ్, లేక పోతే ఢంకామీద దెబ్బకొట్టి పెండ్లాడే వాడిని, చూచావు తమాషా! ఏమి రూపమోయ్, రంభ ఏమన్నా భూలోకంలో అవతరించిందేమో ననిపిస్తుంది. మగవాడి కళ్ల ఎదట హంస లాగా తిరిగితే చాల దుట్టా అటువంటిది?" అన్నాడు వనమాలి.

"సినిమా విరహంలాగా వున్నదేరా అబ్బాయీ నీది! కావలిస్తే చూడు, ఈ కాయకష్టం అంతా ఎందుకు?" అన్నాడు కృష్ణశాస్త్రి.

ఇట్లా మాట్లాడుకుంటూ ఇద్దరూ ఇల్లు చేరారు.

ఆ తెల్లవారి ఇద్దరూ రైలుస్టేషనుకు వెళ్ళారు. ఏవో రెండు తెలుగు పత్రికలు కొని రైల్లో కూర్చున్నారు. ఒకపత్రిక బల్లపై పెట్టి ఒకపత్రిక ఇద్దరూ చూస్తున్నారు. రైలు సాగింది. ఆ పెట్టెలో జనం క్రిక్కిరిసి వున్నది. ఆ జనం మొత్తానికి పత్రికలు కొన్నది వీళ్ళే అవటంచేత, వాటివంక కుర్రవాడు ఎదుటికుర్రవాడు తింటూవున్న మిఠాయిని చూచినట్టు కొందరు చూస్తున్నారు. బెల్లా

నికి చీమలు మూగినట్టుగా ఆ పత్రికలకు ఒక్కొక్కళ్ళే మూగుతూ వున్నారు. పెట్టెచివర కూర్చున్న ఒకాయన ఆ జనాన్నంతా తప్పుకుని వీళ్ళ దగ్గిరికి వచ్చి "ఆ పత్రిక కాస్త ఇవ్వండి చూచి ఇస్తాను" అన్నాడు.

వనమాలి ఆ మనిషిని ఎగాదిగా చూచాడు. కోటూ బూటుతో కనిపించాడు. ముఖంచూస్తే చదువుకున్నట్టే వున్నది. "ఏవూరు బాబూ! మీది?" అన్నాడు. "మాది విశాఖపట్నమండి" అన్నాడా వ్యక్తి. "అయితే ఏ అయిదురూపాయలో రైలువాడికి దానంచేసిన ఉదారుడివి. పత్రికావాళ్ళకు ఒక్క అణా విరాళం ఇవ్వకూడదూ? వాళ్ళేం దేశానికి ద్రోహం చేస్తున్నారని కోపం" అన్నాడు ముఖానే వనమాలి.

ఈ మాటలకు నిలువునా మాడిపోయ్యాడా పెద్ద మనిషి. ఇంత ముఖం చేసుకుని సిగ్గుతో కిక్కురు మన కుండా వెళ్ళి తన చోట్లో కూర్చున్నాడు. అక్కడ కూర్చున్న అందరికళ్ళూ వనమాలిమీద పడ్డవి. అది వరకు పత్రికను అడిగి తీసుకోవాలని ఉవ్విళ్ళూరుతున్న వాళ్లందరూ ఈ దెబ్బతో తమ వుద్దేశాలు మరల్చు కున్నారు. "ఆ మనిషిని చిన్నపుచ్చావురా పాపం పెద్ద మనిషిలా గున్నాడు" అన్నాడు కృష్ణశాస్త్రి.

"ఎవడైతే ఏమి? ఆ జనాన్నంతా తప్పించుకరాక పోతే ఏం కొంప మునుచుకపోయిందని చెప్పు? ఒక అణా

పారవేసి పత్రిక కొనుక్కో కూడదూ? డబ్బు సద్వినియోగం చెయ్యడానికి ప్రాణం ఒప్పదు. ఇప్పుడు చుట్టా, బీడీ, సిగరెట్లూ అని కేక వెయ్యనివ్వు. తలగుడ్డల్లోనుంచి దూకుతవి చుట్టలకు డబ్బులు. ఇక బీడీలకు సరేసరి. జేబుల్లోనుంచి రాగి వర్షం కురుస్తుంది. ఇక సిగరెట్లకు పెట్టె పావలా అన్నా సరే మణిపర్సుల్లోనుంచి గిరవాటు వేసి కొంటారు. అందులో ఇండియాలో చేసిన సిగరెట్లు పనికి రావు. దొరలుచేసినవైతే రెట్టికిరెట్టి డబ్బిచ్చి అయినా కొంటారు. అదంతా ఎందుకు? ఏ టిక్కెటు కలెక్టరన్నా బెదిరిస్తే మెదలకుండా వాడికో పావలాడబ్బులు సమర్పించి దణ్ణం పెడతారు గాని అర్ధణా ఇచ్చి అయినా పత్రిక కొనడానికి ప్రాణంపోతుంది. మనవాళ్ళకున్న తెగులే ఇది" అన్నాడు వనమాలి. ఈ మాటలను అక్కడ కూర్చున్న జనమంతా విన్నారు.

రైలు గుంటూరు చేరింది. జనం దిగుతున్నారు. పత్రికలమ్మే కుర్రవాడొకడు "కృష్ణా, ఆంధ్ర, ప్రజామిత్రా, వాహినీ" మొదలైన పేర్లు అరుచుకుంటూ రైలువద్ద అమ్ముతున్నాడు. కృష్ణశాస్త్రీ వనమాలీ ఎక్కిన పెట్టెలో కూర్చున్న వాళ్ళలో ఏడెనిమిదిమంది పత్రికలు కొన్నారు. అది చూచి "చూచావుట్రా నా దెబ్బంటే, వాళ్ళందరిచేత పత్రికలు కొనిపించాను"

అన్నాడు వనమాలి కృష్ణశాస్త్రితో. "నువ్వంటే ఎక్కడా?" అన్నాడు కృష్ణశాస్త్రి.

ఆ రాత్రి గుంటూరులో వుండి తెల్లవారి అయిదారు మగ్గాలూ, వాటికి కావలసిన యావత్తు పరికరాలూ, నేత పనిలో నిపుణులైన నలుగురు వాలంటీర్లనూ తీసుకుని ఇద్దరూ ఇల్లు చేరారు. గూడెంవాళ్లకు పని నేర్పేటం దుకుగాను ప్రస్తుతం రెండు మగ్గాలు పట్టారు. పడుగు తోడడం, సరి చెయ్యడం, అచ్చు అతకడం, మొదలైన పనులు వాళ్లకు సొంతంగా నేర్పేటందుకు వాలంటీర్లు నాలుగు మాసాలు అక్కడ ఉండవలసి వచ్చింది.

## ౧౧

మాధవాచార్యులవారి భార్యకు జబ్బుచేసింది. చాలా అపాయస్థితిలో ఉన్నందున బతకదని మాధవాచార్యులు పసిపిల్లవాడిలాగా రోదనం చేయడం మొదలు పెట్టాడు. గుంటూరునించి రాధాకృష్ణాచార్యులూ, ఆయన భార్యా వచ్చారు. ఇంకా బంధువులు చాలామంది వచ్చారు. కూతుళ్ళు ఆమె మంచం దగ్గిర చేరి ఏడ్వడం ప్రారంభించారు. తతిమ్మావాళ్ళు కుప్పగూలి పోయ్యారు. క్రాపూ, కోటూ, బూటుతో వున్న ఒక వైద్యుడు వచ్చి ఇరవై రూపాయలు రాలగొట్టుకుని కాస్త ఆ మందూ,

ఈ మందూ వాడి, నావల్ల కాదని తిరిగి చూడకుండా వెళ్లి పొయ్యాడు. జుట్టుముడీ, చొక్కా, కట్టుపంచీ, సామాన్యదుస్తులు గల మరి ఒకవైద్యుణ్ణి పిలుచుక వచ్చారు. అతడు రోగిని చూచి "వాతాధిక్యంచేత మనిషి బిగుసుక పోయింది. నరాలు బిగుసుక పోయినవి. అరగంట లోపుగా చిన్న గంపెడు వావిలాకు తెస్తే ఈమెను బతికిస్తాను" అని ఖండితంగా అన్నాడు.

అంత ధైర్యంగా ఇదివరకు వచ్చిన వైద్యులు ఎవ్వరూ చెప్పనందున మాధవాచార్యులు మొదలైన వాళ్ళకు కొంత ఆశ గలిగింది. గంపెడు వావిలాకు పట్టుపట్టుమంటే అప్పుడు ఎక్కడ దొరుకుతుంది. మాధవాచార్యులు ఆలోచించాడు. ఆయనకు తెలిసినంతవరకూ వావిలాకు చెట్టు ఆ వూళ్ళో కనిపించలేదు. పొరుగూరు పంపన్నా, లేక ఏ యేనాదివాడిచేతన్నా తెప్పించాలి. దానికో రోజు వ్యవధిపడుతుంది. అందాకా ఇక్కడ రోగి ఆగే టట్టు లేదు. మాధవాచార్యులవారికి గుండె తీవ్రంగా కొట్టుకో సాగింది. ఖేచరత్వంచేత ఎగిరన్నాపోయి ఆకు త్వరగా తేవా లన్నంత తీవ్రం ఆయనకు కలిగింది.

"గుంటూరులో వున్నది. నేను అర్జంటుగా కారు మీదపొయ్యి ఆకు తెస్తాను" అన్నాడు రాధాకృష్ణాచార్యులు.

"అందాకావుంటే రోగి జీవించదు. ఈ వూళ్ళోనే

వావిలాకు ఉన్నది. దబ్బున తీసుకరాండి" అన్నాడు వైద్యుడు.

ఆ మాటకు మనస్సుకు కొంత శాంతం కలిగి "ఎక్కడ ఎక్కడ!" అని తొందరగా అన్నాడు మాధవాచార్యులు.

"మాలపల్లెలో సూరదాసు ఇంట్లో పెద్ద చెట్టు వున్నది. చాలామంది పొరుగూళ్ల నుంచి వచ్చి గూడా ఆకు తీసుక వెళ్లుతూ వుంటారు. చెట్టు అందరికీ చాలా ఉపయోగకరమైందని ఎంతో ప్రేమతో పెంచుతున్నాడు. కాస్తా కూస్తా ఇస్తాడేమోగాని గంపెడాకు అంటే చెట్టంతా కోయవలసి వస్తుంది. చెట్టు మోడుచేసుకుని మీకు అంత ఆకు ఇస్తాడని నాకేమీ నమ్మకం లేదు" అన్నాడు వైద్యుడు.

సూరదాసు ఇంట్లో ఆకు దొరుకుతుందని మాధవాచార్యులు విని ఎంత ఆకైనా తేగల నన్న ధైర్యం కలిగి వెంటనే వాయువేగంతో పాట్లోకి వెళ్లాడు.

అప్పుడు సూరదాసు రామాయణం పారాయణ చేస్తూ వున్నాడు. ఒక మూల భార్య నూలు వడుకుతూ వున్నది. ఒక మూల కుర్రవాడు పాఠం చదువుకుంటూ వున్నాడు. అట్టి సమయంలో వడివడిగా మాధవాచార్యులవారు అతని ఇంట్లో ప్రవేశించాడు. సూరదాసు ఆచార్యులవారిని అదాటుగా చూచి నివ్వెర పొయ్యాడు.

ఇంట్లోకి ఏ సర్పమన్నా వస్తే ఎంత భయం కలుగుతుందో అంత భయం అతనికి కలిగింది. మళ్లీ ఏదో కొంప మునిగిం దనుకున్నాడు. ఈ దఫా తను చదువుతూ వున్న రామాయణాన్ని లాక్కొని వెళ్లుతా డని దృఢంగా నిశ్చయించుకున్నాడు. నోట మాటరాక తెల్లపోయి చూస్తూ లేచి నిలుచున్నాడు.

"సూరదాసూ! నీవల్ల నాకొక సహాయం కావలసి వచ్చాను" అన్నాడు తొందరగా శాంతమైన గొంతుకతో దీనంగా చూస్తూ మాధవాచార్యులు.

ఆ శాంత వాక్కులకు సూరదాసుకు భయం తగ్గి కొంత ధైర్యం కలిగింది. తన వుద్దేశాన్ని మార్చుకుని "అయ్యవారికి నావల్ల ఏమి సహాయం కావలసి వచ్చింది?" అన్నాడు భక్తిగా చూస్తూ సూరదాసు.

"నా భార్య చాలా అపాయస్థితిలో ఉన్నది. గంపెడు వావిలాకు కావాలి. మీ దొడ్లో ఉన్నదని వచ్చాను. సహాయం చెయ్యాలి. ఆలస్యం చేసేటందుకు వీల్లేదు. త్వరగా ఇచ్చి పంపు" అన్నాడు మాధవాచార్యులు.

"అమ్మగారికి జబ్బుచేసిందాండీ! మీరు శ్రమపడి రాకపోతే మరిఒకరిని పంపకపొయ్యారాండీ! మీకు కావలసినంత ఆకు సమర్పించుకునేవాడిని" అన్నాడు జాలిగా చూస్తూ సూరదాసు.

## వ్యత్యాసాలు

ఆచార్యులవారిని బల్లమీద కూర్చోపెట్టి వెంటనే సూరదాసూ, అతని భార్యా, కుర్రవాడూ ముగ్గురూ పొయ్యి చెట్టుమీదపడి గంపనిండా ఆకుకోసి గంప కుర్ర వాడి నెత్తినపెట్టి, "అయ్యవారితో పోయి గంప వారింట్లో వప్పగించిరా" అని కొడుకుతో చెప్పి ఆచార్యులవారి వెంట పంపాడు. ఆచార్యులవారు శరవేగంతో ఇల్లు చేరాడు. సంజీవి పర్వతం తెచ్చిన హనుమంతుణ్ణి వానరసేన చూచినట్టు అక్కడవున్న జనం ఆచార్యుల వారిని చూచారు. వైద్యుడు అంతవరకూ అక్కడనే వున్నాడు. గంపెడాకు సూరదాసు దగ్గిరనుంచి తేవడానికి ఆశ్చర్యపడ్డాడు. నిప్పు తెప్పించి ఆకుతో గంటకాలం శ్రమపడి చికిత్స చేశాడు. ఆమె మాట్లాడింది. ఆచార్యుల వారి సంతోషానికి మితం లేదు. వైద్యుడు వెంటనే ఔషధం వాడాడు. నాలుగో రోజుకు వ్యాధిఅంతా నయం అయి పత్యానికి వచ్చింది. ఆచార్యులవారికి అప్పుడు సూరదాసు గుర్తుకు వచ్చాడు.

గూడెంలో వాలంటీర్లు పాతిక మందిని నేతకు తయారు చేశారు. వారలు వెలవడం, కండెలు చుట్టడం, పడుగుతోడడం, సరిచెయ్యడం, మగ్గాన వెయ్యడం, కమ్ములు వేసేపద్ధతీ, నేత తట్టు పడకుండా నేసేపద్ధతీ, అంతా వాళ్ళకు నేర్పి స్వతంత్రంగా అన్ని పనులూ వాళ్ళే చేసుకుని బట్ట తయారు చేసేటట్టు 'పనిలో తీర్చారు.

గూడెంలో చాలా మగ్గాలు వెలిసినవి. ధోవతులూ, చీరలూ, కండువాలూ, పేటులేకుండా సాదావి ప్రస్తుతం తయారు చేస్తున్నారు. రోజు ఒకటింటికి మనిషికి ప్రస్తుతం మూడు పావలాలకు తక్కువ లేకుండా కూలి పడుతూ వున్నది. అందరికీ జన్మలో ఎరగని తృప్తి కలిగింది. ఆ గూడెంలో తయారయ్యే వారలు చాలనందున హరిజనోద్ధరణ నిధివారు ఇంకా కొన్ని వారలు సప్లయి చేస్తున్నారు. తయారైన వస్త్రాలు ఎప్పటివి అప్పుడు వారే తీసుకుంటూ వున్నారు. కష్టించిన కష్టానికి ప్రతిఫలం నగదు పూర్వకంగా ఎప్పటి కప్పుడు వాళ్ళందరూ కళ్ళ చూస్తూ వున్నారు. పిల్లలకూ, భార్యలకూ, ఒక్కొక్క నగవంతున ఏర్పడుతూ వున్నవి. వాళ్ళ మాసిన రూపాలు మటుమాయం అయిపోయి మసివదిలిన రత్నాలవలె నిజస్వరూపాలు వచ్చినవి. వాళ్ళ కష్టాలు గట్టెక్కినవి. ఈ గూడాన్ని గాంధీగారు చూస్తే ఆయన శ్రమకు ఫలితం కలిగిందని చాలా సంతోషిస్తాడు. వాళ్ళ నీచకృత్యాలూ, క్రూర కార్యాలూ తొలిగి దేశాభ్యుదయ కరమైన ఖద్దరు పరిశ్రమలోకి వచ్చింది. అందరూ ధన్యజీవులయ్యారు. పిల్లాది మొదలూ అందరికీ సుఖ జీవనం అబ్బింది. భారత మాత ఏడ్చి ఏడ్చి కళ్లు వాచిన తన బిడ్డలను దరిజేర్చి బుజ్జగించి బంగారు తూగుటుయ్యేలలో జోకొట్టుతూ వున్నది.

## వ్యత్యాసాలు

కొన్నాళ్లు జరిగేటప్పటి కల్లా మొండిగోడలు గచ్చు గోడలయినవి. పూరి కొంపలు పెంకుటి భవంతు లయినవి. పెంకుటిళ్లు డాబాలుగా మారినవి. గూడెం నూతన వికాసంతో ప్రకాశిస్తూ వున్నది. కొత్తగా చూచిన వాళ్లు మాలపల్లె అంటే నమ్మనంతటి స్థితిలోకి మారిపోయింది గూడెం.

“గూడెంలో మగ్గాలూ అవీ పట్టి బాగా డబ్బు సంపాదిస్తున్నారు. గూడెం చాలా బాగుపడ్డది” అన్నాడు ఒకనాడు మాట మాట సందర్భంలో హరి శివయ్య మాధవాచార్యులవారితో.

“పోనీ, అందరూ బాగు పడవలసిందేగా” అన్నాడు ఆచార్యులవారు.

“చాలా సహనవంతులండీ వాళ్లు. మనం ఎన్ని ఇబ్బందులు పెట్టినా అవన్నీ ఓర్చుకున్నారు. తిరుగా మనకేమీ హాని చెయ్యలేదు సరిగదా మనకు మేలు చేశారు. మొన్న చూడండి, వాళ్లు నిలవబడి పులిని చంపక పోతే గ్రామం పని ఏమయ్యేదో! ఎంత ధైర్యవంతులండీ వాళ్ళు. మే మంతా భయపడి ఇంట్లో నించి వెళ్లి పొయ్యాము. పాపం వాళ్లు వచ్చి పులిని చంపి మా కుటుంబాన్ని కాపాడారు” అన్నాడు హరిశివయ్యగారు.

"నీకుటుంబ మేమిటయ్యా, గ్రామాన్నంతా కాపాడారు. ఆ సమయానికి వచ్చి వాళ్ళు ఆదుకోకపోతే గ్రామం మీదపడి అందినజనాన్నల్లా నమలిపారవెయ్యక పోయిం దను కున్నారు! చెపితే అబద్ధమను కుంటారు. నామట్టుకు నేను ఇంట్లో తలుపు బిగించుకుని మెదల కుండా కూర్చున్నాను" అన్నాడు ఆచార్యులవారు.

"మీా రేమిటండీ! గ్రామం అంతా అట్లాగే చేశారు" అన్నాడు హరిశివయ్యగారు.

"చూడండి, సూరదాసు ఉన్నాడే వాడు ఎంతమంచి వా డనుకున్నారు! వాడి దైవభక్తి, వాడి ఆచారం, వాడి ఉదారస్వభావం, అనన్యమైనవి. మా బ్రాహ్మ లెందుకండీ తగలెయ్యనా వాడిముందు. శమదమాది గుణ సంపన్నుడు. నిజం చెపుతున్నాను, నా ప్రాణాలూ నా భార్యాప్రాణాలూ, నే చేసిన అపకారాన్ని తలచకుండా కాపాడాడు. మనం అంతపరాభవం చేసివుంటే నిజంగా చూడండి, మరి ఒకడు అట్లా చేస్తాడా? కాస్త వంక వస్తే ఇంకా పుల్లలు తోసి కక్షతీర్చుకోటానికి ప్రయత్నిస్తారు ఎవరైనా. మొన్న నాభార్యకు జబ్బుగావున్న దని పోతే ఎంతో నొచ్చుకుని గడగడలాడుతూ చెట్టు దూసి గంపెడాకు తెచ్చి ముందరపెట్టాడు. వాడా సహాయం చెయ్యక పోతే నా భార్య బతికేదే కాదు. అంతకు ముందు సంగతికూడా మీాకు తెలుసుగా? ఆ దెబ్బలో వాడు

లేకపోయినట్లయితే నన్ను అన్యాయంగా చంపివేసే వాళ్లు. నిజంగా వాడా కులంలో తప్ప పుట్టాడండీ" అన్నాడు ఆచార్యులవారు.

"వాడేమిలెండి, ఆ కులంలో పుట్టినవాడికల్లా సవర్ణులను చూస్తే ఒక విధమైన భక్తి గౌరవాలు వుంటవి. ప్రతివాడూ గ్రామానికి ఉపయోగిస్తూనే వుంటాడు. ఎప్పుడు చూచినా ప్రతివ్యక్తికీ ఏదో ఒక ఉపకారం చేస్తూనే వుంటారు" అన్నాడు హరిశివయ్యగారు.

౧౨

హరిజనోద్ధరణనిధి అధ్యక్షులైన కేశవరావుగారు కృష్ణశాస్త్రిని కలుసుకుని చూడ్డానికై గూడెంలోకి వెళ్లారు. వీరు దేశభక్తులు. మంచి వక్తలు. కొన్నాళ్లు గాంధీగారి ఆశ్రమంలో వుండి వారికి శుశ్రూషచేసి ధన్యులైన వారిలో ఒకరు. సర్వమానవసోదరత్వాన్ని ఆసించిన ఉన్నతాశయం కలవారు.

కృష్ణశాస్త్రి వారిని ఇంటింటికీ తీసుకవెళ్లి గూడాన్ని చూపించాడు. కేశవరావుగారు వాళ్లనుచూచి తన జీవితంలో ఎరగని తృప్తిని పడ్డాడు. ఒక సందులోనుంచి చెడ్డీ చొక్కా తొడుక్కుని ఏదో కూనిరాగంతీస్తూ వస్తూ వున్న ఒకచంటిబిడ్డను చూచి ముచ్చటపడి ఆ బిడ్డను ఎత్తు

కుని ముద్దాడి జేబులోనుంచి పావలాతీసి చేతిలోపెట్టాడు. కృష్ణశాస్త్రిచేసే హరిజనసేవను మెచ్చుకున్నాడు. "ఆంధ్రదేశానికి మణిపూసలాగా వున్నది ఈ గూడెం. జనం నాగరకంగా వున్నారు. పూరిగుడిసే, చింపిరితలా, మాసినగుడ్డా, మొండివాకిలీ, మచ్చుకైనా కానరావటం లేదు. ఎరగనివాళ్ళు హరిజనులని అనుకోనంతటి మార్పు చెందారు. సవర్ణుల్లో అన్నివిధాలా కలిసిపొయ్యారు. సవర్ణులవద్ద అన్నిహక్కులూ పొందేటందుకు తగినట్లున్నారు. గ్రామంలో విశాలదృష్టి కలవాళ్ళు ఎవరైనా వున్నట్లయితే వీళ్ళందరినీ ఆనందంతో ఎప్పుడో చేర్చుకుని వుండేవాళ్ళు. గ్రామంలో మీరు తప్ప అంతటివాళ్ళెవ్వరూ లేనట్టుంది. వాళ్ళా స్థితిలోవుండగాసమదృష్టితో చూడకపోవడం మానవత్వాన్ని కోలుపోయినట్టే" అన్నాడు కేశవరావుగారు కృష్ణశాస్త్రితో.

"అంతటి సమభావం గ్రామంలో ఏ ఒకళ్ళిద్దరికో వున్నా లాభం లేదు. ఇతరులతో ఆ మాటలంటే కర్రలు తీసుకుని తరుముతారు. ఎవ్వారి ధనార్జన వాళ్ళూ, ఎవ్వారి పేరు ప్రతిష్టలు వాళ్ళూ, ఎవ్వారి కుటుంబం వాళ్ళూ, చూచుకుని మురిసిపోవడమేకానీ, దిక్కులేక హీన స్థితిలో వున్న తోడి మానవులవంక కన్నెత్తయినాచూడరు," అన్నాడు కృష్ణశాస్త్రి.

"మనంగూడా ఇట్లాచూస్తూ ఊరుకుంటే లాభం

లేదు. ఎంతమాత్రం నిదానించేటందుకు వీల్లేదు. తగ్గ ప్రయత్నం చెయ్యాలి" అన్నాడు కేశవరావుగారు.

ఆ మరునాడే కొంత సత్యాగ్రహదళం ఆ గ్రామం వచ్చింది. వనమాలిగూడా ఆదళంలో చేరాడు. అందరూ ఉత్సాహవంతులైన యువకులు. అందరూ ఇళ్ళూ, వాకిళ్ళూ వదిలి దీనజనోద్ధరణకై తమదేహాలను సమర్పించిన త్యాగమూర్తులు. తెల్లవారుఝామునే అందరూ లేచి గ్రామంలోకి బయలుదేరి——

"మాలమాదిగ లనెడి భేదము మరిచిపోండీ అయ్యాలార!
నిజము గనుగొని దీనజనులను నెనరుతో గాపాడరయ్యా!
ఆదినుండీ వచ్చుచున్నా అంత్యకులజు లటంచు వారిని
దూరదృష్టీ లేక మీరూ పారదోలకు డయ్యాలార!"

అనే గీతాన్ని హృదయాలు కరిగి పొయ్యేటట్టు మాండుగర్భ రాగంపై ముక్తకంఠాలతో సందుసందుకూ తిరిగి పాడతారు. భోజనంచేసి కొంత విశ్రాంతి తీసుకుంటారు. సంతోషంఅంటే వాళ్లదే చెప్పాలి. వాళ్ళ విశ్రాంతి కాలంలో స్వార్థపరమైన ఆలోచనలు గానీ, కుయుక్తులూ, కుతంత్రాలుగానీ రావు. ఇతర గ్రామాదుల్లో హరిజనులకు జరుగుతూవున్న అన్యాయాలను గూర్చి ఆ గ్రామంలో అట్లా, ఈ గ్రామంలో ఇట్లా, అని చెప్పుకుంటూ ఆ వూళ్ళోవాళ్ళు మంచి స్థితిలోకి వచ్చారు. వీళ్లింకా నీచకార్యాల్లో వున్నారు. త్వరగా

బాగుపడే ప్రయత్నాలు చెయ్యాలి అనే ప్రసంగాలు వస్తవి. తరవాత ఆ దిన కార్యక్రమం ప్రకారం నడుచుకుంటారు. సాయంత్రం గూడానికి వెళ్ళుతారు. మామూలు ప్రకారం ప్రతిసందూ తిరిగి.

"నీచకృత్యాల్ వదిలి మీరూ నేర్పుతో డుత మెలగరయ్యా!
ఎన్నినాళ్ళని కటికి చీకటి యందు కానక ఉందురయ్యా!
మీస్వధర్మముమరిచి ఈ యమకూపమేమీ లోకమంచూ
నమ్మియుండుట మానవత్వము క్రోలుపోవు కెగా!"

అనే గీతాన్ని కళ్యాణి రాగంలో ఉత్సాహం కలిగేటట్టు పాడతారు. సూరదాసు వారిని లోపలికి పిలిచి చాపలు పరిచి ఫలహారాలూ, అవీ ఇచ్చి గౌరవిస్తాడు.

వాకిట్లో లోనికి పోదామా వద్దా అని వెనకా ముందూ ఆడుతూ వున్న సూరదాసుని మాధవాచార్యుల వారు లోపలికి పిలిచి "కూర్చో సూరదాసూ, లోనికి రావడానికి ఏం సందేహిస్తున్నావు ? ఈ గడప రాయి మీద కూర్చో" అన్నాడు.

"క్రింద కూర్చుంటాలెండి అయ్యా!" అని నేలమీద కూర్చో పొయ్యాడు సూరదాసు.

"పరవాలేదు. ఇట్లా కూర్చో" అన్నాడు ఆచార్యుల వారు.

సూరదాసు కూర్చుని "ఇవిగోనండి అయ్యాగారూ!

నా మగ్గాన నేశానండీ! అయ్యవారికి సమర్పిద్దామని ఒక రెక్కచాపు తడిపి పట్టుక వచ్చానండి. ఎక్కడ ఆర గట్టమన్నారు?" అన్నాడు.

"ఓహో! అట్లాగా! వాటి ఖరీదెంత అవుతుంది" అన్నాడు ఆచార్యులవారు అడుగు ముందుకు వేసి.

"ఖరీదుకు కాదండీ అయ్యా! పెద్దలు, తమకు ఉచితంగా సమర్పించటానికి తెచ్చానండి. ఈ దాసుడు భక్తితో సమర్పించేవి తమరు దయతో స్వీకరించాలి" అన్నాడు సూరదాసు.

ఆచార్యులవారు మందహాసం చేసి "ఎందుకు, పాపం నీకీ వృధాఖర్చు? అప్పుడప్పుడూ ఏవేవో సమర్పిస్తుంటావు" అన్నాడు.

"ఇ దేమీ వృధాఖర్చు కాదండీ! పెద్దలకు సమర్పించడంలో నాకేమీ వృధాఖర్చు కాదండీ, ఈ దాసుడు సమర్పించేదల్లా కాదనకుండా గైకొని ధన్యుణ్ణి చేసున్నారు. అదే పదివేలు" అన్నాడు నిమీలితనేత్రాలతో సూరదాసు.

"సరే, ఆ గోడకు ఆరగట్టు. పూర్వం ఎప్పుడైనా కనిపించేవాడివి. ఇప్పు డెక్కడా కనుపించటం లేదు" అన్నాడు ఆచార్యులవారు.

"అవునండి అయ్యా! ఖద్దరు పని చేస్తున్నానండి.

బయటికి వచ్చేటందుకు తీరడం లేదు. అయ్యావారి దర్శనం చెయ్యాలని చానాళ్ల నుంచీ అనుకుంటున్నానండీ. ఇవ్వాళ్ల ఎట్లాగైనా తీరుబడి చేసుక వచ్చానండి" అన్నాడు సూరదాసు.

"చూడు, నాలుగురోజుల నుంచీ మాఇంట్లో రామాయణం పురాణకాలక్షేపం జరుగుతూ వున్నది. పాపం నీకు పురాణా లంటే ఆసక్తి కామాలు, ప్రతినిత్యం సాయంత్రం నాలుగు గంటలకు ప్రారంభిస్తాము. తప్పకుండా వినేటందుకు నువ్వురా. వచ్చి దూరంగా ఆ గోడ దగ్గిర కూర్చుందువుగాని" అన్నాడు ఆచార్యులవారు.

ఈ మాటలకు సూరదాసు జన్మలో ఎరగని ఆనందాన్ని పొందాడు. తనను చూస్తే మైలుదూరం తప్పుకుని వెళ్లే ఆచార్యులవారు అట్లా అంటారని కలలోనైనా అనుకుని ఎరగడు. ఉప్పొంగి పొయ్యాడు. తన ఇష్ట దైవమైన రాముని చరిత్ర భక్తులయిన అయ్యవారు చెప్పగా వినడం తటస్థించిన నందుకు జన్మ ధన్య మయిందనుకున్నాడు. "అబ్బ! ఎన్నాళ్లకు నాకోర్కె సిద్ధించింది" అని పరవశు డయ్యాడు. తనయందు చూపిన నిర్హేతుక జాయమాన కటాక్షానికి ఆచార్యులవారిని స్తుతిస్తూ నమస్కారం చేసి "అయ్యగారికి ఇంతటి కరుణ నాపై వచ్చినందుకు కృతజ్ఞుణ్ణి" అన్నాడు.

"ఇందులో ఏమి విశేషం వున్నది సూరదాసూ ! నువ్వు మాకు చేసిన సహాయం మరిచినా మరుపు రానిది. దానికి నీకు ప్రతిసహాయం నా జీవితంలో చెయ్యలే ననుకుంటాను" అన్నాడు ఆచార్యులవారు.

"అయ్యగారూ ! తమ రట్లా సెలవివ్వగూడదు. నేను తమకు ఏమీ చేసింది లేదు. అంతా రాముడే చేశాడు. తమ సంపూర్ణానుగ్రహం నాపైన వుంటే చాలు. అదే పదివేలు" అన్నాడు సూరదాసు.

తెల్లవారి తన వాకిటి ముందుగా జాతీయగీతం పాడు కుంటూ పోతూ వున్న కాంగ్రెసు దళంలో ఒక వ్యక్తిని చూచి ఆచార్యులవారు కట్టెబారి పొయ్యాడు. ఆయన తన అల్లుడు శ్రీనివాసులు. వీళ్లల్లో ఎందుకు చేరాడో ఆయనకు అర్థం కాలేదు. గుండె తీవ్రంగా కొట్టుకో సాగింది. "మాఇంటికి ఎందుకు రాలేదు? ఎప్పుడూ అట్లా రాకుండా వుండలేదే.మాలవాళ్ల కొరకు ఈయన తిరగడ మేమిటి ? అయ్యో ! కులానికి ఎంత అప్రతిష్ట" అనుకుని తొందర తొందరగా వీధిలోకి వెళ్ళాడు. వాళ్లు కొంత దూరం దాటిపొయ్యారు. వాళ్లను కలుసుకుని అల్లుణ్ణి ఇంటికి పిలుచుక వచ్చాడు మాధవాచార్యులు.

"ఏమిటి ఎప్పుడు రావడం ? మా ఇంటికి రాలేదేమి? ఆ గాంధీ టోపీ ఏమిటి ? ఆ మాలల్లో తిరగడ మేమిటి ?

అయ్యో! ఎంత చిన్నతనం" అని గుక్కతిరక్కుండా అక్కడనుంచే అల్లుణ్ణి అడుక్కుంటూ వచ్చాడు. ఇంతలోకే ఇంట్లోనుంచి వచ్చి ఆండాళమ్మ "అయ్యా! ఎప్పుడు రావడం? ఇంటివద్ద పిల్లలు బాగున్నారా? మావమ్మాయి కులాసాగా వున్నదా" అంటూ కాళ్లకు నీళ్ళు తెచ్చి ఇచ్చింది.

"నాకు ఇప్పుడు తీరుబడి లేదు" వెళ్ళిపోవాలి, మీ ఇంట్లో కాళ్లు కడుక్కునేటందుకు వీల్లేదు." అన్నాడు శ్రీనివాసులు.

"ఇట్లా పెడదారి పట్టిం దేమిటి నీ మనసు. ఇంత విపరీతంలోకి దిగా వేమిటి?" అన్నాడు మాధవాచార్యులు నోటిమీద చెయ్యి వేసుకుని.

"ఎప్పుడు సాపాటు చేశావో నాయనా, భోజనానికి రా" అన్నది ఆండాళమ్మ.

"వీల్లేదు" అని విసవిసా నడిచి పొయ్యాడు శ్రీనివాసులు. ఆచార్యులవారు నిలిచి పొయ్యాడు. ఏమీ పాలు పోలేదు. వెళ్ళుతూవున్న శ్రీనివాసులను శూన్య దృష్టులతో చూస్తూ ఊరుకున్నాడు.

# ౧౩

ఆ రోజున సీతారామస్వామివారి కోవెలవద్ద సాయంత్రం నాలుగు గంటలనుంచీ మీటింగు జరుగుతుం దని గ్రామంలో కరపత్రాలు పంచిపెట్టారు. గ్రామంలో ముఖ్యులైన మాధవాచార్యులవారికీ, హరిశివయ్యగారికీ, దేవాలయం ధర్మకర్తలు నలుగురికీ ఇంకా, మరి కొంత మందికీ ప్రత్యేకంగా ఆహ్వానాలు పంపారు.

సాయంత్రం మూడున్నర గంటలకల్లా దేవాలయం వద్దకు చాలా జనం వచ్చింది. వేళకు కేశవరావుగారూ, సత్యాంబగారూ, కృష్ణశాస్త్రి ప్రభృతులు వాలంటీర్లతో సహా సభకు వచ్చారు. అధ్యక్షులుగా కేశవరావుగారిని ఎన్నుకున్నారు. సరసన కుర్చీలో సత్యాంబగారు కూర్చున్నారు. అధ్యక్షులు లేచి నిలబడ్డారు. జనం అంతా నిశ్శబ్దం అయింది.

సోదర సోదరీమణులారా! హిందూమతంలో బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర నాలుగు జాతులున్నా, పంచమ జాతికూడా ఏర్పరిచారు మనవాళ్ళు. నాలుగు జాతులూ భేదం లేకుండా ఒకళ్లని ఒకళ్ళు తాకవచ్చు. అంట రాదని ఇబ్బంది ఏమీ లేదు; కానీ అయిదవ జాతి వున్న దే పంచములు, వాళ్లని తాకితే సచేలస్నానం చెయ్యాలి. వాళ్లు కాలుపెట్టిన స్థలాన్ని నీళ్ళు చిలకరించి శుద్ధిపర

చాలి. వాళ్లు తాకిన లోహపు పాత్రలను అగ్నిసంస్కారం చేసి శుద్ధి చెయ్యాలి. ఈ అక్రమాన్ని చూచి తోడి మానవులుగదా, ఇదేమి అన్యాయమయ్యాలంటే ఏసమాధానం చెప్పలేక చూస్తూ చూస్తూ ఎలా గంగలో కలవమన్నావయ్యా! వాళ్ళు చేసేవన్నీ నీచకృత్యాలు, మాంసం తింటారు, తప్ప తాగుతారు. చూచేటందుకు అసహ్యాంగా వుంటారు అటువంటివాళ్లను ఎట్లా తాకమన్నావయ్యా అంటాడు ఏ పూర్వాచార పరాయణుడో. ఏమండీ, మాంసం తిని తప్పతాగేవాళ్ళు నాలుగు జాతుల్లోనూ వున్నారుగా. పంచములకంటే హీనంగా ప్రవర్తిస్తూ వాళ్లకంటే అసహ్యాంగా వుండే ఎరుకల ఏనాది వడ్డె ఉప్పర ఈ జాతులను తాకుతారు గదండీ అంటే, మళ్లీ జవాబు ఏమీ రాదు. పవిత్రమైన హిందూ మతానికి ఈ భేద భావాలు కల్పించి కళంక పరుస్తున్నారు. ఎటుతిరిగీ మనలో నియోగీ వైదిక తగాదాలూ, బ్రాహ్మణ విశ్వబ్రాహ్మణ కక్షలూ, కమ్మా రెడ్డీ భేదాలూ, వైష్ణవశైవ పోరాటాలూ, అడ్డబొట్టు నిలువు బొట్టు తగాదాలూ, అద్వాయితాద్వాయిత విమర్శనలతో ఇంటికొక సంఘం, మనిషికొక పార్టీ! ఒకరి కంపు ఒకరికి సరిపడదు. ఈ తగాదాలతో కర్తవ్య మేమిటో తెలుసుకోకుండా గంతులు వేస్తున్నాము. స్త్రీ పురుష రెండే భేదాలు. మన పిచ్చి పిచ్చి పోకడలను చూచి

పాశ్చాత్యులు నవ్వుతున్నారు. మీలో మీకు సరికానిది మీ దాస్యశృంఖలాలను తీసివెయ్య మంటున్నారు. ఐక మత్యం లేనందునా, అనవసరమైన భేదాలు కల్పించుకు న్నందునా, గొప్ప జనసంఖ్యగల హిందూమతం నానాటికీ సన్నగిలిపోతూ వున్నది. ఇతర మతాలు వాళ్ళని ఆకర్షిస్తున్నవి. చాలామంది హరిజనులు మనం పెట్టే బాధలూ మనం చూపే ఉదాసీనతా సహించలేక క్రియిస్తవ మతంలో కలిసిపోయ్యారు. ఇంకా ఇట్లాగే మనం కళ్ళు మూసుకుని ఊరుకుంటే చాలా జనం కలవ నున్నది. ఇప్పటికైనా కళ్ళు తెరిచి పరిశీలించండి. మన హిందూమతం క్షీణించి పోతూ వున్నది. మన జాతి నశించి పోతూ వున్నది. లేనిపోని భేధాలతో జాతిని అధోగతిలో తోయకండి. మనకింద దాస్యంచేస్తూ మీరే రక్షిం చాలని నమ్మి కొలుస్తున్నంతవరకూ వాళ్లను పాతాళానికి తొక్కివేస్తున్నాము. వాళ్ళు సంగతి గ్రహించి ఇతర మతంలో చేరి వ్యక్తిత్వాన్ని వాళ్ళు నిలబెట్టుకున్నాక పూలదండలువేసి పూజిస్తున్నాము. ఇకనైనా చచ్చుకునికి పాట్లల్లోనుంచి లేవండి. సహృదయంతో ఆలోచించండి. రైళ్ళల్లో కారుల్లో హరిజనులను ఆలింగనం చేసుకుంటు న్నాము. కాఫీహోటళ్ళలో భోజనహోటళ్ళలో వాళ్ళను సరసన కూర్చోబెట్టుకుని విందు లారగిస్తున్నాము. ఇంకె క్కడి అంటరానితనం. వాళ్ళను తాకి వాళ్ళతో ఏకంగా

తిరిగే ఇతర మతస్తులతో మనం కలిసి తిరుగుతున్నాము. గాని ఆ దీనులకుమాత్రం మనలో స్థిరమైన తావు లేదు. కూటికిలేని కడుపేదవాళ్ళు, పాపం మనకు లొంగి సేవ చేసే సజ్జనులు, అటువంటి దీనజనులను రక్షించనివాళ్లు ఎటువంటి మానవులు? నిజంగా వాళ్ళు మానవులే కాదు. హీన స్థితిలో వున్న తన సోదరుని పైకి తీసుకునిరావడం మానవ ధర్మం. మన హరిజన సోదరులు సంఘం అనే నదిలో అస్పృశ్యతా అనే ప్రవాహంలో కొట్టుకుని పోతూ వున్నారు. వాళ్ళను రక్షించడం ఒడ్డునవున్న మానవుల మైన మన విధి. ఇటువంటివన్నీ తెలుసుకుని మన సోద రులూ మనం ఏకంగా ఉండకపోతే ఇతర మతవ్యాఘ్రా లకు ఆహుతి అయిపోతాము.

ఇక వర్ణ ఉత్పత్తినిగూర్చి ఆలోచిద్దాము. జాతులు సనాతనమైనవి కావు. అంటే ఈశ్వరసృష్టి కాదన్న మాట. కులాలు ఈశ్వరసృష్టి అయినట్లయితే మానవు లకు మార్చుకునేశక్తి లేకుండా వుండాలి. ఈశ్వరనిర్మితాల యిన పంచభూతాలనూ, ఋతువులనూ, దివారాత్రు లనూ, అమావాస్య పూర్ణిమలనూ, ఎలామార్చు కోటానికి సాధ్యంకాదో అలాగే కులాలను కూడా మార్చుకోలేనంతటి స్థితిలో ఉండాలి. బ్రాహ్మణులైన వాళ్ళు ఎంతమంది శూద్రులుగా మారడంలేదు? శూద్రులు ఎంతమంది వర్తకులుగా బ్రాహ్మణులుగా, మారడం

లేదు. ఈ నాలుగు వర్ణాలవాళ్ళూ ఎంతమంది మహమ్మదీయ మతంలో క్రైస్తవమతంలో కలవడంలేదు? మనుష్యుని ఇష్టంపైన ఆధారపడివున్న ఈ జాతులు ఈశ్వరనిర్మితం అనటం శుద్ధవెర్రితనం. జాతులు నిజంగా ఈశ్వరనిర్మితాలే అయినట్లయితే మనిషిని చూడగానే ఫలానాజాతి అని బాగా గుర్తుపట్టేటంత చిహ్నాములతో ఆయా జాతి మానవులు పుట్టి వుండాలి. ఏనుగులు, గుర్రాలు, పులులు, సింహాలు వీటినిచూడండి. ఏనుగును చూడండి, నాలుగు కాళ్ళూ, తొండం, చెవులూ, ఈశ్వర సృష్టిలో దానికి తగినట్లుగా ఏర్పరచబడ్డవి. చూడగానే ఏనుగు అని గుర్తుపట్టగలం. అట్లాగే గుర్రంచూడండి అదీనాలుగు కాళ్ళజంతువే. చెవులూ తోకా వేరు. చూడగానే చప్పున గుర్రం అనేస్తాము. సింహం పులినీ చూడండి, అవీ నాలుగు కాళ్ళజంతువులే. రూపాలు అంతా వేరు. చూడగానే తవుడుకోకుండా వాటిపేర్లు చెప్పివేస్తాము. అట్లాగే మానవులలో జాతులుకూడా ఈశ్వరసృష్టి అయినట్లయితే పై జంతువులను చూచి చప్పున గుర్తుపట్టినట్లే ఏదో కొంత మార్పులతో అంగ సౌష్టవం కలిగి ఆయా జాతులవాళ్ళు పుట్టి వుండాలి. మనం తెలుపుబట్టలకు వేసుకున్న పసుపు, ఎరుపు, నీలం, నలుపు రంగులను ఈశ్వరనిర్మితమైన తెలుపురంగుగల ప్రత్తిని మరిచిపోయి ఈ రంగులతోనే వస్త్రాలు ఉత్పత్తి అయిన

వని అనుకోవడం ఎంతన్యాయమో ఈశ్వరనిర్మితమైన లోహాలను మరిచిపోయి వాటితో చేసిన పాత్రలను ఈశ్వరనిర్మితాలే అనడం ఎంతన్యాయమో జాతులు కూడా ఈశ్వరనిర్మితా లనడం అంత న్యాయం. ఇక్కడికి జాతులు మానవసృష్టి అయినట్టు తేలిపోయింది. ఆ కాలంలో ఆకాలానికి తగ్గట్టు ఏర్పరుచుకున్న పద్ధతులను ఇప్పటి అనుకూలప్రకారం మనం ఎందుకు మార్పు చేసుకోరాదు ? ఇప్పటి నాగరిక దేశాలు ఎప్పటి అనుకూల ప్రకారం అప్పుడు న్యాయసమ్మతమైన కట్టుబాట్లను ఏర్పరుచుకుని దినదినాభివృద్ధితో పైకొస్తున్న రోజులివి. ఇటువంటప్పుడు పూర్వసాంప్రదాయాలనే నమ్మివుండడం మన బాగును మనం కోరుకోవడం లేదన్నమాట. ఇకనైనా గుర్తెరిగి సర్వమానవ సౌభ్రాతృత్వానికి పాటుపడండి. హరిజనసేవకు మీ కాలం గడపండి. వెంటనే దేవాలయాలూ, బావులూ, హరిజన సోదరులకు తెరిచి స్వధర్మాన్ని మీరు నిలబెట్టుకోండి. నేను ఈ నూతనయుగంలో ఎక్కువగా బోధించవలసిన అవసరంలేదు." అని ఇంకాఏవో చెప్పి కేశవరావుగారు వారిస్థానంలో కూర్చున్నారు. జనంలో కరతాళధ్వనులు. ఆ పైన సత్యాంబగారులేచి ఉపన్యాసం ఇచ్చారు. కృష్ణశాస్త్రి కొంతచెప్పాడు. సభ చాలించారు.

## ౧౪

మాధవాచార్యులవారు సభనించి ఇంటికి వచ్చారు. ఉపన్యాసం ద్వారా విన్న సంగతులన్నీ ఆయనకు న్యాయంగానే కనిపించినవి. విన్న ఒక్కొక్క సంగతీ తాను విమర్శించుకోవడం మొదలు పెట్టాడు. "నిజంగా రైళ్ళల్లో, భోజన హోటళ్ళల్లో, పట్టణాల్లో, వాళ్ళని కలుసుకునే తిరుగుతున్నాము. వాళ్ళను కలుపుకుంటున్న ఇతర మతస్తులతో విహారం చేస్తున్నాము. అంతా ఎప్పుడో కలిసి పోయింది. జాతులు సనాతనాలే అయితే నిజంగా మానవులు మార్చుకునే టందుకు వీలవుతుందా? ఇవ్వాళ్ళ చూచినవాడు రేపు మారిపోతూ వున్నాడు." అనుకున్నాడు. తన అల్లుడు శ్రీనివాసులు వాళ్ళల్లో ఎందుకు చేరిందీ అప్పుడు ఆయనకు బోధ పడింది. సహృదయంతో గ్రంథాలు తిరగ వేసి చూచాడు. ఆయన మనస్సుకవి ఏవీ నచ్చలేదు. వేదంలో వున్న బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర నాలుగు జాతులూ వృత్తికి పేర్లని గ్రహించాడు. ఆయనలో గొప్ప మార్పు కలిగింది.

ఆ గ్రామం సీతారామస్వామివారి కోవెలకు సంవత్సరానికి హాదాపు పదివేల రూపాయలు ఆదాయం వస్తుంది. గుడికి ఏర్పడ్డ నలుగురు ట్రస్టీలూ స్వామిని దర్శిస్తే సుంకం. హారతి ఇస్తే పన్నూ. పూజ చేయిస్తే

కట్నం. ఇట్లా కేట్లు ఏర్పరిచి స్వామిని ప్రదర్శన వస్తువు కింద చేసి వేశారు. సొంత బాకీలు రాకపోతే స్వామి మూల ధనంలో బాకీవాళ్ల పేర సొమ్ము ఇప్పించి తన బాకీలు రాబట్టుకునే ట్రస్టీ ఒకడూ, స్వామి నౌకర్లను తన ఇంటి పనులకు ఉపయోగించుకునే ట్రస్టీఒకడూ, తాను అడిగితే డబ్బు ఇవ్వరని ఏ ఆస్తీలేని స్నేహితుడి పేరుతోనో ధనవంతుడని నమ్మించి నోటువ్రాయించి ఆ డబ్బు తనుకొట్టివేసే ట్రస్టీఒకడూ, ఎప్పుడు ఏ బిత్తిరీ వేసి డబ్బులాగేద్దామా అని చూచే ట్రస్టీఒకడూ, ఇట్లా ఆ స్వామిని నోరులేనివాణ్ణిచేసి ఆడిస్తున్నారు. త్రేతా యుగంలో దుష్టశిక్షణార్థం అవతరించిన ఈ సీతా రాములు కలియుగంలో వీళ్ళ చేతుల్లో చిక్కి విధిలేక వీళ్ళ చెప్పుచేతల్లో నడుచుకుంటున్నాడు.

ఇక గుమాస్తాలసంగతి చూద్దాం. స్వామికి నిత్యనైవే ద్యానికి తెచ్చేవంట సామగ్రి మొదలుకుని విలాయి కర్ర పట్టే కూలిమనిషివరకూ వాళ్ళతిప్పలు వాళ్ళుపడతారు. ఇక వంటబ్రాహ్మల్లో అంటే ఉప్పుదగ్గరనుంచీ బియ్యం బస్తాలవరకూ దాటిపోతూ వుంటవి. ఇక అర్చకులను చెప్పవలసివస్తే బైట చెల్లించుకునే కట్నాలుగాక ప్రత్యే కంగా వీరికి కానుకలు వుంటవి. కొట్టిన టెంకాయలు మొదలుకుని పులిహోర చక్కెరపొంగలి మొదలైన ప్రసాదాలవరకూ చక్కగా అమ్ముడుపోతూ వుంటవి.

పైసాచూపిస్తేనేగాని శఠగోపురం నెత్తిన పెట్టడు. ఇం కెందుకు స్వామిని వింతవస్తువుగా మార్చి ధనాన్ని సం పాదిస్తూ వున్నారు.

ఏదన్నా ఉత్సవం వస్తే "భోగంమేళం పిలిపిద్దాం" అంటాడు ఒక ట్రస్టీ. మరిఒక ట్రస్టీ "స్వామిముందర వాళ్ళను ఆడించటం ఏమిటి ? పూర్వపద్ధతులు తీసివెయ్యా లి"అంటాడు. ఇంకొక ట్రస్టి "కాదు వుండాలి వేశ్య లంటే దేముడికి ఇష్టమే కృష్ణావతారంలో వున్నప్పుడు ఈస్వామి ఎంతమంది గోపికలతో రాసక్రీడ చెయ్యలేదు? వాళ్లను పెట్టందే స్వామికి తృప్తి వుండదు" అంటాడు. ఎట్లయితేనేమి వేశ్యలను తెప్పించి పరస్త్రీవిముఖుడైన ఆ శ్రీరాముని ముందు ఆడిస్తారు.

సభజరిగిన మరునాడు ట్రిస్టీలు నలుగురూ దేవా లయపు లెఖ్ఖలు చూచుకుంటూ వుండగా కేశవరావు మొదలైనవారు గుళ్ళోకి వెళ్ళారు. హరిజనులకు దేవా లయ ప్రవేశం ఇప్పించవలసిందని ట్రస్టీలను ప్రార్థించారు; "అన్ని దేవాలయాలూ కానివ్వండి" అని ఒకాయనా, "ఇప్పుడు వాళ్లు దేవాలయంలో జొరపడ్డమాత్రాన వాళ్ళకు వచ్చే లాభమేమిటి" అని ఒకాయనా "తరవాత చూద్దాములే" అని ఒకాయనా "అందరికీఇష్టమైతే నాకూ ఇష్టమే" అని ఒకాయనా, ఇట్లా అందకుండా పొంద కుండా జవాబుచెప్పారు. ఆ దీనులను రక్షించవలసిందని

జాలికలిగేటట్లు మాట్లాడారు. వాళ్ళహృదయాలు కరగ లేదు. కాళ్ళూచేతులూ పట్టుకుని బతిమలాడారు, లెఖ్ఖచెయ్యలేదు. వాళ్ళశక్తికొద్దీ ఎన్నోనీతులు చెప్పారు. ఎన్నోబోధలు చేశారు. నల్లరాయి కరిగిపొయ్యే టట్లు దీనంగా మాట్లాడారు. కానీ వాళ్ళకు ఇవన్నీ మనుబోతుమీద వర్షం కురిసినట్టయింది. ఆఖరకు సత్యాగ్రహం చేస్తామన్నారు. అదీ లెక్కలేక పోయింది.

సభ జరిగిన మరునాడు ఆచార్యులవారు హరి శివయ్యగారిని తనఇంటికి పిలిపించుకుని ఇట్లా అన్నారు. "ఏమండీ హరిజనుల దేవాలయప్రవేశానికి ఆజ్ఞయివ్వమని ట్రిష్టీలను కేశవరావు మొదలైనవాళ్ళు అడిగితే వాళ్ళు కాదని చెప్పారట. మనకు చేసిన సహాయాలకు మనం ఈ దెబ్బలో వాళ్ళకు తప్పక మేలు చేసి తీరాలి. ఎట్ల యినా దేవాలయ ప్రవేశం వాళ్ళకు ఇప్పించి తీరాలి" అన్నాడు.

అందుకు ఆయనలో గలిగిన మార్పుకు హరిశివయ్య గారు ఆశ్చర్యపడి "వాళ్ళను చూస్తే దూర దూరం పొయ్యే మీకు వాళ్ళు గుళ్ళోకి వస్తే ఇష్టమవుతుందా?" అన్నాడు.

"అంతా గ్రహించాను. సృష్టిలో స్త్రీ పురుష జాతులు రెండే. తతిమ్మావన్నీ ఈ మధ్య కల్పించినవి. నిన్న ఉపన్యాసం మీరుగూడా విన్నారు గదా. అది విన్నాక

నా మనసు మార్చుకోక తప్పింది కాదు. సర్వాంతర్యామి అయిన భగవానుని తోడి మానవులు దర్శించకుండా అడ్డుపెట్టడం ఎంత పాపం? గ్రంథాలన్నీ తిరగ వేసి చూచాను. ఇదివరికి నమ్మిన సంగతులే న్యాయ దృష్టితో చూస్తే ఇప్పుడు బూటకాలు అయిపోయినవి" అన్నాడు ఆచార్యుల వారు.

"మీ మాటలకు సంతోషిస్తున్నాను. మీకు సర్వ సమత్వ భావం గలిగినందుకు ఆనందిస్తున్నాను. సజ్జనులై ఒక మూల ఒదిగి వున్న మానవులను బయటికి తీసుకొని రావడం మానవ ధర్మం" అన్నాడు హరిశివయ్యగారు.

"సజ్జనులని మెల్లిగా అంటారు, నిజంగా విచారిస్తే వాళ్ళకంటే మనమే దుష్కార్యాలు ఎక్కువగా చేస్తున్నాము. వాళ్లు చేసేవి పైకి కనపడేవి. మనం చేసేవి కనపడనివి. సంఘం అందరూ చేస్తున్నప్పుడు తాను చేసేది తప్పని ఎవరికి తెలుస్తుంది? మనం తప్పు అనుకోకుండా చేసేవి ఎన్నో వున్నవి" అన్నాడు ఆచార్యుల వారు.

"నిజం చెప్పారు. అవన్నీ అట్లా వుంచండి. వాళ్లు మనకు చేసిన ఉపకారానికి మీ రన్నట్లు ఈసమయంలో దేవాలయ ప్రవేశం ఇప్పించటం నాకుగూడా ఇష్టం" అన్నాడు హరిశివయ్యగారు.

"నిజంగాచూస్తే అందరినీ సమంగా సృష్టించి అంద రికీ కావలసిన భగవానునికి తాళంవేసి మీరు రాగూడ దని కొందరిని ఆపడం ఎంత దౌర్జన్యం! మన సంఘం ఎక్కువగా వున్నది కాబట్టి మాట సాగిపోతూ వున్నది. మనకంటే వాళ్ళే జనం ఎక్కువైతే మీ రేమన్నా ఆప గలరా, చెప్పండి?" అన్నాడు ఆచార్యులవారు.

"మీరు చెప్పింది నిజమే. అయినా వాళ్లిప్పుడు ఎంత శుచిగా ఉంటున్నా రనుకున్నారు!" అన్నాడు హరి శివయ్యగారు.

"అవును, అన్నీ కూడినవి. వాళ్ళకు మంచిరోజులు వచ్చినవి. సమయం చూచి దేవాలయప్రవేశం ఇప్పించి వేద్దాము. మీరూ నేనూ పట్టుపట్టామంటే అదినెరవేరక పోదు" అన్నాడు ఆచార్యులవారు.

"బావులు గూడా తెరవండి వాళ్ళు ఊరుకోరను కుంటాను" అన్నాడు హరిశివయ్యగారు. "ఇంకా అక్కడ అడ్డు ఎందుకు? జలాన్ని సర్వప్రాణులకోసం ఈశ్వరుడు సృష్టించినవి గానీ మన మేమీ సొంతంగా పుట్టించినవి కావు. అటువంటప్పుడు మనంచెయ్యలేని దానికి మన పెత్తనమేమిటి? బావులుగూడా వాళ్ళకు తెరవవలసిందే" అన్నాడు ఆచార్యులవారు.

## ౧౫

కేశవరావుగారు దేవాలయందగ్గర ఉపవాస దీక్ష మొదలు పెట్టారు. వాలంటీర్లుకొందరు "మేము కూడా ఉపవాసాలు చేస్తాము" అన్నారు. "మీ వుత్సాహాన్ని నే నెందుకు తీసివెయ్యాలి" అని కేశవరావుగారు అంగీకరించి, వాళ్ళను నలుగురుట్రిస్టీల ఇళ్ల ముందూ, దేవస్థానం స్థానాచార్యులయిన మాధవాచార్యులవారి ఇంటిముందూ, గ్రామంలో ముఖ్యుడయినహరిశివయ్యగారి ఇంటిముందూ ఇంటి కొకమనిషి చొప్పున ఏర్పరిచాడు. ఉపవాస దీక్ష ప్రారంభ మయింది. ఉపవాసప్రారంభదినం పత్రికల్లో అదివరకే పడ్డది. గాన ఆనాటికి ఇతర గ్రామాదుల నుంచి కాంగ్రెసు నాయకులూ, ఇంకా చాలాజనం, వచ్చారు.

ట్రిస్టీలు ఉపవాస దీక్షాపరులను వాళ్ల ఇంటి అరుగులమీదనైనా కూర్చోనివ్వలేదు. ఎర్రటి అగ్గిలో నడిబజారులో ఉపవాసం చేస్తున్నారు. కొందరు అభిమానులు ఆ త్యాగ మూర్తులకు గొడుగులు పట్టి నీడ చేస్తున్నారు. కొందరు ఉదారులు ఆ ధీరులకు విసన కర్రలతో విసురుతున్నారు. కొందరు పండ్లు సమర్పించి తిన వలసిందని ప్రార్థించి వాళ్ల భక్తిని వెల్లడిస్తున్నారు. అందుకు వాళ్ళు "మేము తినము. ఆ దీనులకు దేవా

లయాలూ, బావులూ, తెరిచిందాకా దేనినీ ముట్టము. ఈ ప్రాణాలుపోయినా ఒప్పుకుంటాము. ఈ అక్రమాన్ని చూస్తూ బతికేదానికన్నా ఈ శరీరాన్ని సద్వినియోగం చేస్తే మంచిది'' అంటున్నారు. కొందరు అక్కడక్కడా ఉపన్యాసాలిస్తున్నారు. ఆ గ్రామంలో అలజడి బయలుదేరింది. ఎక్కడ చూచినా జనం గుంపులే, ఎక్కడ చూచినా ఈ ప్రసంగాలే, ఇంకా కార్ల మీదా జట్కాల మీదా జనం వస్తూవున్నది. ఆ ఒక్కనాటికే ఆ గ్రామమంతా జనంతో నిండిపోయింది.

ఆ రోజు గడిచింది. తెల్లవారి ఇకచూస్తూ ఊరుకుంటే లాభంలేదని మాధవాచార్యులవారూ హరిశివయ్యగారూ నలుగురు ట్రస్టీలనూ పిలిపించారు. వారితో ఆచార్యులవారు ఇట్లా అన్నారు. "ఏమండీ! నేనొక మాట చెప్ప బోతున్నాను. కేశవరావు మొదలయిన వారు హరిజనులకు దేవాలయ ప్రవేశం ఇవ్వమని అడిగితే మీరేమో కాదన్నారట. అందుకనే ఈ ఉపవాస దీక్ష మొదలుపెట్టారు. వాళ్ళెట్లైనా హరిజనులకు దేవాలయ ప్రవేశం ఇచ్చిందాకా పట్టు వదలరు. ఆఖరకు వాళ్ళ ప్రాణాలయినా అర్పిస్తారు గానీ ఉపవాస దీక్ష మానరు. అందువల్ల వాళ్ళకు వృథాగా శ్రమ గలిగించి ఇచ్చేదానికన్నా ముందుగానే ప్రవేశం ఇస్తే చాలా గౌరవంగా వుంటుంది." అన్నాడు.

ఆచార్యులవారి మాటలకు ఆశ్చర్యపడి ఒకట్రిష్టీ "మాలో సత్తా తియ్యడానికి అట్లా అంటున్నారా" అన్నాడు.

"కాదు, హృదయపూర్వకంగా చెప్తూ వున్నాను. నా మాటలు మీకు విపరీతంగానే తోచవచ్చు. నిజం చెప్తా వినండి. సర్వమానవులూ ఒకటే నని గ్రహించాను. వర్ణ విభేదాలు కల్పితాలని తెలుసుకున్నాను. దూర దృష్టితో చూస్తే అందరూ గ్రహించగలరు" అన్నాడు ఆచార్యులవారు.

ఆయనలో గలిగిన గొప్పమార్పుకు వింతపడి ఒక ట్రిష్టీ అన్నాడు. "అయ్యా! తమరే అట్లా సెలవిస్తుంటే మేమేమి చెప్పగలం? మనం ఆ పనిచేస్తే గ్రామం ఊరు కుంటుందా? కర్రలు తీసుకుని పైన పడతారు."

అందుకు హరిశివయ్యగారు అన్నాడు. "గ్రామం ఏమన్నా చేస్తుందని మీరు భయపడవద్దు. గ్రామం జవాబుదారీ నాది. మీరు తప్పక వాళ్లకు దేవాలయ ప్రవేశం ఇవ్వండి. మీ కేదన్నా హెచ్చుతగ్గు వస్తే నేనున్నాను."

ఆచార్యులవారు "ఏమండీ! ఇంకా మీ కేమిభయం? గ్రామం అంతా వారిచేతులో వున్నది. మీ కేమీ పరవా లేదు. కానివ్వండి" అన్నాడు.

వైదిక సిద్ధాంతాలను నిరూపించే సర్వశాస్త్రప్రపం కేతులై దేవస్థానం స్థానాచార్యులైన ఆచార్యుల వారూ గ్రామంలో పలుకుబడి గలిగి మంచి పేరు ప్రతిష్టలుగల హరిశివయ్యగారూ అట్లా అంటున్నప్పుడు వాళ్ళ కేమీ సమాధానం చెప్పలేక ఎట్లైతే నేమి నలుగురు ట్రష్టీలూ పరివేశానికి అంగీకరించారు.

ఆ శుభవార్త వాయువుకంటే వేగంగా గ్రామంలో నిమిషంలో అల్లుకుపోయింది. కేశవరావూ, కృష్ణశాస్త్రీ, మొదలయినవాళ్లు విని ఆనందభరితు లయ్యారు. వాళ్లు పడిన శ్రమకు ఫలితం గలిగినందుకు ఉప్పొంగిపోయ్యారు.

సాయంత్రం అయిదు గంటలయింది. గూడెంలో సూరదాసు మొదలయినవాళ్లు స్నానాలుచేసి, కర్పూరం, టెంకాయలూ, పట్టుకుని జయజయధ్వానులతో దేశనాయకులూ, మాధవాచార్యులవారూ, హరిశివయ్యగారూ, మొదలైనముఖ్యులు కలిసిరాగా; చూడవచ్చిన జనం వెంట నడుస్తూ వుండగా; మంగళ తూర్యనాదాలతో గ్రామంలో ఊరేగుతూ దేవాలయ ప్రవేశం అయ్యారు. శకుంతసంతతులు శ్రేణులుగా తీర్చి వాళ్ళను దేవాలయం వరకూ సాగనంపి వాటి ఆనందాన్ని వెలిబుచ్చినవి. వాటి కిలకిలారావాలు జాతీయగీతాలనూ వేదాధ్యయనాలనూ మించినవి. గుడిముందు పండుకునివున్న బసవన్న వస్తూవున్న జనాన్నిచూచి లేచి రంకెవేసి దారి

యిచ్చి, తన అంగీకారాన్ని తెలియచేశాడు. నెమళ్లు నాట్యం చేసినవి. శుకశారికాదులు పాటలు పాడినవి. పుష్పాలు వికసించి తమసంతోషాన్ని వెల్లడిచేసినవి.

ఆ అవకాశాన్ని పోగొట్టుకోకుండా ఆ దివ్య మహోత్సవాన్ని మహాత్మా ఫిలిం కంపెనీవారు చలన చిత్రంగా తీశారు. సూరదాసు గుడిలోకివెళ్ళి సీతా రాములకు భక్తితో సాష్టాంగనమస్కారం చేసి, పరవశు డై ఆనందబాష్పాలు రాల్చాడు. వానరాలకు ఆశ్రియ మిచ్చిన రామస్వామి నరులను చేర్చుకోకుండా వుండ గలడా! స్వామి ఆ అపూర్వ భక్తసమ్మేళనానికి వికసిత వదనంతో తన భక్తులను వీక్షించాడు. సాటిలేని తన కరుణాదృష్టులు తన బిడ్డలపై ప్రసరింప చేశాడు.

ఆరోజునే బావులుగూడా తెరిచారు. చూడ వచ్చిన జనాన్నల్లా ఆపి గుంటూరుకాపరస్థుడైన ఒక షావుకారు ఆ మరునాడు గొప్ప సంతర్పణ చేసి తన హరిజనాభిమానాన్ని వెల్లడిచేశాడు. ఆ సంతర్పణలో వర్ణవివక్షత లేకుండా అందరూ కలిసి మహదానందంతో విందుకుడిచారు. ఆ రోజునే ఒక గొప్పసభ గూడా జరిగింది. ఆ సభలో సూరదాసుకు సంఘోద్ధారక బిరు దాన్ని, కృష్ణశాస్త్రికి హరిజనోద్ధారక బిరుదాన్ని, సమర్పించి వాళ్ళను గౌరవించారు. తుచ్ఛభేదభావాలు లేకుండా ప్రజలందరూ ఒకటైపోయ్యారు. ఈశ్వరుని

నిజమైన విశ్వరూపాన్ని ప్రత్యక్షంగా చూచి జనులు ధన్యులయ్యారు.

ఆ తెల్లవారి సూరదాసు మాధవాచార్యులవారి ఇంటికి వెళ్లాడు. చాపపరిచి సూరదాసును కూర్చోమని చెప్పి ఆచార్యులవారు లోనికివెళ్లి ఒకపుస్తకాన్ని పట్టుక వచ్చి, "ఇదిగో సూరదాసూ, పాపం నాడు మేము తీసుక వచ్చిన నీ భగవద్గీత పుస్తకం" అని అతనిచేతికి పుస్తకాన్ని ఇచ్చి "నీకు తెలియని శ్లోకాలకు నన్ను అడిగి అర్థం తెలుసుకుంటూ వుండు" అన్నాడు.

"అలాగే నాయనగారూ! తమకు అలాంటి దయ వచ్చినందుకు కృతార్థుణ్ణి. ఈ సమయంలో ఈ దీనజనులను రక్షించారు. మీరుణం ఎన్నటికి తీర్చుకోగలమో!" అన్నాడు సూరదాసు.

"అది మా కర్తవ్యం.అందులో ఏమీ విశేషంలేదు" అన్నాడు ఆచార్యులవారు.

మాధవాచార్యులవారి ఇంటికి సంక్రాంతి పండగకు అల్లుణ్ణి తీసుకవచ్చారు. సూరదాసు వచ్చి "బాబుగా రెప్పుడో దయచేశారు" అని నమస్కారం చేసి తుంగచాప మీాద కూర్చున్నాడు.

శ్రీనివాసులు తిరుగా నమస్కారం చేసి "రాత్రి వచ్చాను సూరదాసుగారూ!" అని సూరదాసు దగ్గిర

వెళ్ళి కూర్చుని హరిజనుల విషయాలూ అవీ అడిగి తెలుసు కుంటూ, పిచ్చాపాటీ కాస్సేపు మాట్లాడుకున్నారు.

అత్తగారు భోజనానికి లెమ్మని నీళ్ళు పెట్టింది. "సూరదాసుకుగూడా నీళ్ళు ఇవ్వ" మన్నాడు శ్రీనివా సులు.

"ఎందుకులేండి బాబుగారూ!" అన్నాడు సూరదాసు.

"నువ్వేమీ సందేహించబోకు" అన్నాడు శ్రీనివా సులు.

ఆమె వెనకాముందూ చూడకుండా నీళ్ళు తెచ్చి ఇచ్చింది సూరదాసుకు. "ఈ వసారాలో విస్తళ్లు వెయ్యి. ఇక్కడ మే మిద్దరం కూర్చుంటాము" అన్నాడు శ్రీని వాసులు.

ఇద్దరూ కాళ్లు కడుక్కుని విస్తళ్ళముందు పీటలమీద కూర్చున్నారు. ఆండాళమ్మ భక్ష్యాలూ, పులిహోరా, చక్కెర పొంగలీ, కొసరి కొసరి వడ్డించింది. "సూరదా సూ! నువ్వేమీ భిడియపడబోకు" అంటున్నాడు మధ్య మధ్య శ్రీనివాసులు. ఆఖరికి మీగడ పెరుగు వడ్డిం చింది ఆండాళమ్మ. భోజనాలు పూర్తి అయినవి. సూర దాసు విస్తరి ఎత్తబోతూ వున్నాడు. బలవంతంమీద విస్తరి తియ్యనివ్వకుండా చేశాడు శ్రీనివాసులు. ఇద్దరూ

లేచి చేతులు కడుక్కున్నారు. తాంబూలాలు వేసుకుని హరిజన పేటకు బయలుదేరారు.

ఒక రోజున పిచ్చమ్మ మంచినీళ్ళబావి దగ్గిరికి వెళ్ళి నీళ్లు తోడుతూ వున్నది. ఇంతలో హరిశివయ్యగారి భార్య భద్రమ్మ బిందెచేత పుచ్చుకుని వచ్చి "ఎన్ని బిందెలుచేర బోశావు పిచ్చమ్మా! అని అడిగింది. "ఇప్పుడే నండమ్మా! వచ్చాను" అన్నది పిచ్చమ్మ. భద్రమ్మ నీళ్లు చేదుతూవున్నది. పిచ్చమ్మచేద లాగి బిందెనిండగా మిగిలిననీళ్లు కాళ్ళమీద పోసుకుని చేద అక్కడపెట్టి బిందె ఎత్తేటందుకు ఎదురు చూస్తూ వున్నది. అది కనిపెట్టి భద్రమ్మ "నే నెత్తుతా వుండు" అని వచ్చి పిచ్చమ్మ నెత్తికి బిందె ఎత్తింది.

పేటలో మగ్గాలు చాలా అభివృద్ధి అయినవి. జరీపేట్లు వగైరా ఖరీదుగల బట్టలు నేస్తున్నారు. పేట ఎన్నో రెట్లు ఇప్పుడు ఇంకా బాగున్నది. ఒకరిని యాచించకుండా సొంతంగాఉపాధ్యాయులనుపెట్టిపాఠశాల నడుపుకుంటూ వున్నారు. పేటలో ఇళ్లు చాలా పెరిగి గ్రామంలోకి గదుముకుని రెండూ కలిసిపోయినవి. మాలపల్లె మాదిగ గూడెం అన్ననామాలు పోయినవి. హరిజనపేట అని ఇప్పుడు వ్యవహరిస్తున్నారు. పేటలో ఎవరికైనా ఉత్త రాలు వచ్చేటట్లయితే హరిజనపేట నే వ్రాసివస్తున్నవి. అం దరికీ కొద్దో గొప్పో భూవసతులుగూడా ఏర్పడ్డవి. జాలయ్య బజారులో ఖద్దరుబట్టల కొట్టు పెట్టాడు. ఆవ్వాళ్ళో తయా

రయ్యే వస్త్రాలూ అవీ అతడే అమ్మివేస్తున్నాడు. ఇంకా చురుకుగల వాళ్ళంతా బజారులో దుకాణాలుపెట్టి వ్యాపారాలు చేస్తున్నారు. నువ్వు అంటే నువ్వు, మీరు అంటే మీరు, ఏమండీ అంటే ఏమండీ అనేపరిస్థితిలోకి మారిపోయ్యారు హరిజనులు.

సూరదాసుకొడుకు పేరు సీతారాములు. పది పన్నెండేళ్ళ కుర్రవాడు. గిరజాలూ, జుట్టుముడీ, ముఖంలో ఒక విధమైన చురుకుతనమూ, ఖద్దరుబట్టలతో మంచి ఆకర్షకంగా ఉంటాడు. చక్కనిశారీరం. గ్రామఫోను రికార్డుల్లో విన్నపాటలు నూర్పు లేకుండా పాడతాడు. పుస్తకాలు తీసుకుని బడికివెళ్ళేటప్పుడూ వచ్చేటప్పుడూ కంటబడ్డాడా గుమ్మాల్లో నిలుచున్న స్త్రీలూ, అరుగులపై కూర్చున్న మగవాళ్ళూ, బళ్ళో పంతుళ్ళుగానీ ఎవరైనాసరే బతకనివ్వరు. ఆఖరకు ఒకటో రెండో పద్యాలో పాటలో పాడిపోవలసిందే.

మధ్యాహ్నం పూట బడి-వుండదుగాన అమరకోశం పాఠం చెప్పుకునేటందుకుగాను మాధవాచార్యుల వారి వద్ద కుర్రవాణ్ణి ఒప్పగించాడు సూరదాసు. ఆచార్యుల వారుకూడా అప్పుడప్పుడూ సీతారాములుచేత ఏవేవో పాటలు పాడించుకుని ఆనందిస్తూ వుంటాడు. ఆచార్యుల వారి కడసారి అమ్మాయిపేరు తరళ. పదేళ్ల వయస్సు వుంటుంది. ఎర్రటిశరీరం, గుండ్రటిముఖం, వాలుజడా,

ఖద్దరు బట్టలతో నాజూకుగా వుంటుంది. ఆ అమ్మాయి తండ్రి లేనప్పుడు సీతారాములను "నిన్న పాడావే ఆ పాట మళ్లీపాడు. ఇందాకటి పద్యం చాలా బాగుంది. మళ్లీ పాడు" అని ఎప్పుడూ అడిగి పాడించు కుంటుంది. ఒకనాడు రాకపోతే రాలేదేమని అడుగుతుంది. ఒక్కొక్క-రోజు "నువ్వేదన్నా పాడితే నేను పాడతాను" అంటాడు సీతారాములు. ఆ అమ్మాయి తనకువచ్చిన ఏదో పాట పాడి "బాగా వున్నదా" అని నవ్వుతుంది. సీతారాములు కూడా నవ్వుతాడు.

సంపూర్ణం.